# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS

IN THE

## GOVERNMENT ORIENTAL MANUSCRIPTS LIBRARY MADRAS

BY

MAHĀMAHŌPĀDHYĀYA VIDYĀVĀCASPATI S. KUPPUSWAMI SASTRI, M.A.

*Professor of Sanskrit and Comparative Philology, Presidency College, and Curator, Government Oriental Manuscripts Library, Madras*

PREPARED UNDER THE ORDERS OF THE GOVERNMENT OF MADRAS

---

VOL. III —Prabandhās—Śṛṅgāraprabandhās

---

MADRAS

PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS

1931

# CONTENTS.

## CLASS I—PRABANDHAS—*cont.*

### (3) *Śṛṅgāraprabandhas*

# A DESCRIPTIVE CATALOGUE

OF THE

# TELUGU MANUSCRIPTS.

## VOLUME III.

---

## CLASS I. PRABANDHAS—(*continued*)

### (3) ŚRṄGĀRAPRABANDHAS—(*cont.*)

---

### No 807 శశాంకవిజయము.

### ŚAŚĀṄKAVIJAYAMU

Substance, Paper Size, 12¼ × 8½ inches. Pages, 224. Lines, 20 on a page. Mode of writing, good but not free from mistakes Condition, good. Appearance, old. Written on only one side of the paper and variations in the readings are noted on the other side.

Complete.

A Prabandha in five Āśvāsas describing the love of Śaśānka (Moon) with Tārā The author Śēsamu Vēnkatapati, son of Krsnasudhī, was a disciple of Kandāla Rāmānujācārya. The work has been dedicated to Vangala Śivayāmātya, son of Vēnkatarāghavādhvarin The author also composed "Rāmānujacaritra" and was honoured by Vijayaranga Cokkanātha of the Pāndya kingdom

A note on the fly-leaf of the Ms., apparently in the late Mr C. P Brown's handwriting, runs as follows.—

"The Tara-Sasancavijayam."

"This copy contains the fair transcript of the correct text accompanied by the various readings"

**Beginning:**

శా. శ్రీవిన్నాణపుగుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ము
క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిం దారాప్ర(ప్తి)యుక్తం బనే
భావంబో యని పల్కఁ గల్మిచెలి సంభావించు కాంచీపురీ
దేవుం డీవుత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్.

* * * *

శా. వాధూలాన్వయవార్ధివిష్ణుఁ బ్రతిభావర్ధిష్ణు వేదాంతప
నాంధిష్ఠానవసంతు శ్రీవరదగుర్వంతేవసంతుఁ గవి

త్వాధారుఁ గుణహారు ధీరు విగతాహంకారు వాత్సల్యధా
రాధారుఁ గృతిసిద్ధికై కొలుతు శ్రీరామానుజాచార్యునిన్.

* * * *

సీ. వంగలకులకుంభవారాశి జనియించి
కన్నుల కామోదగరిమ నించి
యందంద సకలకళాభ్యాసి యై మించి
జైవాత్మకత్వ ప్రశస్తిఁ గాంచి
కౌముదీప్రజ్ఞానగౌరవంబు వహించి
సతతంబుఁ గవిసమాచరణ మించి
యిమ్మైనగానామృతమ్ములు గురియించి
యరికులంబులగర్వ మపహరించి
యతిశయితలక్షణాఢ్యత నధిగమించి
ధాత్రి రామానుజమహాచరిత్రఘటన
కలనఁ గువలయవికసనకళ ధరించి
సీనఘనుఁ డుండు సర్వజ్ఞశేఖరుండు.

వ. వెండియు నఖండమండితమహీమండలమండనాయమాన పాండ్యమఘురాధరాఖండల శ్రీవిజయరంగచొక్కనాథ మహీనాథ కృపాకటాక్షవీక్షణానుక్షణ వర్ధమాన . . . . నిఖిలసంపత్పరంపరాకంపిత నిలింపనాయకుండును . . . . వేంకటరాఘవదీక్షితేంద్ర తిరువేంగళమ్మ బహుజన్మతపఃపరిపాకశుభావతారుండును . . . రామానుజ దివ్యచరిత్ర ప్రబంధసాహితీమోహితానల్పసంతోషవిశంకట వేంకటనగాధీశ్వరుండును . . . . వంగలాన్వయపాలనాంకుండును . . . . ఐన సీనయామాత్య బిడౌజుండొక్కనాఁడు.

క. నను రంగేశ్వరపదయుగ
ఘనతరభజనానిరూఢకవితాసామ్రా
జ్యుని శేషముకృష్ణసుధీ
తనయునిఁ బిలిపించి పలికె దయ దైవాఱన్.

చ. అసదృశభక్తి సద్గురుకటాక్షముఁ గాంచి సమంచితాత్మతన్
బిసరుహమాకరందరసపేశలకౌశలవన్మృదూక్తులన్
రసికుల కింపుగాఁ గృతిపరంపరలన్ రచియించి కీర్తిచే
నెసఁగితివయ్య వేంకటపతీ భళి శేషమువంశసత్కృతీ ॥

క. నీ విప్పుడు మా పేర శు
భావహము శశాంకవిజయ మనెడు ప్రబంధం
బావిష్కృతశృంగారతఁ
గావింపుము రసికహృదయకౌతుక మెసఁగన్.

వ. అని సగౌరవంబుగా నానతిచ్చి కర్పూరతాంబూలంబును గనకాంబరంబు లొసంగి బహూకరించుటయు నేను బ్రమోదభరితమానసుండ నై యిమ్మహాప్రబంధంబున కారంభించి కృతినాయకుని వంశావతారక్రమం బభివర్ణించెద.

* * * *

క॥ చిత్రము తద్ద్విజకులము ప
విత్రముగా సంభవించె విధిమానసము
డత్రిగుణప్రతిబంధుం
డత్రియుగపదాబ్జభక్తుఁ డత్రి ధరిత్రిన్.

శా. మాయావాదిభుజంగభంజనగరుత్మంతుండు శిష్యావళీ
శ్రేయస్సాగరపూర్ణచంద్రుఁడు త్రయీసిద్ధాంతసింహాసన
స్థాయి శ్రీయతిసార్వభౌమపదపద్మధ్యాయితత్త్వాన్వితుం
డై యాఖ్యన్ వెలసెన్ కిడాంబికులజుండై యత్రిగోత్రంబునన్.

క॥ వేంకటకృష్ణయ ఫణిప
ర్యంకపదాబ్జప్రసన్నుఁ డాచార్యకులా
లంకారుఁ డాహిమాచల
లంకారమణీయయశుఁడు రహి మీఱె మహిన్.

సీ. . . . . . . .
మంత్రిమాత్రుండె యతఁడు దుర్మంత్రిగంధ
సింధురోదగ్రజాగ్రన్నృసింహమూర్తి
చెంజి వేంకటనృపతిసాచివ్యకారి
కీర్తిగుణహారి వేంకటకృష్ణశౌరి.

చ. నలుదెసలందు భూమిలలనామణిహారము లగ్రహారముల్
వలనుగఁ జేసి కీర్తిగను వంగలవేంకటకృష్ణమంత్రిరా
డ్తిలకుఁడు శౌర్యసంపదవధీరితకృష్ణు విలాసకృష్ణు వి
ద్యలమునిరాజకృష్ణుఁ గనె నాత్మజరత్నముఁ బెద్దకృష్ణునిన్.

* * * *

క. అతనికిఁ గొప్పెరకృష్ణయ
సుతుఁ డయ్యెఁ దదీయహేతిశూరాలివధూ
వితతులకొప్పెర గొనుటన్
క్షితిఁ గొప్పెరకృష్ణుఁ డన సుకీర్తిం దనరెన్.

* * * *

క. రంగన్నిజభుజశక్తిన్
వెంగలు లై రిపులుసమరవీధిన్ బఱవన్
వెంగన్న యట్టి వంగల
వెంగన్ననతండు గనియె వేడుక మీఱన్.

* * * * [డున్

మ. అలవెంగన్నకుఁ గూర్మితమ్ములు ఘనుం డౌ కొప్పెరామాత్యు(త్యు)ఁ
గవితాధుర్యుఁడు కళ్లకృష్ణుఁడును రంగప్పయ్య తిర్వెంగళ
ప్ప లసత్కీర్తివిహారుఁ డార్యుఁ డనుకంపాధుర్యుఁ డాచార్యుఁడున్
లలితు ల్పొల్తురు ధాత్రి వంగలకులాలంకారు లై యేవురున్.

* * * *

క. వెంగనకృపనాచారమ
యంగన యఁ బుచ్చికృష్ణయార్యున్ శేషా
ర్యుం గస్తురి నాదివరా
హుం గనె గాయత్రి నిగమయుగయుగముఁ బలెన్.

* * * *

ఉ. పండితమండలీహృదయపంకజభానుఁడు బుచ్చికృష్ణయా
ర్యుండును సీనమారమణియున్ దొలి నోమిననోముపంటగా
పిండితకీర్తియుక్తి జనియించెను వేంకటరాఘవాధ్వరీం
ద్రుండు విభాసమానగుణరుంద్రుఁడు వంగలవంశచంద్రుఁడై.

* * * *

సీ. ఋగ్యజుస్సామాదిరీతు లేర్పడఁ జేసి
పాఠశాలలు వెట్టి వ్యాసు లట్లు
ప్రాకారమణిమంటపాదికైంకర్యముల్
పరకాలుగతి రంగపతి కొనర్చి
ఛాయలు గల్పించి జలధరప్రౌఢిమ
శాలలు వేయించి జనుల కెల్ల

బుధులకు నవరత్నభూషణాంబరములు
కల్పవృక్షంబులకరణి నొసఁగి
వెలయునారదవరదున కలఘుభక్తి
నిష్టభోగంబు లొసఁగె ఫణీంద్రులీల
భజనతోషితఖగసార్వభౌమవాజి
సుగుణవేంకటరాఘవసోమయాజి.

క. శ్రీమద్వేంకటరాఘవ
సోమాజి మహాకులప్రసూతసుకీర్తి
స్తోమ తిరువేంగళమ్మను
భామారత్నమును ధర్మసత్నిగఁ బడసెన్.

*          *          *          *

తే. ఆమహాధ్వరి యాసాధ్వియందు శేష
కృతిని సీనేంద్రు వేంకటకృష్ణధీరు
ఘనుని వేంకటపెరుమాళ్లఁ గాంచి వెలసె
నలువ నాల్గుమొగంబులఁ జెలఁగినటుల.

*          *          *          *

సీ. సకలసామాజికసంఘంబు మదికి నిం
పుగబృహస్పతిలీల బుద్ధిదెల్పుఁ
గార్యఖడ్గక్రియాఘటనాఘటనశక్తి
దొరను బ్రమోదంబు దొరయఁజేయు
జననంబు మొదలుగా సకలజనోపకా
రంబు వ్రతంబుగా రహి నొనర్చు
జనకుని వైఖరి జ్ఞానకర్మప్రప
దనభక్తి గురునిష్ఠ లొనర మెలఁగు
ధర సుపనయనకన్యకాదానశతము
లన్నదానంబు జలదాన మాదియైన
దానములొసంగుఘనుఁ డభిమానధనుఁడు
శ్రీపతినిభుండు వంగలసీనవిభుఁడు.

*          *          *          *

క. అళహపెరుమాళ్లు రాముని
వెలయన్ భజియించురీతి వేంకటపెరుమాళ్

సలలితగీతకళానిధి
విలసితమతిఁ గొల్వ సీనకభూఁడు చెలంగున్.

* * * *

క. శ్రీమన్నరురంగాధిప
నామాంకితగేయకల్పనానుతమతికిన్
రామానుజవిజయాంకగ
వీమధురసమోదమాన వేంకటపతికిన్.

* * * *

క. వేంకటరాఘవమఘికుల
పంకజభానునకుఁ గరుణ్నపతిమానునకున్
గంకటవత్సేనునకు ని
రంకుశదానునకు సజ్జనాధీనునకున్.

క. వాధూలవరదదేశిక
సాధిష్ఠకృపాకటాక్షసంపాదిత మే
ధాధీతోభయవేదాం
తాధికసామ్రాజ్యసంభృతానందునకున్.

* * * *

సుగంధి. రాజమానమానరాజరాజరాజసన్ముఖాం
భోజభోజరాజనైజబోధబోధనస్తుత
క్ష్మాజనాభిరామరామచంద్రకల్పకల్పవి
భ్రాజికీర్తిభూషితాంగవంగవఁగలాన్వయా.

**Colophon:**

గద్య. ఇది శ్రీజానకీరామచంద్రచరణారవిందవఁదనకందళితానంద కందాళరామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీవైభవ శేషముక్తృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతినామధేయప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. పత్రమున కొకవైపున వ్రాయఁబడినది. ఎదిరివైపునఁ బాఠభేదము లెక్కింపఁబడినవి. శైథిల్యము గ్రంథపాతములు నంతగా లేవు.

అయిదాశ్వాసముల యీశృంగారప్రబంధమునఁ జంద్రుఁడు బృహస్పతియొద్ద విద్యనభ్యసించుచు గురుపత్నియైన తారవలపునఁబడుట మొద

లగు కథ వర్ణితమైనది. గ్రంథకర్త శేషము వెంకటపతి. కృష్ణసుధీకుమారుఁడు. కందాళ రామానుజ గురుని శిష్యుఁడు. కృతిపతి వంగల వేంకటరాఘవాధ్వరిపుత్త్రుఁ డగు సీనయామాత్యుఁడు. ఈ కృతిపతి పాండ్యమండలాధీశ్వరుఁడగు విజయరంగచొక్కనాథమహీపాలునివలన మానితుఁడై సకలసంపదలఁ బడసెను. జాణిగె కృష్ణకవి సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు, నీ శేషము వేంకటపతి, విజయరంగ చొక్కనాథమహీపాలు నాస్థానమందుఁగల కవులు. ఈ విషయము అహల్యాసంక్రదనమువలన నెఱుఁగఁబడును. రామానుజచరిత్ర మను ప్రబంధాంతరమునుగూడ నీ వెఁకటపతికవి రచించెనట! విశేషములకు దాహృత గ్రంథభాగముఁ గాంచునది.

---

## No. 808 శశాంకవిజయము.

## ŚAŚĀṄKAVIJAYAMU

Substance, paper Size, 8 × 6¾ inches Pages, 154. Lines, 14. Mode of writing, good and free from mistakes Written on only one side of the paper. Condition, good. Appearance, old.

Same work as the above.

At the end of the MS seven pages contain short notes and illustrations by Mr. C. P Brown

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున ౭ పుటలలో బ్రౌను దొరగారి లఘు వివరణములు, ఉదాహరణములు, గలవు.

---

## No 809. శశాంకవిజయము సంపుటము ౧.

## ŚAŚĀṄKAVIJAYAMU, Vol I

Substance, palm-leaf Size, 7¾ × 6⅝ inches. Pages, 130. Lines, 15 on a page. Mode of writing, good but not free from mistakes Written on only one side of the paper. Condition, good. Appearance, old.

Mr. Brown's Telugu and English notes appear on blank pages here and there.

This volume contains the first three Āśvāsas only

Same work as the above.

A note apparently of Mr Brown found at the beginning of the Ms. runs as follows —

" By striking out extraneous matter this poem might be greatly abridged and thus rendered more popular. Thus-Begin at book I, verses 97-105, 94, 121—124

What title shall I give the commentary తారాప్రకాశిక ? తారాభావదీపిక ? the name of the Advaita comm. on Bhag and this would be consentaneous to the . humor of the poet 'This name the Tārābhāvadīpika is greatly lauded by . . . " A practical commentary ' I since invented a name still more apt and which he prefers 'చకోరీయం.' This name being wholly unprecedented and singularly adapted to the title Chandra."

(వి-వి.)—

తొలి మూఁడాశ్వాసము లీ యొకటవ సంపుటమునఁగలవు. దీని తర్వాతి నెంబరున నిందు పై భాగము కడముట్టఁగలదు. వ్రాఁత యందమైనది. పత్రమున కొక వైపున మాత్రము వ్రాయబడియున్నది. బ్రౌను దొరవారి యాంధ్రాంగ్ల టిప్పణులు వ్రాయని వైపుల నక్కడక్కడ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No. 810 శశాంక విజయము సంపుటము ౨.

## ŚAŚĀṄKAVIJAYAMU, Vol II

Substance, paper Size, $7\frac{1}{3} \times 6\frac{1}{2}$ inches. Pages, 148. Lines, 15 on a page. Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper English and Telugu notes are written by Mr. Brown on blank pages. Condition, good. Appearance, old.

Contains the Āśvāsas 4 and 5 in continuation of the portion contained in the Ms described under the previous number This Ms. and the Ms. described under the previous number form a complete copy of the work

Same work as the above

(వి-వి.)—

నా లైదాశ్వాసములు కలవు. వ్రాఁత తిన్ననిది. తప్పు లున్నవి. పత్రమున కొకటివైపున మాత్రము వ్రాయఁబడియున్నది. బ్రౌను దొర వారి యాంధ్రాంగ్ల టిప్పణులు వ్రాయని పత్రములపైఁ గలవు. శైథిల్య గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No 811. శశాంకవిజయము.

## ŚAŚĀṄKAVIJAYAMU.

Substance, palm-leaf Size, 15¼ × 1½ inches Pages, 170 Lines, 5 on a page. Mode of writing, fair but not correct Condition, injured. Appearance, very old Many leaves are broken towards the end of the right side

Breaks off in the fourth Āśvāsa.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. మొదటనుండి చతుర్థాశ్వాసమునఁ గొంతదాఁక గలదు. వ్రాఁత యొక తీరైనది. తప్పులున్నవి. శైథిల్యము మెండు. గ్రంథపాతములును గలవు.

పూర్వమువలె.

---

## No. 812. శశాంకవిజయము.

## ŚAŚĀṄKAVIJAYAMU.

Substance, palm-leaf. Size, 16 × 1¼ inches. Lines, 4 on a page. Mode of writing, fair but incorrect. Condition, much injured. Appearance, old

Contains the fifth Āśvāsa only

Same work as the above.

(వి-వి.)—

ఐదవ యాశ్వాసము మాత్రము గలదు. వ్రాఁత సాధారణముగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్య గ్రంథపాతములు మెండు. ప్రాచీనము.

పూర్వమువలె.

### No. 813. శశాంకవిజయము.

### ŚAŚĀṄKAVIJAYAMU.

Substance, palm-leaf. Size, $12\frac{3}{5} \times 1\frac{1}{8}$ inches Pages, 46 Lines, 6 on a page Mode of writing, not good and not correct Condition, injured Appearance, old

Contains the third Āśvāsa incomplete

Same work as the above

(వి-వి.)—

అసమగ్రముగాఁ దృతీయాశ్వాసము మాత్రము గలదు. వ్రాఁత మంచిదికాదు. తప్పు లున్నవి. శైథిల్యగ్రంథపాతములు మెండు.

పూర్వమువలె.

---

### No 814 శశాంకవిజయము.

### ŚAŚĀNKAVIJAYAMU

Substance, paper Size, $7\frac{3}{4} \times 6\frac{1}{4}$ inches Pages, 252. Lines, 15 on a page. Mode of writing, good but not free from mistakes. Condition, good. Appearance, old.

Begins on fol 109*a* The other work herein is Surābhāṇḍēśvaramu—Satīkamu

Complete, but wants the introductory portion

Same work as the above.

(వి-వి.)—

గ్రంథావతరణిక తప్ప తక్కిన దంతయు గలదు. వ్రాఁత తిన్ననిది. తప్పులున్నవి శైథిల్యగ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

### No 815. శశాంకవిజయము.

### ŚAŚĀṄKAVIJAYAMU

Substance, palm-leaf. Size, $17\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 138 Lines, 7 on a page. Mode of writing, good but not free from mistakes and breaks off in some places. Condition, much injured Appearance, old.

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు శైథిల్యము హెచ్చుగాఁగలదు. గ్రంథపాతములును గలవు.

పూర్వమువలె.

---

No **816**. శశాంకవిజయము.

ŚAŚĀṄKAVIJAYAMU

Substance, paper Size, 12⅛ × 8½ inches. Pages, 179 Lines, 16 on a page Mode of writing, good but not quite correct Written on only one side of the paper Variations in the readings are interlined and also written on blank side of each page.

Complete.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిది. తప్పులు గలవు. పత్రమున కొక ప్రక్కనే వ్రాఁత గలదు. పాఠభేదము లెదిగువైపునను బంతుల నడుమను జేర్పఁబడినవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

No **817**. శశాంకవిజయము.

ŚAŚĀṄKAVIJAYAMU.

Substance, palm-leaf Size, 20¼ × 1⅜ inches. Pages, 116 Lines, 8 on a page. Mode of writing, fair but not correct. Condition, fair. Appearance, old.

Complete.

Same work as the above

The name of the scribe and the date of transcription are given below in Telugu as found at the end of the Ms.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత సాధారణమైనదిగా నున్నది. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతము లంతగా లేవు.

పూర్వమువలె.

గ్రంథాంతమున నిట్లు గలదు :—

"రుధిరోద్గారినామ సంవత్సర భాద్రపదకృష్ణ ౫ సోమవారంవ్వరకు గాజుల జగ్గయ్యగారికి యిప్పగుంట అచ్చున వ్రాసి యిచ్చిన తారాశశాంకం."

---

## No 818. శశాంకవిజయము.

## ŚAŚĀṄKAVIJAYAMU.

Substance, paper Size, $15\frac{1}{2} \times 6\frac{1}{2}$ inches Pages, 19 Mode of writing, good but not correct. Written on only one side of the paper. Variations in the readings, and meanings in Telugu and English are written by Mr C. P Brown on blank pages and between the lines of the original.

Complete in two volumes.

Same work as the above By Śēsamu Vēṅkatapati and not by Kandāla Vēnkaṭapatı as stated by the late Mr C P Brown.

In the beginning of the work Mr C P. Brown has explained the marks used in this transcript and then gives the following notes —

"(1) The manuscripts I used are thus discriminated :—

A. My large quarto paper copy from which this one was transcribed

B. A manuscript on palm-leaves belonging to Vencut Ramaya in the college.

C. A small paper copy different in the middle. Since comparing the above, I have obtained four other manuscripts which have established the text finally. 1829.

The Tára Śasānciyamu.

An original Telugu poem

By Candala Venkatabati.

The text of the present copy is given as arranged by my very learned friend Advaita Bramhaya Pandit of the Zillah Court of Masulipatam. The interlineations show the various readings that appear in other manuscripts collated by me

Much of this book is not intelligible to any but very good scholars without a comment—which is yet to be made

I wrote the above note in 1827 and since that time a very complete commentary has been written : and an Index subjoined."

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములు. వ్రాంత చక్కనిది. తప్పులున్నవి. పత్రమున కొకటే వైపున మాత్రమే వ్రాయఁబడినది. బంతుల నడుమను ఎదిరి పుటలలోను పాఠాంతరములు, బ్రౌను దొరవారి యాంధ్రాంగ్లేయ టిప్పణులు, విశేషాంశములు వారిచేతనే వ్రాయఁబడినవి. శైథిల్యగ్రంథపాఠములు లేవు.

పూర్వమువలె.

---

## No 819 శశాంకవిజయము (చకోరీయవ్యాఖ్యాసహితము).

## ŚAŚĀṆKAVIJAYAMU (WITH CAKŌRĪYAVYĀKHYĀ).

Substance, paper Size, $11\frac{3}{4} \times 7\frac{3}{4}$ inches Pages, 1,680 Lines, 22 on a page. Character, Telugu Condition, injured Appearance, old. The transcript is written on only one side of the paper and the other side contains the corrections made by Mr C. P Brown. English translation of important or rather beautiful stanzas is given. Also contains short notes throughout the Ms.

Complete in three volumes

Same work as that described under No 807 *ante* and also contains the commentary The commentary is not perfect and the language too is bad. In some places the commentary is defective and in some places it is superfluous and dry

From a note of Mr Brown given in the Ms described under No. 807 which is only a fair copy of this Ms, it is understood that one Narasimhācāri is the commentator and in another note appended to this Ms. Mr Brown says that this commentary was revised by the very learned Zūlūri Appaya.

The following note appears on the fly-leaf of the first volume and is apparently in the handwriting of Mr. C P Brown —

"The tale of Tara.

Complete with commentary in three volumes 1830

This copy has been revised by the very learned Zūlūri Appaya ; and the chief corrections are either in his handwriting or my own Much has been blotted out with a view to shortening the notes by excluding

Motto from Manu Smr 2—93 etc , 93 A man by the attachment of hi organ to sexual pleasures incurs certain guilt but by wholly subduing them, he thence attains heavenly bliss.

Or, as a motto give the Smriti verse (entered under IV-18)

నారీం శతాపరాధాం వా పుష్పేణాపి న తాడయేత్ ।
దోషాన్న గణయేత్తస్యా గుణానేవ ప్రకాశయేత్ ॥"

**Beginning :**

శా. శ్రీవిన్నాణపు గుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ము
క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిం దారాప్తియుక్తం బనే
భావంబో యని పల్కుకల్మి చెలి సంభావించు కాంచీపురీ
దేవుం డీవుత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్.

టి. శ్రీ . . . మి । అ॥ కాంతిచేతను శ్రేష్ఠమైన । గుబ్బలరీతి గలిగిన చన్నులయందు । కర్పూరము గుప్పి ముత్యపు హారములను గూర్చె దవిదేమి । అయారే । భళా । శశికిన్ . . . భావంబో । చంద్రునికి తారాప్రాప్తి । అ॥ తారతోసంగమము అనుకూలమనే తాత్పర్యమా అని అర్థము ॥ శశిఅనేపేరు కర్పూరమునకున్ను । తార అనే పేరు ముత్యములకు గలదుగనుక । యీ రెండు శుభ్రవస్తువులను । ఒక స్థలమున నుంచుట యుక్తము అనే భావమో । అని అర్థాంతరము ॥ యీ రీతిని పలుకుచున్న లక్ష్మీదేవిని మెచ్చుచుండె । కాంచీపురీదేవుడు । అ॥ వరదరాజులు । సీనయ అనే పేరు కలిగిన బుధశ్రేష్ఠుండైన యీ కృతినాయకునకు బాలా ఆయుస్సున్ను । దేహమునందు నిరోగతయున్ను కలగజేసుగాక అని కృతిపతికి కృతికర్త ఆశీర్వచనము సేయుట.

**End :**

హంసయాన.—రాజమానమానరాజరాజరాజసన్ముఖాం
భోజభోజరాజనైజబోధబోధనస్తుత
క్ష్మాజనాభిరామరామచంద్రకల్పకల్పవి
భ్రాజికీర్తిభూషితాంగవంగవంగలాన్వయా.

టీ. రాజమాన మానరాజరాజ । రాజమాన । అ॥ ప్రకాశిస్తూనున్నటువంటి । మాన । అ॥ అభిమానమందు । రాజరాజ । అ॥ దుర్యోధనునితో సమానమైనవాడా । రాజసన్ముఖాంభోజ । చంద్రునితో సమానమైనటువంటి ముఖకమలము కలవాడా । భోజరాజనైజబోధబోధనస్తుతక్ష్మా-జనాభిరామ । భోజుడనే పేరు కలిగినటువంటి రాజుయొక్క స్వకీయ

మైన జ్ఞానమువంటి జ్ఞానముఁ కలుగుటచేతను స్తోత్రముఁ జేయఁబడినటువంటి భూమియందలి జనములకు మనోహరమైనవాఁడా । రామచంద్ర కల్ప కల్పవిభ్రాజికీర్తిభూషితాంగవంగ । మనోహరుఁడైనటువంటి చంద్రుని తోడను సమానమైనటువంటిన్ని కల్పాంతముగా ప్రకాశిస్తూనున్నటు వంటి యశముచేతను అలంకరింపఁబడినటువంటి అంగరాజ్యము వంగరాజ్య మున్ను కలవాఁడా । వంగలాన్వయా । వంగల వంశమందు ఉత్పత్తికల వాఁడా ॥ యీ తీరుగాను గ్రంథాంతమందు కవికృతినాయకుఁడైన సీన యను స్తుతిసేయుట అని యర్థము.

**Colophon** of the text :

గద్య. ఇది శ్రీజానకీరామచంద్ర చరణారవింద వందనకందళి తా నంద కందాళరామానుజ గురుచరణసేవాసమాసాదిత సాహితీవైభవ శేషముకృష్ణయార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతినామధేయ ప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వా సము.

(వి-వి.)——

సమగ్రము (మూఁడు సంపుటములు గలవు.) వ్రాఁత బాగుగాను న్నదిగాని తప్పులుగలవు. ఇది పత్రమున కొకవైపున మాత్రమే వ్రా యఁబడినది. రెండవ వైపున విశేషించి చిన్న చిన్న టిప్పణులును వ్రా యఁబడినవి. హృద్యములగు ననేకపద్యములకు బ్రౌనుదొరగా రాంగ్లేయ భాషాంతరీకరణమును వ్రాసియున్నారు. వ్రాసిన పుటల పంక్తుల నడు మనే వ్యాఖ్యానము చాలవఱకు సంస్కరింపఁబడియున్నది. మొదటి రెండు సంపుటములును ఆశ్వాసముల నడుమ వేఱుచేయ బడినవి.

ఇది నె 807 రున వర్ణింపఁబడిన గ్రంథమే గాని యిందుఁ బ్రతి పద్యము క్రిందను వ్యాఖ్యానముకూడ వ్రాయఁబడియున్నది. అది వాడుకభాష లోనున్నది. వ్యాఖ్యానము విశేషించియుండవలసిన ఘట్టములందు మిక్కిలి తక్కువగానున్నది. అనావశ్యకమైన స్థలములందు మాత్రము విశేషించియున్నది.

దీని శుద్ధప్రతియగు నె 821 రు గ్రంథమున వ్యాఖ్యాతపేరు నరసిం హాచారియని బ్రౌను దొరగారు వ్రాసియున్నారు. ఈ వ్యాఖ్యానము మహాపండితుఁడగు జూలూరి యప్పయ్యచే సంస్కరింపఁబడినదట.

No. **820**. శశాంకవిజయము (చకోరీయవ్యాఖ్యాసహితము).
ŚAŚĀṄKAVIJAYAMU (CAKŌRĪYAVYĀKHYĀ SAHITAMU)

Substance, paper Size, 11⅜ × 7 inches Pages, 194 Lines, 26 on a page.
Character, Telugu Condition, much injured Appearance, very old.

Incomplete Breaks off abruptly from the 47th stanza in the third canto Written on only one side of the paper The commentary contains corrections and the corrections are interlined

Same work as that described under No 819 *ante*, but does not at all coincide with it in many places It might possibly be that one of these two was re-cast with some alterations and corrections. But this Ms seems to be an old one

**Beginning:**

శా. శ్రీవిన్నాణపు గుబ్బచన్నుల నయారే గంబురా గుప్పి ము
క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారాప్తియా కాంబనే
భావంబో యని పలుక కల్కిచెలి సంభావించు కాంచీపురీ
దేవుం డీవుత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్.

టీ. శ్రీవి . . . దేమి । అలంకారముల నేర్పుగల గుబ్బలవంటి చన్నులయందు । భళీ । పచ్చకర్పూరము చల్లి ముత్తెపు పేర్లు వేస్తావేమి । శశి . . . వంబో । చంద్రునకు తార అనగా నక్షత్రములయొక్క సాంగత్యము అనుకూలమనే తాత్పర్యమా । కాక చంద్రునకు తారయొక్క సాంగత్యము అనుకూలమనే తాత్పర్యమా । అ । కర్పూరముచల్లిన గుబ్బ చంటికిన్ని చంద్రునకున్ను పోలికె । ముత్తెపు పేర్లకున్ను నక్షత్రములకున్ను పోలికె । అని భావం। యని . . . . . గ్యముల్ । యీలాగున పలికేటి లక్ష్మీదేవిని మెచ్చేటి కంచి వరదరాజస్వామి సీనయ అనే పేరుగల బుధశ్రేష్ఠునకు విస్తారపు బ్రతుకున్ను నిరోగమున్ను యిచ్చుగాక। అని యీకృతిపతియైన సీనయ్యకు కవి చేసిన ఆశీర్వచనము.

**End:**

తే. కమలగర్భాదుల జయించు కలికిజంఘ
లాత్మరాశిగ మకరంబు నరసి ప్రోచె
స్వజనసంరక్షణైకతత్పరుల కెందు
నెదుటిమందాధికారత నెంచనేల.

(వి-వి.)—

అసమగ్రము. తృతీయాశ్వాసము 47 వ పద్యమువఱకుఁ గలదు. పత్రమున కొకవైపున మాత్రమే వ్రాఁత కలదు. వ్రాఁత బాగుగానున్న

దిగాని తప్పులు మాత్రము లేకపోలేదు. వ్యాఖ్యానము ప్రతి పద్యము క్రిందను వ్రాయఁబడియున్నది; అవి యక్కడక్కడ వ్రాఁత పుటల పంక్తుల నడుమనే సంస్కరింపఁబడినవి.

ఇది నెం 819 రున వర్ణింపఁబడిన గ్రంథమే కాని యనేక స్థలములం దీరెండును భిన్నముగా నున్నవి. వీనిలో నేదే నొకటి రెండవదాని ననుసరించి మార్చి వ్రాసిన వ్రాఁతయై యుండవలయును. ఈ రెంటిలోఁ జూపులకీ పుస్తకమే ప్రాఁతదిగా నున్నది.

---

## No 821. శశాంకవిజయము (చకోరీయవ్యాఖ్యానసహితము).
## ŚAŚĀṄKAVIJAYAMU WITH THE COMMENTARY CAKŌRĪYA

Substance, paper. Size, $12\frac{5}{8} \times 7\frac{3}{4}$ inches. Pages, 602 Lines, 23 on a page Character, Telugu. Condition, almost injured. Appearance, old.

Wants the introductory portion; otherwise complete Misbound. Pages numbered 11—22 should have been placed between the pages 34 and 35 The handwriting is very neat and good but not free from mistakes

Same work as that described under No. 819 *ante*.

The following note of the late Mr C P. Brown is found on the fly-leaf of the volume :—

"The Adventures of Tara or Stella and the Genius."
a celebrated fairy-tale, written in Telugu verse and illustrated with a commentary composed under the directions of C P Brown, by the learned Narasimhachari in the year A.D 1828 In the present copy the voluminous dedication, preface, etc., are omitted—1843.

(వి-వి.)——

అసమగ్రము (గ్రంథపరిపూర్తి కవతారికమాత్రము కొఱఁత). సంపుటీకరణము సరిగా లేదు. 11 మొదలు 22 వరకు సంఖ్యలుగల పత్రములు 34, 35 సంఖ్యలుగల పత్రముల నడుమ నుండవలసినవి. వ్రాఁత చక్కఁగా నున్నదిగాని తప్పులుమాత్రము లేకపోలేదు.

ఇది నెం 819 రున వర్ణింపఁబడిన గ్రంథ మగుటయే కాక దాని శుద్ధప్రతియై యున్నది.

ఈ పుస్తకము మొదట బ్రౌను దొరగారు వ్రాసిన పీఠికవలన వ్యాఖ్యాత పేరు నరసింహాచారియని తెలియవచ్చును.

## No. 822. శశాంకవిజయము (తారకవ్యాఖ్యానసహితము). SAŚĀṄKAVIJAYAMU WITH THE COMMENTARY TĀRAKA.

Substance, paper. Size, 13¼ × 8⅜ inches. Pages, 734. Lines, 23 on a page. Character, Telugu. Condition, almost injured. Appearance, old.

The handwriting is bad and full of mistakes Corrections are interlined in the commentary throughout the Ms

Complete

Text is the same as and the commentary is similar to that described under No 819 *ante* As a matter of fact the commentary contained in this Ms though called by a different name "Tārakamu" is only an improvement of the commentary called Cakōrīya and not a different one altogether

The following note of Mr. C. P Brown appears on the fly-leaf of the MS. :—

"తారాశశాంక విజయము

TĀRAŚAŚĀNCA VIJAYAM

or

Adventures of Venus and Adonis

a celebrated Telugu poem "

This is a new edition of the poem. The commentary was written in the year 1827 And in 1853 it was thoroughly revised. Hence the corrections made in every page

The present volume contains the learned Editor's final corrections

The comment is named తారకం.

**Beginning:**

శా. శ్రీవిన్నాణపు గుబ్బచన్నుల నయారే గంబురా గప్పి ము
క్తావల్లుల్ ఘటియించె దేమి శశికిన్ దారాప్తి యుక్తంబనే
భావంబో యని పలుకఁ గల్కిచెలి సంభావించు కాంచీపురీ
దేవుండిచ్చిత సీనయార్యమణికిన్ దీర్ఘాయురారోగ్యముల్.

టీ. శ్రీ—న్నుల । శ్రీ । కాంతిచేత । విన్నాణపు శ్రేష్ఠములైన । గుబ్బచన్నులన్ । నత్తువలయిన స్తనములయందు । గంబురా గుప్పి । పచ్చ కర్పూరము నలది । ముక్తావల్లుల్ । తీగెలవంటి ముత్యాల హారములను । ఘటియించె దేమి । కూర్చెదవేమి । అయారే । భళా । శశికిన్ । చంద్రునికి । తారాప్తి । నక్షత్రములతో గూడుట । యుక్తంబనే భావంబో । తగినదేనని తాత్పర్యమా అని అర్థము॥ ని॥ ఘనసారశ్చంద్రసంజ్ఞః । అని యమరమున్నది గనక శశి అనగా చంద్రుడున్నూ కర్పూరమున్నూ ।

తార అనగా నక్షత్రములున్ను ముత్యాలున్ను అర్థము గనుక । శశికిఁ దారాప్తి యుక్తంబనే భావంబో । కర్పూరమునకు ముత్యాలతో కూడుట తగినదేను అని తాత్పర్యమా అని భావము । చంద్రునికి బృహస్పతి భార్యయైన తారతో గూడుట తగినదేనని అభిప్రాయమా । అని అర్థాంతరమున్ను తోచుచున్నది । అని పలుకు కల్మిచెలిఁ । ఈ ప్రకారము చెప్పుచున్న లక్ష్మీదేవిని । సంభా—వుండు । సంభావించు । సంభావింపుచుండే కాంచీపురి దేవుండు । కాంచీపట్టణాధిపతియైన వరదరాజస్వామి । సీనయార్యమణికిఁ । సీనయ అనే పేరుగల బుధశ్రేష్ఠుడైన యీ కృతినాయకునికి । చాలా ఆయుస్సునున్ను వ్యాధి లేకపోవుటనున్ను । ఈ పుతఁ । కలుగజేసుగాక అని కృతిపతికి కృతికర్త ఆశీర్వదించుట॥ శ్లో॥ అర్థతశ్శబ్దతో వాపి మనకావ్యార్థసూచనం॥ అన్న వచనరీత్యా శశికిం దారాప్తి యన్నందున కావ్యార్థము సూచింపుచున్నదని తెలియవలెను.

**End :**

సుగంధి. రాజమానమానరాజ రాజరాజసన్ముఖాం

భోజభోజరాజనైజబోధబోధనస్తుత

త్క్ష్మాజనాభిరామరామ చంద్రకల్పకల్పవి

భ్రాజికీర్తిభూషితాంగవంగ వంగలాన్వయా.

టీ. రా . . . జరాజమాన । ప్రకాశిస్తూవుండే । మాన ।
. . . . । రాజరాజ । దుర్యోధనుని వంటివాడా । రాజరాజనగా కుబేరుడున్ను అర్థము గనుక కుబేరునివంటి వాడని చెప్పవచ్చును । సన్ము— జ । సత్ । శ్రేష్ఠమైన । ముఖాంభోజ । కమలమువంటి వదనము కలవాడా । భో—త । భోజరాజ । భోజరాజువలెనే । నైజ । స్వకీయమైన ! బోధ । జ్ఞానముయొక్క । బోధన । తెలియచేసుటచేతను । స్తుత । నుతింపబడినవాడా । అనగా భోజరాజు తన ముఖమును చూచేవారికెల్లు తన కవిత్వజ్ఞానమువంటి కవిత్వజ్ఞానము కలిగేటట్టు చేయుచున్నాడో అట్లు యీ వంగల సీనయ్య తన్ను చూచేవారికి తనజ్ఞానమువంటి జ్ఞానమును కలుగచేసేవాడనుట । త్క్ష్మా . . మ । త్క్ష్మాజన । భూలోకమందుండే మానవులలోపలను । అభిరామ । ఒప్పుచుండేవాడా । రామచంద్ర కల్పకల్ప విభ్రాజికీర్తి భూషితాంగవంగ । రామ ఒప్పుచున్న । చంద్ర । ఇందుపుతోడను । కల్ప । సమానమైన । కల్పవిభ్రాజి । బ్రహ్మకల్పపర్యంతము ప్రకాశించుచున్న । అనగా బ్రహ్మకల్ప పర్యంతము వుండేదనుట । కీర్తి । యశస్సుచేతను । భూషిత । అలంకరింపఁబడిన । అంగవంగ । అంగదేశములు వంగదేశములు కలవాడా । వంగలాన్వయా । వంగలవంశమందు

పుట్టినవాఁడా। రామచంద్రకల్ప అని వేరే పదముచేసి। రామస్వామితో సమానుఁడైన వాఁడనిన్ని చెప్పవచ్చును। ఈ పద్యార్థము కృతిపతి వర్ణన॥

**Colophon** of the text.

గద్య. ఇది శ్రీజానకీ రామచంద్ర చరణారవిందవందన కందళితానంద కందాళరామానుజగురుచరణసేవాసమాసాదితసాహితీ వైభవశేషము కృష్ణనార్యతనూభవ సుకవిజనవిధేయ వేంకటపతి నామధేయ ప్రణీతంబైన శశాంకవిజయంబను మహాప్రబంధంబునందుఁ బంచమాశ్వాసము.

(బి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది గాదు. తప్పు లున్నవి. దిద్దుబాట్లు ఎడనెడఁ గలవు.

ఇది నెం. 819 రు వర్ణితమయిన గ్రంథమును బోలియున్నది. బ్రౌను దొరగారు దీనికి 'తారక' యని పేరిడిరి. ఇది చకోరీయ వ్యాఖ్య మీఁది సంస్కార మనఁదగియున్నది.

---

## No. **823.** శశాంకవిజయశబ్దసూచిక.

## ŚAŚĀṄKAVIJAYAŚABDASŪCIKA

Substance, paper. Size, 11¼ × 6⅝ inches. Pages, 855. Lines, 19 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old.

Complete

An alphabetical list of the words used in Śaśānkavijayamu described under No. 807 *ante*. The number of the verse and the canto where the word occurs are also marked opposite to each and every word. At the end it is noted in Telugu that this index was prepared in the year 1830 A.D at Masulipatam under instructions from Mr. C. P Brown. It is also stated that four men were engaged to compile this concordance which was completed in four months.

The handwriting is good but not free from mistakes.

(బి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుగానున్నదిగాని తప్పులు లేకపోలేదు.

నె 807 రున వర్ణింపఁబడిన శశాంకవిజయమునందుఁ బ్రయుక్తములగు పదములిందు వర్ణానుక్రమణికగాఁ వ్రాయఁబడియున్నవి. ఆ పదము లేయాశ్వాసమున నెన్నవ పద్యమునఁ గలవో యదియును జెప్పఁబడి యున్నది

“ఈ తారాశశాంకమును గురించ్చిన సూచిక మహారాజరాజశ్రీ బ్రౌణ్ ధొరగారి హుకుం ప్రకారం మచిలీపట్నమందు ఆ ౧౮ ౩౦ సంవత్సరంలో యిది కుదిరించెటందుకుగాను నలుగురి మనుష్యులకు నాలుగు మాసములు తగిలి వున్నది.” అని గ్రంథాంతమందుఁ గలదు.

**Beginning:**

అంక-అవతారిక—౯౪, పం ౨౦.
అంకము—పం. ౧౨౪, అంకమున—ప్ర. ౪౫.
అంకమా—తృ. ౧౨౬.
అంకస్థితి—చ ౧౪౯.
అంకిత—పం. ౧౧౫, అవ. ౯౪, ము—పం. ౩
అంకుని—ద్వి. ౫౩.
అంకురం—ద్వి. ౩౩, చ. ౧౫౪.
అంకురత్—పం ౧౧౫.
అంకుశ—అవ. ౯౬.
అంకుశంబు—పం ౧౩౬.
అంగ—ద్వి, ౫౯, చ. ౧౩౮.
అంగక—పం ౧౨౬.
అంగకలనా—అవ ౧౨.
అంగజ—ద్వి. ౭౮-౧౧౬, తృ. ౧౧౪-౧౪౫, చ. ౫౬-౨౨౮.
అంగజకేళి—చ ౧౪౮.

**End:**

హొంబట్టు—చ. ౨౦౨.
హొన్నుడాల్—చ. ౯౦.
హొయలు—తృ. ౮౨.
హోయలుగా—తృ. ౧౫.
హొరామ—పం. ౧౬౧.
హొరామం—పం. ౧౮౯.
హోత్రం—పం. ౨౦౬.
హోదు—చ. ౮౭.
హోసు—తృ. ౪౧, చ. ౭౦.

## No 824. శశాంకవిజయశబ్దసూచిక.

## ŚAŚĀṄKAVIJAYAŚABDASUCIKA.

Substance, paper. Size, 11¾ × 7⅜ inches Pages, 258. Lines, 30 on a page Character, Telugu. Condition, much injured. Appearance, old.

Complete

Same work as that described under the previous number The handwriting is neat and good but not entirely free from mistakes.

(వి.వి.)—

సమగ్రము. వ్రాఁత మిక్కిలి చక్కఁగా నున్నది. తప్పులు మాత్రము బొత్తిగా లేకపోలేదు.

ఇది నె 822 లున వర్ణింపఁబడిన గ్రంథమే. దానికిది శుద్ధప్రతి.

---

## No. 825. శివమృగయావిలాసము.

## ŚIVAMRGAYĀVILĀSAMU

Substance, palm-leaf. Size, 15 × 1⅝ inches. Pages, 24. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old

Complete

A Prabandha in one Āsvāsa describing the amours of Śiva in the course of his hunting expedition in the Dāruvana The author Rangadhāmamantri was the son of Nārāyanapa and grandson of Śaṅkaramantri of Kāśyapagōtra and of Haryaparāju family

Though the work is complete, the first canto only is readable ; the latter portion of the Ms is injured and many leaves are eaten away by moths

**Beginning :**

క. శ్రీరమణీ వాణీగిరి
జారమణీ కలితవత్స సమ్ముఖవపులన్
సారజగదవనభవలయ
కారణుల నుతింతు శౌరి కంబుజభవులన్.

*　　*　　*　　*

సీ. శ్రీఁజెందు హర్యపరాజవంశాంభోధి
చంద్రుఁడౌ మల్లప సచివుఁ డనఘుఁ
డతనికిఁ గేశవాంబాంగన కతులిత
ప్రీతి జన్మించి విఖ్యాతులైరి

శంకరపామాత్య చంద్రుండు విశ్వప
తియు నర్స్యపాఖ్యుఁడు ధీరుఁడైన
కామనమంత్రియు ఘనుఁడు కృష్ణపమంత్రి
వారిలోపలఁ బెద్ద వరగుణుఁడు
శంకరామాత్యుఁ డాతనిసతియు గుణక
దంబ సుజనాంబ నారాయణాంబ కాత్మ
జన్మలగు నారపాఖ్యుండు స్వామిలక్ష్మి
నారప యనంగ వెలసిరి వారిలోన.

గీ. అగ్రభవుఁడగు నారాయణాఖ్యునకును
శాయమాంబకు సుతుఁడవై జగతిఁబుట్టి
తదిమొదలు మత్ప్రియుండవై ధ్యానపరత
భక్తిఁ దగు రంగశాయి శ్రీ . . యి.

**End :**

మాలిని. సరసిజదళనేత్రా స్వర్గరాడబ్జమిత్రా
శరదరనిభగాత్రా చంద్రసూర్యాగ్నినేత్రా
సురమునినుతిపాత్రా శుంభదైతేయజైత్రా
ద్విరసనకటిసూత్రా దివ్యగంగాకళత్రా !

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

శివుని దారువనవిహారము, దానఁజేసి గౌరీదేవికి నీర్ష్య, మరల వారి యానుకూల్యము, నేకాశ్వాస ప్రబంధముగా నిట్లు హార్యపరాజు-రంగధామకవి రచియించెను. ఇతర విషయముల నుదాహృత పద్యములఁ జూడనగును.

**Colophon :**

ఇది శ్రీమద్ధరణీనందనీరమణీమణీరమణచరణాంభోజసేవాలబ్ధకవిత్వ పవిత్ర శ్రీమద్ధర్యపరాజవంశాంభోధిరాకాకైరవమిత్ర కాశ్యపగోత్ర శంకరమంత్రిరాట్పౌత్ర నారాయణపపుత్రాభిరామ శ్రీమద్రంగధామమంత్రి నామ ప్రణీతంబైన శివ (మృగయా) విలాసంబను మృగయావినోదార్థంబునందు సర్వంబు నేకాశ్వాసము.

## No 826. శివలీలావిలాసము.

## ŚIVALĪLĀVILĀSAMU.

Substance, paper Size $12\frac{5}{8} \times 7\frac{3}{4}$ inches Pages, 63 Lines, 27 on a page Character, Telugu Condition, fair, written on only one side of the paper Appearance, old Mode of writing, good but full of mistakes.

Begins on fol. 120 *b*. The other work herein is Sārangadhara caritra Foll. 1 a-117 b

Complete

An original poem in 2 Āśvāsas describing the story of the marriage of Gangā with Śiva. The author Timmakavi of Kūcimañci has dedicated this work to God Kukkutēśvara of Pithapuram as in the case of his ten other works, viz ,(1) Rukminīparinaya, (2) Simhācalamāhātmyamu, (3) Nīlāsundarīparinayamu, (4) Rājaśēkharavilāsamu, (5) Accatenugurāmāyanamu, (6) Sārangadharacaritra, (7) Saptasāgaramāhātmyamu, (8) Rasikajanamanōbhirāmamu, (9) Laksanasārasangrahamu and (10) Sarpapuramāhātmyamu.

The author was the son of Ganganāmātya of Kaundinyagōtra and pupil of Dendulūri Linganārādhya The work is stated to have been written in 31 days in the year Dhātu corresponding to the Śaka year 1678. In a note of Mr C P Brown the corresponding English year is given as 1756 A.D

**Beginning:**

ఉ. శ్రీనగజాఘనస్తనవిస్ఫురత్వరసంకుమదైణనాభిపం
కానిశవాసితస్ఫుటభుజాంతరుఁ డిందుసుధాపయస్సద్ర
గ్భానుతకీర్తి పీఠపురకుక్కుట లింగమహాప్రభుం డశే
షానతభక్తపాలనపరాయణుఁ డీవుత మాకభీష్టముల్.

* * * *

సీ. కౌండిన్యగోత్ర విఖ్యాతుఁడఁ గూచిమం
చ్యన్వయాంభోధినీహారకరుఁడ
గంగనమంత్రి శేఖరునకు నంగనా
మణియగు లచ్చమాంబకును సుతుఁడ
బహుకావ్య నిర్మాణబంధురప్రతిభుఁడఁ
గుక్కుటేశ్వరకృపాంకూరలబ్ధ
సత్కవితామహాసామ్రాజ్యభారధౌ
రేయుఁడ బుధజనప్రియచరితుఁడ

డుపులురి లింగనారాధ్య దేశికేంద్ర
దత్త మాహేశ్వరాచారవృత్తిరతుఁడఁ
గండరాడఘు గ్రామ మందిరుఁడను
దిమ్మకవి చంద్రుఁడను జగద్వినుతయశుఁడ ॥

వ. మఱియును,

సీ. ప్రౌఢిమై రుక్మిణీ పరిణయంబును సింహ
శైలమహాత్మ్యంబు నీలపెండ్లి
కతయును రాజశేఖర విలాసంబును
నచ్చతెనుఁగు రామాయణంబు
సారంగధర నరేశ్వర చరిత్రంబు స
ప్తార్ణవసంగ మాహాత్మ్యకంబు
రసికజన మనోభిరామంబు లక్ష్మణా
నాక సంగ్రహమును సర్పపురన
గరచిత క్షేత్రకథనంబు మఱియుఁ బెక్కు
శతక దండక సత్కృతుల్ ప్రతిభఁ గూర్చి
యల్లమలరారఁ బార్వతీవల్లభునకు
భక్తినర్పణచేసిన భవ్యమతిని.

వ. ఇట్టి నేను మదభీష్టదైవతంబైన కుక్కుటేశ్వర శ్రీమన్మహా దేవునకు నంకితంబుగా మఱియు నొక్క ప్రబంధంబు రచియింపం దొడంగి.

* * * *

క. పురదైతేయస్మయసం
హారునకు హారునకు నిరంతరాత్యంతదయా
పరునకుఁ బీఠపురీ మం
దిరునకు శ్రీకుక్కుటేశ దేవవరునకున్.

వ. సమర్పణంబుగా నా రచియింపంబూనిన శివలీలావిలాసంబను శృంగారరసప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన.

**End :**

తే. అనుచు భీష్ముండు పాండుపుత్రునకు గంగ
కథ యెఱింగింపనలరి యాపృథుబలుండు

నిటలలోచనుఁ దలఁపున నిలిపి మ్రొక్కి
యతితరామోదహృదయుఁడై యలరుచుండె.

తే. శాలివాహనశకవర్షసంఖ్యవసున
గాంగ శశిసంజ్ఞ నలరు ధాత్రబ్దమునను
దగరచించిన యీకృతి ధరణియందు
నాసుధాకరతారార్కమగుచునుండు.

క. వినుఁ డీకృతి ముప్పదియొక
దినమునకుఁ జెప్పినాఁడ దేవునియానె(నఁ)
జనులెన్నఁ గుక్కుటేశ్వరు
ఘనకరుణాదృష్టివలనఁ గవివరులారా.

*  *  *  *

మాలిని. ప్రముదితమునిజాలా భక్తలోకానుపాలా
శమనమదవిభంగా చారుగంగోత్తమాంగా
ప్రమథగణసనాథా పార్వతీప్రాణనాథా
కుముదహితకలాపా కుక్కుటాధీశరూపా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమత్కుక్కుటేశ్వర కరుణాకటాక్షనిరీక్షణసంలబ్ధ సరసకవితాసామ్రాజ్యధురంధర ఘనయశోబంధుర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర సకలసంస్కృతాంధ్రలక్షణ కళాకౌశలాభిరామ తిమ్మకవిసార్వభౌమ ప్రణీతంబైన శివలీలావిలాసం బను శృంగారరసప్రబంధంబునందు సర్వంబును ద్వితీయాశ్వాసము.

(వి-వి.)—

వ్రాఁత మంచిది. కాగిదమున కొకప్రక్కమాత్రమే వ్రాఁతకలదు. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

రెండాశ్వాసముల యీప్రబంధమున శివుఁడు గంగను బెండ్లాడు కథ వర్ణితమైనది. పీఠికాపుర కుక్కుటేశ్వరాంకితముగా కూచిమంచి తిమ్మకవి దీనిని ముప్పదియొక్క దినమునకు రచియించెను. దీని రచనా కాలము శక ౧౬౭౮ కి సరియగు ధాత సంవత్సరము. గ్రంథకర్తను గూర్చియు నాతని గ్రంథములఁగూర్చియు నుదాహృత గ్రంథభాగమున నుండి విశేషము తెలియఁగనగును.

## No. 827. శివలీలావిలాసము.

## ŚIVALĪLĀVILĀSAMU

Substance, palm-leaf. Size, $17\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 41 Lines, 7 on a page. Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, good but not free from mistakes.

Complete.

Same work as the above

The scribe adds—

"ప్రమోదూతనామ సంవత్సర ఫాల్గుణ బ x శు సరిగా పెదపిల్లి లింగప్పకు కుండ్డూరి పరవతాలు బోల్లాజు చిట్టాయ ప్రతినివుంన్న క్రమా నను . . వ్రాశియిచ్చెను."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. కొంచెము పురుగు తినినది.

పూర్వమువలె.

---

## No. 828. శివలీలావిలాసము.

## ŚIVALĪLĀVILĀSAMU.

Substance, palm-leaf Size, $13\frac{1}{2} \times 1\frac{5}{8}$ inches Pages, 7. Lines, 5 on a page. Character, Telugu. Condition, slightly injured Appearance, old. Mode of writing, bad and full of mistakes

Begins on fol 1*a* The other work here inis Basavapurāṇamu Foll 5*a*—14*b*.

Fragmentary.

Same work as that described above

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండియుఁ గలదు గాని అల్పభాగమే. వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి.

పూర్వమువలె.

---

## No. 829. శివలీలావిలాసము.

## ŚIVALĪLĀVILĀSAMU

Substance, palm-leaf Size, $16 \times 1\frac{5}{8}$ inches. Pages, 68. Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete.

Same work as the above

The scribe adds —

"ప్రమోదూతనామ సం॥ మార్గశిర బ ౧౧ సోమవారాన గంగా పాత్రుని(భా ?) చాగం ౨ మాచెటి సర్వేశలింగానకు వ్రాశియిచ్చిన గంగ్గావివాహము."

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత యొకమాదిరిగా నున్నదిగాని నిర్దుష్టముగాదు. శైథిల్యము గలదు.

పూర్వము వోలె.

---

## No 830. శుకరంభాసంవాదము.

## ŚUKARAMBHĀSAṀVĀDAMU

Substance, palm-leaf. Size, 15½ × 1¼ inches Pages, 30. Lines, 4 on a page. Character, Telugu. Condition, much injured Appearance, old Mode of writing, fair but full of mistakes

Wants the beginning and end.

A short Prabandha narrating the conversation that took place between the sage Śuka and Rambhā, a celestial nymph of surpassing beauty in the paradise of Indra when she was sent by him to spoil the penance of Śuka The name of the author is not given.

**Beginning:**

వ. అనిన శుకరంభాసంవాదంబును మహాప్రబంధంబును బ్రహ్మా నారదునకు జెప్పిన తెఱంగు సద్గురుండు ప్రియశిష్యునికి వినుపించు మనిన విన్నవించెద మఱియు శుకరంభాసంవాదమునకుం గథాక్రమం బెట్టిదనిన.

సీ. శ్రీగురుమూర్తి రాజీవాక్ష నా(యొ ?)క కథ
చెప్పెద వినవయ్య చిత్తగింపు(చి ?)
హరిమాయ నంటక ధరలోన నా (శు?) కయోగి
తపము చేసిన వజ్రధరుఁడు బెగడి
చెల్లఁబోయిని(యి?)ఁక నేమి సేయుదునని మది
వశ్చాత్తపంబునఁబడియె లెస్స
చింతించి మూర్ఛిల్లి యంతలో (న?) . . దెలిసి
యాత్మలోపల మాటలాడుకొనుచు

తెలివి తెచ్చుకొ తలవక్క తోఁజెప్పి(?)
రంభనిపుడు వేగ రమ్మటంచు
నవ్వనప్పుడేగ పరగున నేతెంచి
సకియఁ బిలిచిరపుడు సరభసమున.

**End :**

వ. మఱియు రంభ లేచి శుకయోగి దివ్యశ్రీపాదపద్మంబులకుఁ జేతులెత్తి మ్రొక్కి యంజలిచేసి రంభ ఖిన్నురాలై తమ బ్రహ్మపట్ట(ణ?)ంబునకు నేగెనపుడు.

క. ఈకథ చదివిన వ్రాసినఁ
బ్రాకటముగ విన్నఁ గన్న భావజ్ఞులకున్
ఏకమహైశ్వర్యోన్నత మొందుచు
శ్రీకంఠునికరుణ గల్గి చిరజీవి తఁడౌ

The following note of the scribe appears at the close of the Ms —

" . . . కాకరపర్తి ఆదినారాయణమూర్తి వ్రాశి పుష్పల పాటి పద్మనాభుడు కుమారుడు చిరంజీవులయిన శంకరరాజుకి యిస్తిని."

(వి-వి.)—

అవతారిక లేదు. గద్యము లేదు. వ్రాఁతమంచిది తప్పులు హెచ్చు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఈలఘు ప్రబంధమున నస్ఖలిత బ్రహ్మచారియగు శుకయోగికిని, అతని తపము భంగము చేయుటకై యింద్రుఁ డంపిన దేవవేశ్యయగు రంభకును జరగిన సంవాదము గలదు. కర్త యెవరో తెలియదు.

---

## No. 831. శుకరంభాసంవాదము.

## ŚUKARAMBHĀSAṀVĀDAMU

Substance, palm-leaf. Size, 15 × 1⅜ inches. Pages, 12 Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes The leaves are not in order.

Incomplete and imperfect.

Same work as that described above.

(వి-వి.)—

అసమగ్రము. అవతారికా గద్యములు లేవు. గ్రంథపాతములు గలవు. ఆకు లొకటికొకటి సంబంధము లేకుండ నున్నవి. మొదటి

యాకులోని గ్రంథమే తిరిగి రెండవయాకున నున్నది. వ్రాంత యొక తరబడిగా నున్నదిగాని నిర్దుష్టముగాదు.

పూర్వము వాలె.

---

## No. 832. శుకరంభాసంవాదము.
## ŚUKARAMBHĀSAṀVĀDAMU

Substance, palm-leaf. Size, 14¾ × 1⅜ inches. Pages, 21. Lines, 6 on a page Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Wants the beginning and end.

Same work as that described under No. 831 *ante*.

The last three pages of the Ms. contain some stray verses both in Telugu and Sanskrit.

(వి-వి.)—

అవతరణిక లేదు. గద్యము లేదు. కథపట్టుమాత్రము, సమగ్రముగాఁ గలదు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు కొలఁదిగాఁ గలవు.

పూర్వము వాలె.

కడపటి మూఁడు పుటలలో శ్రీరామస్తుతి శ్లోకములు తెల్గు విడిపద్యములు గలవు.

అవతారికయు నంకనాదికములును గఱిపింపవు ఫలశ్రుతి పద్యము కూడ నింపు లేవు. పుస్తకశైథిల్యమువలని గ్రంథపాతములు గలవు. వ్రాఁత యొకతరబడిగా నున్నదిగాని నిర్దుష్టముగాదు.

కడపటి మూఁడుపుటలమీఁదను సంస్కృతాంధ్రభాషల విడి పద్యములు కొన్ని గలవు.

---

## No 833 శుకసప్తతి.
## ŚUKASAPTATI

Substance, paper. Size, 115 × 7⅝ inches. Pages, 353 Lines, 23 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion and breaks off in the fourth Āśvāsa.

Seventy stories dealing with Nīti and Śṛṅgāra. The author Pālavēkari Kadirīpati was the son of Kariyamāṇikyampa of Tāḍigōḷḷa and was a devotee of Nṛsimhasvāmi worshipped at Kadiri (Khādri) in the Anantapur district. The work is dedicated to God Rāmacandra.

As the Ms. under notice does not contain the introductory portion, it is not possible to give any further information about the author. At the end of the Ms. 27 pages give an index of the stories with their corresponding page number.

**Beginning:**

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పం బూనిన శుక సప్తతియను మహాప్రబంధమునకుఁ గథాక్రమం బెట్టిదనిన

*　　*　　*　　*

క. శ్రీరామాంకధరాజా
తారామవసంత సంతతామితవిభవా
దారా మాధుర్యవచో
ధారామార్తాండధామ దశరథరామా.

తే. అవధరింపుము సకల రాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సకలవైదికలౌకికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్లు లనియె.

(Canto 1 beginning.)

**End:**

తే. అప్పు డన్నాతి యేరీతి నాత్మమాన
భంగ మాచ్ఛాదితంబు సేయంగవలయు
ననఁ బ్రభావతి నన్నేమి యడిగె దవలె
కథ యెఱింగింపు మనిన శుకంబు పలికె

*　　*　　*　　*

క. అని పలుకు దానిమాటలు
విని నిశ్చయ మని తలంచె విభుఁ డోపద్మా
నన యంత నేర్పుగలిగినఁ
జనవచ్చు నటంచుఁ గీరచంద్రుఁడు పలికెఁ.

**Colophon:**

(Taken from the end of the 3rd canto.)

గద్య. ఇది శ్రీమత్కాదిరి (ఖాద్రి)నృసింహకరుణాకటాక్షవీక్షణసమాగతకవితాధార(క)పాలవేకరికులకలశాంభోనిధిసుధాకర తాడిగోళ్ల క(ర్య)

రియమాణిక్యనృపహర్యక్ష పౌత్ర పవిత్రచరిత్ర కదురనధరామండలాఖండల పుత్ర విద్వత్కవి విరక్షణానుసంధాయక ఖదిరీపతినాయక ప్రణీతంబైన శుకసప్తతియను మహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము.

(వి.వి.)—

అసమగ్రము మూఁడాశ్వాసములు సమగ్రముగాఁ గలవు. నాల్గవ యాశ్వాసమునఁ గొంతగలదు. అవతరణిక లేదు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గలదు. పుస్తకమున సగపాలు కాగితములు పాడైపోయినవి. గ్రంథపాతములు లేవు.

నీతి శృంగారభరితములైన కథలు డెబ్బది యీ ప్రబంధమున వర్ణితములయి యుండును. ఈ ప్రతి యసమగ్రముగాన యిందుఁ గొన్నియే కలవు. భర్త ప్రవాస మరిగియుండఁగా, నొక వైశ్యకాంత పరపురుషాప్తికై పోవఁజూచుటయు, పెంపుడు చిలుక యొకొక రాత్రి యొకొక కథ చెప్పి. భర్త తిరిగివచ్చుదాఁక నామె దుర్వాంఛను సాగనీయక నీతి గఱపుటయు నీకథలందుఁ గాననగును. కాని, కథలెల్ల శృంగారమయములు. రసోత్తరమయిన యీకథాప్రబంధమును రచించిన కవీశ్వరుఁడు పాలవేకరి కదిరీపతి తాడిగోళ్ల కరియ మాణిక్య నృపుని పౌత్రుఁడు. కదిరి నృపాలుని పుత్త్రుఁడు కదిరి నృసింహస్వామి భక్తుఁడు కదిరి నేఁడు అనంతపుర మండలమునఁ గలదు. ఈ గ్రంథము శ్రీరామచంద్రమూర్తి కంకితము. కృత్యవతరణిక లేదు గాన యింతకంటె విశేషము లెఱుఁగరావు.

గ్రంథాంతమున 27 పుటలలో కథల విషయసూచి, పుటసంఖ్యతోఁగలదు.

---

## No. 834. శుకసప్తతి.

## ŚUKASAPTATI.

Substance, palm-leaf Size, $16\frac{7}{8} \times 1\frac{1}{2}$ inches Pages, 346. Lines, 4 to 8 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old Mode of writing, fair but not free from mistakes

Wants the introductory portion and a small portion at the end of the work ; otherwise complete

Same work as the above.

The following note appears on a paper fastened on the outer leaf of the Ms..—

"This contains stories that are not in the edition prepared in 1832, 1839"

**End :**

చ. అనుటయు సంతసించి వసుధాధిపునిం గని చిల్కవల్కె నో
యనుపమశౌర్య! నే శుకమహాద్వివరేణ్యుఁడ నీ ప్రభావతీ
వనరుహగంధి ప్రాక్తన భవంబున మమ్ము భజించియుండె నా
నెనరున సంధిలంగనఁగ నేఁ జనుదెంచితి నీశుకాకృతిన్.

ఉ. వచ్చి ప్రభావతీ వికచవారిజలోచన మమ్ముఁ గొల్వ నే
నిచ్చ రహించు వేళ జగతీశకులార్ణవపూర్ణచంద్ర! నీ
వచ్చుపుఁ బ్రేమ నన్ బిలువ నంపుట కెద్ది కతంబు తెల్పవే
మచ్చికనన్న యన్నృప కుమారకుఁ డత్యనురాగవైఖరిన్.

* * * *

సీ. కాకుత్స్థకులుఁడై సకల నృపుల్ తనుఁ గొల్వ
రఘుఁడే జగద్ధిత రచన నొందె.
పడరాని యిడుములఁ బడియుఁ బొంకు నెఱుంగ
కల హరిశ్చంద్రుండే . . . . .

* * *

(వి-వి.)—

అవతరణిక, అవసాన భాగమునఁ గొంచెము భాగము కొఱంతగాఁ దక్కిన గ్రంథమెల్లఁ గలదు. ఇందు ఆశ్వాసబంధము గానరాదు. వ్రాఁత మంచిది. తప్పులు మెండు. శైథిల్యము గొంచెముగాఁ గలదు. గ్రంథపాతములు లేవు.

ఇది పూర్వవర్ణితమే. కాని, యిందు గ్రంథము సంపూర్ణముగా నున్నది. కడపట నిందు గ్రంథసమాప్తిభాగ మెక్కువగాఁ గలదు. పూర్వవర్ణితములగు ప్రతులలోనున్న కథలలోఁగూడ నిందుఁ గొన్నికొన్ని పద్యము లధికముగాఁ గలవు దీనికిఁ దార్కాణగా పూర్వవర్ణిత ప్రతులలోఁగల కడపటి రెండు కథలను జూడవచ్చును. వానిలోఁ బెక్కు పద్యము లిందెక్కువగాఁగలవు. ఈ కథలు 59 రాత్రులు చెప్పినట్లున్నవి. ఉపకథలతో లెక్కింపఁగా నీ ప్రతినిబట్టి డెబ్బది కథలు చేర్పడును గాఁబోలును.

## No 835. శుకసప్తతి.

## ŚUKASAPTATI.

Substance, palm-leaf. $17\frac{7}{8} \times 1\frac{5}{8}$ inches. Pages, 118. Lines, 7 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Contains the first Āśvāsa (without the introductory stanzas) complete and a portion of the second Āśvāsa.

Same work as the above.

(వి-వి).—

అసమగ్రము. కృత్యవతరణిక లేదు. ద్వితీయాశ్వాసమునం గొంతదాకఁ గలదు. ఇం దాశ్వాసబంధము గానరాదు. అవతారిక లేదు. వ్రాఁతమంచిదే తప్పులున్నవి. శైథిల్య మించుక గలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No 836. శుకసప్తతి.

## ŚUKASAPTATI

Substance, paper. Size, $12\frac{1}{4} \times 8$ inches Pages, 356. Lines, 24 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Contains the chapters 1—3 complete and breaks off in the course of the 4th chapter

Same work as the above. The following note of Mr. Brown appears in the b ginning of the Ms —

" . A series of amorous tales—twenty in number, the book not having been completed

" This edition was prepared under my directions in the year 1831 "

(వి-వి).—

అవతారిక లేదు. చతుర్థాశ్వాస మధ్యమున గ్రంథము నిలిచిపోయినది. ఈయాశ్వాసారంభమున నుండవలసిన కృతిపతి సంబోధన పద్యము గనిపింపదు. ఈ యాశ్వాసమిందుఁ జతుర్థాశ్వాస మనఁబడినప్పటికి నది యగునో కాదో తెలియదు. చిన్న చిన్న గ్రంథపాతము లక్కడక్కడ నున్నవి వ్రాఁత మొత్తముమీఁద బాగుగానున్నది గాని యంతగా నిర్దుష్టముగాదు. ఈ ప్రతిని 1831 సం॥ బ్రౌను దొరగారు వ్రాయించినట్లున్నది.

గ్రంథాంతమున 28 పుటలలో గ్రంథకథా విషయసూచి కలదు.

## No. 837. శుకసప్తతి.
## ŚUKASAPTATI

Substance, paper. Size, 10 × 6½ inches. Pages, 1,054. Lines, 18 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Each volume contains one Āśvāsa only. Written on only one side of the paper. Different readings are interlined and also written on the other side of the paper.

Same as the above

The following notes of Mr Brown appear on fly-leaves in the beginning of the first volume —

" The Sukasaptati

" A Series of Tales illustrating the various dialects of the Telugu language

" This valuable work is very rare indeed, and I never met with a perfect copy. The present one has been collated with five Mss. procured with difficulty in various parts of the peninsula

" Had it been composed in times when Telugu learning was patronized it would have been better preserved · but the compositions of a dark age however valuable, are seldom preserved with any care.

' This book ' The Seventy Tales of a Parrot ' has the same title with the well-known Sanscrit composition, of which however it is not a translation, but an imitation The work seems incomplete, the author not having finished the whole ; it is perfect as far as it goes

" The discrepancies in the various Mss. of this book are very great indeed, whole lines being substituted one for another. It will therefore be very difficult to select a pure text.

" The Hamsavimsati is a work of the same description and the close resemblance in many passages show that one must have been borrowed from the other.

" Since writing the foregoing remarks I have persuaded Zuluri Appaya, a very eminent Telugu scholar, to revise and correct the work He has done this very carefully and successfully He considers it to be superior in style and in good taste to the Hamsavimsati, which however contains a greater variety of words and technical phrases

" He objects however very justly to the title of the work, and proposes to say ' The *Thirty* Tales of the Parrot ', *not* the *Seventy* Tales. For the book was never completed.

" I have since obtained another manuscript (1839) which contains some additional passages."

The following Telugu note also appears on a page before the

"ఆ ౧౮౩౦ సంవత్సరములో జూలూరు అప్పయ్యశాస్త్రి యేర్పరిచిన తర్వాత ౧౮౩౮ సం॥ దొరికిన పుస్తకమందు పైలుచేరిన భేదములు ( . . . ?) అడ్డంగావుండే కాకితాలమీద వ్రాయడ మైనది."

(వి-వి.)—

అవతారిక దక్క మొదటి మూఁడాశ్వాసములు నాకొక్కటి యొకొక్క సంపుటములో వ్రాయఁబడియున్నవి. మొదట నీ సంపుటములు పత్రమున కొక ప్రక్కఁగాని పత్రమువిడిచి పత్రముమీఁదఁగాని వ్రాయఁబడియున్నవి. పాఠభేదములు తరువాత బంతుల నడుమ నిరికింపఁబడినప్పుడందులో నతి దీర్ఘములైనవి మున్నగునవి వ్రాయని ప్రక్కల వ్రాసినట్లున్నది. ఈప్రకారము వ్రాయఁబడిన ప్రక్కలు మిక్కిలి యరుదు. వ్రాఁత బాగుగానున్నదిగాని నిర్దుష్టముగాదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది నె 833 రున వర్ణించిన గ్రంథమే.

వాడుకపలుకు లిందు హెచ్చుగాఁ బ్రయోగింపఁబడియున్నవనియు, అతి కష్టముమీఁద నీ యపూర్వ గ్రంథమునకై డసంపూర్ణప్రతులు సంపాదించి వానిని సంప్రతించినమీఁద నీప్రతిని వ్రాయించితిమనియు, ఇది యుత్కృష్టకావ్యమైనప్పటికి నాంధ్రభాషాభిమానము తక్కువగానున్న కాలములో రచియింపఁబడుటచేత దీనికి మంచి ప్రతులు లేకపోయెననియు, ఇది సంస్కృత శుకసప్తతికి సరియైన భాషాంతరీకరణముగాక దాని ననుసరించి వ్రాయఁబడి యసమగ్రముగా వదలిపెట్టఁబడినప్పటికి నున్నంతవఱకు సంపూర్ణముగానున్నదనియు, పాదపాదములుగాఁ బాఠభేదములుండుటంజేసి సరియైన పాఠములు కనిపెట్టుట మిక్కిలి కష్టమనియు, హంసవింశతియు నిదియు ననేకసందర్భములం దెక్కుడు పోలికయుండుటచేత నేదోయొకటి రెండవ దానినుండి యపహరింపఁబడియుండవలెననియు, తమ బలాత్కారముమీఁద నీ ప్రతిని బరిష్కరించిన మహాపండితుఁడగు జూలూరి యప్పయ్య హంసవింశతియందు దీనికంటె నెక్కుడు పారిభాషికపదంబులును వాడుక పలుకులును నున్నప్పటికి దానికంటె నిది శైలియందును రుచియందు నుత్కృష్టతరమైనదని యభిప్రాయపడెననియు, అతఁడీ గ్రంథ మసమగ్రముగా వదలిపెట్టఁబడినది గనుక దీనికి సప్తతియను పేరుగాక త్రింశత్తు అను పేరు పెట్టవలెనని చక్కఁగాఁజెప్పెననియు, ౧౮౩౯ వ సం॥న సంపాదించిన యొక ప్రతియందింతకన్న నెక్కుడు గ్రంథమున్నదనియు బ్రౌను దొరగారు ప్రథమ సంపుటారంభమందలి విడిపత్రములమీఁద వ్రాసియున్నారు.

## No. 838. శుకసప్తతి.

## ŚUKASAPTATI.

Substance, palm-leaf. Size, $12\frac{3}{8} \times 1\frac{5}{8}$ inches. Pages, 148. Lines, 5—9 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes. The preface and the beginning of the introduction are wanting.

Incomplete.

Similar to the work described under No. 833 *ante*. The author Sangaya, the son of Tallayāmātya, has dedicated his work to God Nrsimha worshipped in the Vaisnava shrine at Ahōbala.

**Beginning:**

క. ఆనుమతియు హారదత్తుఁడు
భాసురముగ మదనకేళిఁ బాఁడరు రోతుం
జేసిననోములు (ల ?) చే జల
జాసనుఁడాత్మజులు(ల ?)ను(నీ ?) నియులమటచేతన్.

**Colophon:**

గద్య. ఇది శ్రీమదహోబల శ్రీనృసింహోవ (హోబాప ?) లబ్ధప్రసాదనిత్య తల్లనామాత్య తనూజ సరసకళాభోజ ఘనతరభాగధేయ సింగయ నామధేయ ప్రణీతంబైన శుకసప్తతియను విచిత్ర శృంగార నూత్న ప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

**End:**

క. శ్రీకరచక్రాయుధధర
రాకాత్రేయారఛనయనరాజితశశ్వ
ల్లోకాస్తోకపరాయణ
శ్రీకంఠమనోవికాస శ్రీనరసింహా.

వ. దేవపరమేశ్వరికి నీశ్వరుండిట్లనియె నట్లుపన్యసింపుచుండఁ బ్రభాతంబగుటయుఁ బ్రభావతి పదియేడవనాఁటిరాత్రి ధాత్రీశుకడకుం బల్లకీసమేతంబుగా నరుగ నుద్యోగించు సమయంబున నుద్యత్ప్రీతివహించు నొకరి యితిహాసంబు చెప్పెద నాకర్ణింపుమని చిలుక యిట్లనియె.

*   *   *   *

క. తలవరులు వానిఁజంపం
బిలుతురుచోరునకుఁ బ్రాణభీతియుదోఁచఁగన్
వలసినపనిడైయున్నది
కలకంఠీ తెల్పు . . . . . .

(ఇ-ఇ.)—

అసమగ్రము. కృత్యవతరణిక లేదు. తృతీయాశ్వాసము కొంత దాఁకఁగలదు. గ్రంథ మకరాదికి ౩౧ కథలో నున్నది. వ్రాఁత యస్పష్టమై తప్పులతో నిండియున్నది. శైథిల్య మించుకఁగలదు. గ్రంథపాతములు లేవు.

ఇది నెం 833 రు వర్ణితమగు గ్రంథమును బోలినదే. కాని యందలి కథల తీరును నిందలి కథల తీరును వేఱుపడునట్లున్నది. సంస్కృతమునఁగల శుకసప్తతికిని దీనికిని బొందిక కలదు వోలె నున్నది నెం 833 రు గ్రంథమున కథలకంటె నిందలి కథలు చిన్నవి. ఈ గ్రంథమును తల్లయామాత్య పుత్త్రుఁడగు సింగయ రచియించెను. అహోబల నరసింహదేవున కంకితము చేసెను. కృత్యవతరణిక లేదుగాన గ్రంథకర్తను గూర్చి విశేషము తెలియఁగరావు.

---

## No. 839. శృంగారనైషధము.

## ŚRṄGĀRANAISADHAMU.

Substance, paper. Size, $9\frac{3}{8} \times 7\frac{3}{4}$ inches. Pages, 392. Lines, 19 on a page. Condition, good. Mode of writing, good but not free from mistakes Appearance, old.

Complete.

Same work as that described under R No. 69 of the Triennial Catalogue, Volume I.

(ఇ-ఇ.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

**ఆర్. నెం 69 రు చూచునది.**

---

## No. 840. శృంగారనైషధము.

## ŚRNGĀRANAISADHAMU

Substance, palm leaf. Size, $16 \times 1\frac{1}{4}$ inches. Pages, 201 Lines, 6 on a page. Mode of writing, good and free from mistakes. Condition, injured. Appearance, old

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమం దిట్లు గలదు:

కీలకాబ్దే నభోమాసే । ద్వాదశ్యా మిందువాసరే ।
నైషధం సితపక్షేఽస్మిన్ హేమః . కృష్ణమాలిఖత్ .

---

## No 841. శృంగారనైషధము.

## ŚRṄGĀRANAISADHAMU.

Substance, palm-leaf. Size, 14⅞ × 1⅝ inches Pages, 121. Lines, 7 on a page. Mode of writing, bad Contains mistakes and breaks off in many places. Condition, much injured Appearance, very old.

Incomplete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. ఆఱాశ్వాసములు మాత్రము గలవు. వ్రాంత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు మిక్కిలి హెచ్చుగాఁ గలవు.

పూర్వము వోలె.

గ్రంథాంతమున, 7 పత్రములలో నానార్థ పద్యములు, సులక్షణ సార పద్యములు, గలవు.

---

## No. 842. శృంగారనైషధము.

## ŚRṄGĀRANAISADHAMU.

Substance, palm-leaf. Size, 18 × 1¼ inches. Pages, 175. Lines, 8 on a page. Character, Telugu. Condition, injured and partly worm-eaten Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete, but very imperfect.

Foll 2 and 38—57 are wanting.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు. 4, 5 ఆశ్వాసము లుండవలసినవి. 38 నుండి 57 వఱకు పత్రములు పోయినవి.

పూర్వము వోలె.

గ్రంథాంతమున నిట్లు గలదు :—

సుక్లనామసంవత్సర మార్గశిర శుద్ధ x ఆదిత్యావారం మూఁడు జాములవరకు శేకుహమ్మదుసాహెబు నైషధకావ్యం అష్టమాశ్వాసములును సంపూర్ణంగా వ్రాసెను.

---

## No. 843. శృంగారనైషధము.
## ŚṚṄGĀRANAIṢADHAMU.

Substance, palm-leaf. Size, 14 × 1½ inches. Pages, 382. Lines, 6 on a page Mode of writing, good and free from mistakes. Condition, much injured. Appearance, old.

Complete but imperfect.

Same work as that described above

(వి-వి.)—

సమగ్రమే కాని పుస్తకశైథిల్యమువలని గ్రంథపాతము లెక్కువగనే యున్నవి. వ్రాఁత బాగుగా నున్నది. దోషములు నంతగాఁ గనిపింపవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమున నిట్లు గలదు :—

“ సర్వధారినామసంవత్సర భాద్రపద బ 30 బుధవారంసంపూర్ణముగా పోలయ్య.”

---

## No 844. శృంగారనైషధము.
## ŚṚṄGĀRANAIṢADHAMU.

Substance, palm-leaf. Size, 18½ × 1½ inches. Pages, 98. Lines, 7 on a page. Mode of writing, not bad, free from mistakes and omissions. Condition, fair. Appearance, old.

Contains the Āśvāsas 1—4 complete.

Same work as above.

(వి-వి.)—

అసమగ్రము. తొలినుండి సాల్గవ యాశ్వాసము కడదాఁకఁ గలదు. వ్రాఁత కన్నడ మోడి గలది. తప్పులంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

పూర్వము వోలె.

ఇందు 1*a* గణపవరపు వెంకటకవి నిఘంటువు, 31*a* ద్విరూప కోశము, 40*a* అలంకారాదుల లక్షణము, 55*a* కావ్యాలంకారచూడామణి, 66*a* రాధామాధవ సంవాదము, 111*a* ఛందోవ్యాకరణాది విషయములు, గలవు.

---

## No **845.** శృంగారనైషధము.
## ŚṚṄGĀRANAIṢADHAMU.

Substance, palm-leaf Size, 18 × $1\frac{3}{8}$ inches. Pages, 194. Lines, 6 on a page Mode of writing, good but not free from mistakes. Condition, much injured. Appearance, very old

Complete, but wants some leaves here and there

Same work as the above.

(వి-వి.)—

మొదట సమగ్రమయినదే కాని యిప్పుడు నడుమనడుమ ననేకపత్రములు పోవుటయేగాక యంతమం దనేకపత్రములు వరుసగాఁ బోయినవి. అందువలన గ్రంథ మష్టమాశ్వాస మధ్యమున విరిగిపోయినది. పుస్తకశైథిల్యమువలని గ్రంథపాతములు విశేషము. పోయిన యాకులటుండఁగా ననేకపత్రములు సగము చినిఁగియున్నవి. వ్రాఁత యొక మాదిరిగా నున్నదిగాని నిర్దుష్టముగాదు.

పూర్వము వోలె.

---

## No **846.** శృంగారనైషధము.
## ŚṚṄGĀRANAISADHAMU

Substance, palm-leaf. Size, $16\frac{3}{4}$ × $1\frac{1}{4}$ inches. Pages, 46. Lines, 8 on a page. Mode of writing, fair but not free from mistakes. Condition, much injured. Appearance, very old

Breaks off in the beginning of the third Āśvāsa.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. తొలినుండి తృతీయాశ్వాసారంభ పత్రముతోనే గ్రంథము నిలిచిపోయినది. పుస్తక శైథిల్యమువలని గ్రంథపాతములు విశేషము. సగము చినిఁగిన యాకులటుండ ౧౦, ౧౨, ౧౭ సంఖ్యల తో నుండవలసిన యాకులు మొదలే కనుపింపవు. వ్రాఁత యొకమాదిరిగాని నిర్దుష్టముగాదు.

పూర్వము వ్రాసె.

గ్రంథాంతమం దిట్లుగలదు :—

" జయనామ సంవ్వత్సర ఆషాఢ బ ౧౦ మ . . . ."

---

No **847.** శృంగారరాఘవము.

ŚṚṄGĀRARĀGHAVAMU.

Substance, palm-leaf. Size, $14\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches. Pages, 100. Lines, 8 on a page. Character. Telugu. Condition, injured Appearance, very old. Mode of writing, good. Not free from mistakes and breaks off in many places.

Incomplete.

A Prabandha in Telugu narrating the story of the Rāmāyaṇa. The author Cerukumūdi Kṛṣṇayāmātya was the son of Vēṅkaṭādri and has dedicated his work to one Nārāyaṇamantri who was the son of Ayyanārya of Kātēpalli.

**Beginning :**

శా. శ్రీదక్షుప్రభవావివాహమున లక్ష్మీనాథ . . . . చం।
ద్రాదిత్యప్రముఖామర . . . మూహాస క్తిఁ గ్రేగంటి నేం।

* * * *

సీ. గురుతరశ్రీవత్స గోత్రు నాపస్తంబ
సూత్రు నిత్యార్చిత సోమగాత్రు।
పాకనాటార్వేల వారలలో మేటి
ధూర్జటిదౌహిత్రు దురితదూరు।
నలరు వేదామాత్యు వలనను సాధ్వియౌ
నకలమాంబాగర్భమందు జనితుఁ।
దగువానికల వెంకటాద్రికి పుత్రుఁడౌ
చెఱుకుమూడి కులేంద్రు వరకవీంద్రు.

గీ. దక్షిణామూర్తికరుణాకటాక్షలబ్ధ ।
చారుసామర్థ్యనిర్మితభూరికావ్య ।
నందితాశేషబుధకోటి నవ్యవేదయ ।
దనరఁ బిలిపించి పలికె మన్ననదలిర్ప.

* * * *

వ. శ్రీమదమితకల్యాణపరంపరాభివృద్ధిగా నాయొనర్పఁబూనిన శృంగారరాఘవంబను మహాప్రబంధంబునకు కథావిధానం బెట్టిదనిన.

**End:**

కం. అనుటయు వాల్మీకిమహా
మునియుఁ బంకేజభవుని పుత్రుఁడనెంతేఁ
వినుతించి యవలికథమా
కనఘాత్మక తెలుపవలయు ననియడుగుటయుఁ.

స్రగ్ధర. శ్రీ రాజత్కీర్తిధామా జితసుకవి . . . శైవాఽజాలా ।
క్షీరాంభోరాశికన్యాం చితహిమశిఖ . . . శ్వరాంక ।
. . . గ్లాబింబలక్ష్మీ భవనపదశిరః ఫణ్యధీశాద్రిశ్రీ
భారాధారాం సకాశేపలికులజలజబ్రధ్న నారాయణార్యా.

**Colophon:**

శ్రీదక్షిణామూర్తికటాక్షవీక్షణనిర్మితప్రబంధగ్రథిత శృంగారజ్ఞాన వైరాగ్యరచనాతోషిత సకలసుకవికోటి ధూర్జటిదౌహిత్ర వేదయార్య ప్రదత్త వేంకటాద్రి సుపుత్ర చెఱుకుమూఁడికులపవిత్ర సరసపాండిత్య కృష్ణయామాత్య ప్రణీతంబైన శృంగారరాఘవం బను మహాప్రబంధం బునందు తృతీయాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. మూఁడాశ్వాసములు మాత్రముగలవు. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు మిక్కిలి గలవు.

ఈ హృద్యప్రబంధ మెన్ని యాశ్వాసములుగలదో యెఱుఁగరాదు. ఇందుఁగల మూఁడవయాశ్వాసము సీతాపహరణకథతో ముగియుచున్నది. గ్రంథకర్త చెఱుకుమూఁడి కృష్ణయామాత్యుఁడు, వెంకటాద్రిపుత్త్రుఁడు. కాశేపల్లి యయ్యనార్యుని పుత్త్రుఁడగు నారాయణమంత్రికిది యంకితము.

No. **848.** శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము.

ŚṚṄGĀRAŚUDHĀSAMUDRAPŪRṆACANDRŌDAYAMU.

Substance, paper Size, $11\frac{5}{8} \times 7$ inches Pages, 115 Lines, 21 on a page. Character, Telugu Condition, injured Appearance, very old Mode of writing, good but full of mistakes

Complete.

An original poem in four Āśvāsas describing the love and marriage of Bilhana, a Sanskrit poet, with Yāminīpūrṇatilaka, the daughter of Madanābhirāma, who was the king of Lakṣmīnivāsapura in the Pāñcāladēśa The author Cennūri Sōbhanādrikavi, son of Rāmacandrakavi, wrote this work at the instance of Pāpayāmātya son of Jagganaprabhu of Padmanāyaka family and of Mārutlagōtra, chieftain of Gullapādu and dedicated it to Pāpayāmātya For other particulars regarding the genealogy of the dedicatee see the extracts given below For a similar work of this name, see under R No 158(*b*)

**Beginning:**

శ్రీరమణీస్థలంబులను జెక్కుల నొక్కుట నాల్గుచేతులన్
గూరిమి హెచ్చఁ గస్తురిని గోమలపత్త్రికల న్రచించు ల
క్ష్మీరమణుండు నందనసమీహితరాజ్యచిరాయురిష్టసం
భారములిచ్చి గుమ్మర(డ)పు పాపయనుంగ్నపతోడఁ బ్రోవుతన్ ॥

* * * *

ఉ॥ పన్నగసార్వభౌమపరిభాషితభాష్యపరిష్ప(?)దార్థవి
ద్వన్నుతవాగ్ధురీణు బహుధా పరిశీలితకావ్యనాటకా
భ్యున్నతసాహితీనవరసోజ్జ్వలు నూత్ననవప్రబంధకుం
జెన్నూరి రామచంద్రకవిశేఖరు మజ్జనకుం దలంచెదన్ ॥

* * * *

క. అనియిష్టదేవతావం
దనముం బ్రాచీనకవి పదద్వితయశ్లా
ఘనముం గవిమన్యవినిం
దనముం గావించియున్న తదవసరమునన్ ॥

సీ. . . . . . .
ధీరజయపటుపటహాభాంకారనీర
దారవాసారవారితాద్రాపరాధ
విద్విషద్రాజహంసుండు వితరణస్వ
భావుఁడగు గుమ్మడంపు పాపయ్యనృపతి ॥

వ. . . . . పద్మనాయకవంశపయఃపారావారసుధాకరుండును, కమ్మడపు గృహాభిధానుండును, గుళ్లపాటిపురవరాధీశ్వరుండును, మారుట్లగోత్రపవిత్రుండును, జగ్గన్నప్రభుమణికుమారశేఖరుండును, కిచ్చమ్మగర్భశుక్తిముక్తామణియగు పాపయ్యనరనాయకశిరోమణి యొకనాఁడు సకలజనాభీష్టసంధాయక పరిహృతజగదంహుండగు మట్టపల్లి శ్రీనృసింహుని మంటపంబున . . . . బంధుమిత్రానుజజనసమేతుండై సమున్నతోచితకనకాసనంబునఁ గూర్చుండి చిరంతనపుణ్యశ్లోకచరిత్రశ్రవణప్రసంగసంగతాంతరంగుండైన కతంబున॥

మ. నను శ్రీజానిపదారవిందయుగవందారుస్వభావుం జగం
తనవిద్వన్మణిభవ్యకావ్యరచనానానాచమత్కారబో
ధనధౌరేయు నవీనచిత్రకవితాధాటీనిరాఘాటవ
ర్ణనమాధుర్యవచోధురంధరుని భారద్వాజగోత్రోద్భవున్॥

*  *  +  *

క. ననుఁ గనుఁగొని కనుఁగొనలం
దనుపమకరుణారసామృతౌఘ మెనయ ని
ట్లనియె మృదుమధురగాఢో
రణిసభ్యస్వాంతములను రంజిలఁ జేయన్॥

ఉ. చెన్నూరి శోభనాద్రికవిసింహమ చిత్రకవిత్వధోరణీ
సన్నుతవాక్యవైఖరికి సజ్జనవర్యులు పిచ్చలింపసం
పన్న నవీన సత్కథ ప్రబంధముగా రచియించి ధాత్రిలో
వన్నియ కెక్క నంకిత మవశ్యముగా నొనరింపు మింపునన్

తే. సుకవికంఠీరవుఁడవు విశుద్ధమతివి
ఘనమదాఘ్రాణపండితాఖండలుఁడవు
సకలరాజన్యమాన్యవిశాలకీర్తి
శోభనుఁడ వీవె చెన్నూరి శోభనాద్రి

క. చాటువచోధాటీపరి
పాటితనవకృతివిధానభావనఘమణీ
పేటీముఖనీకెనయగు
మేటికవీశ్వరులు గలరె మేదినియందున్

ఉ. నీజనకుండు పూర్వమవనీపతి సత్సభలందుఁ బ్రౌఢిమ
భ్రాజితుఁడై బురాణకవిరాజుల సామ్యమునంది వందితా
వ్యాజనవప్రబంధములు వన్నియ కెక్కఁగఁ జెప్పెయొప్పె శ్రీ
రాజిల రామచంద్రకవి రాజితసత్కనకాభిషిక్తుఁడై॥

క. ఆరామచంద్రకవికిం
తీరవసుతుఁడవు వచఃపటిష్ఠకవిత్వ
శ్రీరంజితవిద్వన్మణి
వారుండవు శోభనాద్రివరకవిచంద్రా ॥

వ. అని యిట్లు సబహుమానంబుగా జాంబూనదాంబరాభరణపూర్వక కర్పూరతాంబూలం బొసంగిన నేనును సానందకందళితహృదయారవిందుండనగుచుఁ గృహగృహప్రవేశుండనై మంగళస్నానాలంకారపూర్వకంబుగా శుభముహూర్తంబున వాగ్దేవతార్చనంబు చేసి ప్రారబ్ధమాన మాననీయంబగు మత్కృతికన్యామణికి నాయకరత్నంబనవొప్పు గుమ్మడ పాపయ్యప్రభు వంశావతారంబభి వర్ణించెద ॥

*　　　*　　　*　　　*

క. ఆచరణజాతవర్ణం
బాచారవిశేషభాసియై త్రివిధంబై
వేఁచెలువొందును సుగుణ
శ్రీచయమున వెలమకమ్మరెడ్లను పేరన్ ॥

క. ఆ వెలమకులమునను దే
జోవిలసితుఁ డభ్యుదయవిశోభితచక్రుం
డావిర్భవించె సూర్యుఁడ
నా విశ్వాప్తుండు పద్మనాయకుఁడెలమిన్ ॥

*　　　*　　　*　　　*

క. ఆ పద్మనాయకాన్వయ
దీపకుఁడై గుమ్మడపు విదితవంశమునన్
శ్రీపతిపదాబ్జభక్తుఁడు
పాపన్న జనించె సకలభాగ్యుండగుచున్ ॥

*　　　*　　　*　　　*

తే. పుండరీకాక్షునకు రమాభూములట్లు
గుమ్మడపు పాపనప్రభు కుంజరునకు
భార్య లిరువురు గలరు సంపన్నశీల
లగుచుఁ జెన్నమ్మ వెంగమ్మ యనెడువారు ॥

*　　　*　　　*　　　*

క. సన్నుతసద్గుణుఁ డాపా
పన్నధరాధీశుఁ డగ్రభార్యామణియౌ
చెన్నమ్మయందు సంతా
నోన్నతిగని యొప్పె బుధమనోహ్లాదయుఁడగుచున్ ॥

వ. వారెవ్వరంటేని పురంధ్రీమణియగు మల్లమ్మయు వితరణరణ పాండిత్యసనాథుండగు జగన్నాథుండును బలిభక్తియుక్తయగు తిరుమలమ్మయును ॥

*                    *                    *                    *

క. ఆ జగపతి పతిరత్నం
బౌ జగ్గన్నకుఁ బ్రియాంగనాగ్రణి సుగుణ
భ్రాజిత కిచ్చమ్మయనన్
రాజిలుఁ బతిభక్తియుక్తిరమణీమణియై ॥

తే. మహితుఁడైనట్టి జగ్గయ్యమాన్యరీతి
ననఘురాలైనట్టి కిచ్చమ్మయం దపత్య
ఫలము చెందెను మువ్వుర నలఘుమతుల
సుగుణసౌభాగ్యధౌరేయశుభచరితుల ॥

వ. వారెవ్వరంటేని ॥

తే॥ సుగుణఖనియైన పాపమ్మ శుభచరితయు
భవ్యసతీరత్నమైన పాపయ్యశ్రీపుఁడు
ననఘసౌందర్యవిజితస్మరామృతాంశుఁ
డైన వేంకటరాయభూజానివరాళి ॥

*                    *                    *                    *

సీ. అంగసౌష్ఠవమున హరిసూనుఁడనవచ్చు
నతిధనుఃపాండితినట్టివాఁడు
అతిదానధుర్యత హరిసూనుఁడనవచ్చు
నతిధర్మనిర్ణీతి నట్టివాఁడు
అతిభుజాబలశక్తి హరిసూనుఁడనవచ్చు
హరిపదాంబుజభక్తి నట్టివాఁడు
అతివయస్సంపత్తి హరిసూనుఁడనవచ్చు
నతిబుద్ధివిశదత నట్టివాఁడు
నృపతిమాత్రుండె బిరుదమన్నియవిభాళ
మన్నెహంవీరకుమతిదుర్మత్తశత్రు
మన్నెవేశ్యాభుజంగుఁడై మహిని వెలయు
గుమ్మడపు పాపయప్రభుకుంజరుండు.

*                    *                    *                    *

క. ఆపాపయ్యాస హోదరుఁ
డై పొలుపువహించినట్టి యనఘుని సుగుణ
శ్రీపతి వేంకటరాయని
నాపద్మోద్భవుని కైన నలవియె పొగడన్.

*    *    *    *

క. ఆవేంకటరాయఁడు హృద
యావిర్భూతప్రమోద మతిశయమొందం
గా వింపఁగఁ బాపయ్యధ
రావరుఁ డానందమొంది రంజిల్లు ధరన్.

క. రాజన్యవతంసుం డన
రాజిలు పాపయ్యభార్య రమణీరత్నం
బీజగతినొప్పు సుగుణ
భ్రాజిత యచ్చమ్మకాంత భావలసితయై.

*    *    *    *

క. నిరతాన్నదానకలనా
పరతాతంతన్యమానభాసురకీర్తి
స్ఫురణునకుఁ బ్రజాక్షేమం
కరునకుఁ బాపయ్య రాజకందర్పునకున్.

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన శృంగారసుధాసముద్ర పూర్ణచంద్రోదయంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

*    *    *    *

ఉ. అంధుఁడు బిల్హాణుండు తనయా! తెరచాటుననుండి నీవు స
ద్గ్రంథములన్నియుం జదువఁగావలె నీతఁడు బుద్ధిధూతవా
తంథయసార్వభౌముఁడని తండ్రివిధించిన నమ్మియుంటి జా
త్యంధుఁడయేని యీతఁడు సుధాంశునిఁగాంచఁగశక్తుఁడెట్టులో.

**End :**

కందగర్భితమణిగణనికరము.—

గురుతరవితరణగుణవర
పరభూవరకరితురగజ వరదభటభయం
కరనిరువ (మ)కరకలితన
దరటద్వైరిదృఢదనురతి దరహాసలసితా.

**Colophon :**

ఇది శ్రీమదరవిందనాభపదారవిందమిళిందాయమానమానసభాగద్వాజపవిత్రగోత్ర చెన్నూరిరామచంద్రకవీంద్రపుత్రాంధ్రగీర్వాణభాషాకవితాసుమనోద్రి శోభనాద్రి ప్రణీతంబైన శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయంబను మహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు. ఈ ప్రతిలో 1b శృంగారదామము, 49b ఈ గ్రంథము, 170a వైజయంతీవిలాసము గలవు.

ఇది బిల్హణీయమనిపేరుగల సంస్కృతగ్రంథము ననుసరించి చేయఁబడిన నాల్గాశ్వాసముల శృంగారప్రబంధము. చోరపంచాశిక (పూర్వపంచాశత్తు, ఉత్తరపంచాశత్తు అని రెండు గలవు) లిందు తెల్పింపఁబడినవి. మదనాభిరాముఁడను రాజకూఁతురు యామినీపూర్ణతిలకకు బిల్హణుఁడను కవీశ్వరుఁడు తొలుతగురుఁడు, తరువాత వరుఁడు నైనకథ యిందు వర్ణితము. ఆర్. నె 158(b) రు వర్ణితమగుగ్రంథము వేఱు, ఇది వేఱు. చెన్నూరి శోభనాద్రికవి దీనికి కర్త. ఈతని తండ్రి రామచంద్రకవి. గుళ్లపాడు పురాధీశ్వరుఁడును, పద్మనాయకకులుఁడును, మారుట్ల గోత్రుఁడును, జగ్గన్నప్రభుని పుత్త్రుఁడునునగు పాపయ్యప్రభుని ప్రేరణమున నీకవి తదంకితముగా నీప్రబంధమును రచించెను. పాపయ్యప్రభుని వంశవృత్తాంత ముదాహృతపద్యములఁబట్టి కనుఁగొననగును.

---

## No. 849 శృంగారసుధాసముద్రపూర్ణచంద్రోదయము.

## ŚRṄGĀRASUDHĀSAMUDRAPŪRNACANDRŌDAYAMU.

Substance, paper. Size, 12 × 9½ inches. Pages, 73. Lines, 20 on a page. Character, Telugu. Condition, good. Appearance, new Mode of writing, good but full of mistakes.

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

## No 850. శ్రీకృష్ణలీలావిలాసము.

## ŚRĪKRSṆALĪLĀVILĀSAMU

Substance, palm-leaf. Size, 16 × 1½ inches Pages, 64. Lines, 7 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, good, but not free from mistakes.

Incomplete.

Same work as that described under R. No. 456(*a*) of the Triennial Catalogue of Telugu Mss, Vol. III, and under No 469 *ante* : By Kumārācyutarāmarāju

(వి-వి.)——

అసమగ్రము. ప్రథమాశ్వాసము లేదు. వ్రాంత మంచిది. తప్పు లున్నవి శైథిల్యముగలదు. గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 456(*a*), డి. 469 రు వర్ణితమైనదే.

---

## No. 851. షట్చక్రవర్తిచరిత్ర.

## ṢAṬCAKRAVARTICARITRA

Substance, paper. Size, 11¾ × 8½ inches. Pages, 220. Lines, 23 on a page. Condition, fair. Appearance, old. Mode of writing, very good but not free from mistakes.

Wants the beginning and the Ms is not perfect.

A Prabandha in six Āśvāsas narrating the story of six emperors, who ruled in India in ancient times, i.e., Nala, Hariścandra, Purukutsa, Purūravas, Sagara and Kārtavīryārjuna. The author Rāmacandrakavi was the son of Kōdandarāmakavi. As the Ms. wants the introductory portion, it is not possible to give further details about the author.

**Beginning:**

వ. . . డువై కుండినపురమార్గంబునఁ జనుచున్న సమయంబున.——

తే. వినుము ఆదిత్యగణములో విష్ణుఁబోలి
నరసనక్షత్రగణములోఁ జంద్రుబోలి
సకలరాజులలో నలచక్రవర్తిఁ
జనఁగఁగాంచిరి దిక్పాలసమితియపుడు.

* * * *

శా. శ్రీవిద్యాలలితాభిధానములచేఁ జెన్నొందు కాంతామణీ
భావాంభోజము సంతసింపఁగ హరిబ్రహ్మేశ్వరాకారముల్
తీవిం దాలిచి విష్ణవే విఫలసృష్టిప్రాభవాయాశివా
దేవీశాయ యటన్న భక్తులఁ గృపం దేల్చే విభుంగొల్చెదన్.

వ. అనుటయు నమ్మహాత్ములకు హర్షోత్కర్షతరంగితాంతరంగుం డగుచు హరికథాసుధాస్వాదనామోదవిధేయుండగు శుకయోగీంద్రుండు పరీక్షిన్మహారాజేంద్రునకుం జెప్పినట్లు పరమహర్షులైన ఋషులకుఁ జతురవాక్యవిశారదవిఖ్యాతుండగు సూతుండిట్లనియె.

**End** :

తే. అతులితంబైన కార్తవీర్యార్జునాఖ్య
చరితమెవ్వరు సద్భక్తిఁ జదువ వ్రాయ
వినఁగఁ గోరినవారికి వివిధచోర
బాధలెల్లను బాయును బరముగల్గు.

**Colophon:**

As there is no colophon at the end of the last canto, the following is given from the end of the story of "Nala."

గద్య. ఇది శ్రీమన్నారాయణకరుణాకటాక్షలబ్ధ కవితావిచిత్ర కాశ్యపసగోత్ర పవిత్ర భగవత్కథాసుధానుభవవైభవానఘ(?) కోదండ రామ తనూభవ సకలసుకవిజనవిధేయ రామచంద్రనామధేయ ప్రణీతంబైన షట్చక్రవర్తి చరిత్రంబను మహాప్రబంధంబునందు నలోపాఖ్యానము సంపూర్ణము.

(వి-వి.)—

అసమగ్రము. నల, పురుకుత్స, పురూరవ, (సగర) భగీరథ, కార్తవీర్యార్జునుల చరిత్రములు మాత్రమిందుఁగలవు. నలచరిత్రముగూడ సగమునుండియేకలదు. కడపటిముగ్గురు చక్రవర్తుల చరిత్రల యంతమందును, ఆశ్వాసాంత పద్యాదులు లేవు. చిన్నచిన్న గ్రంథపాతములనేకముగాఁ బుస్తకమెల్ల నక్కడక్కడఁగలవు. వ్రాఁత మిక్కిలి చక్కఁగా నున్నదిగాని నిర్దుష్టము గాదు.

షట్చక్రవర్తులని ప్రసిద్ధినొందిన హరిశ్చంద్ర, నల, పురుకుత్స, పురూరవ, సగర, కార్తవీర్యార్జునుల చరిత్రమిం దాఱాశ్వాసములలో వరుసగా వర్ణింపఁబడియున్నది. గ్రంథకర్తయగు రామచంద్రకవి కోదండరాముని పుత్రుఁడు; అవతారికాదులు లేమిచే నితనినిగుఱించి మఱియేమియుఁ దెలియదు.

ఆర్. నె 51 రున వర్ణితమైన గ్రంథము వేఱు, ఇది వేఱు.

114*a* సారంగధరనాటకము, 136*a* నలనాటకము, 187 వ్యవసాయక్రమము, 194 నెల్లూరి కలెక్టరుకు అమీను వ్రాసికొన్న అర్జి, 200*a* కృష్ణవేషకథ, 222*a* కాళింగ మర్దనము, 234*a* గొల్లవేషకథ, 256*a* అదే వేఱు రచన, 263 సముద్రమథనము, 270*b* దాదినీవేషకథ, 274 ఏగంటివారి వచనాలు, 369*a* ఏగంటివారి వచనాలు, గలవు.

---

No. **852.** చట్చక్రవర్తిచరిత్ర.

ṢAṬCAKRAVARTICARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 352. Lines, 6 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Incomplete and imperfect.

Same work as that described under R. No. 51 of the Tril. Cat. of Telugu Mss., Vol. I, which copy is a transcript of this Ms.

నల, పురుకుత్స, పురూరవ, (సగర) భగీరథ, కార్తవీర్యార్జునుల చరిత్రములు మాత్ర మిందుగలవు. ఇందు నలచరిత్రయందలి యంత్యభాగము మాత్రమే గలదు. కడపటి ముగ్గురు చక్రవర్తుల చరిత్రలయంతమందును ఆశ్వాసాంత గద్యపద్యాదికములు కొఱగానున్నవి. గ్రంథపాతములు నక్కడక్కడఁ గలవు. వ్రాఁత చక్కఁగానున్నది గాని నిర్దుష్టము గాదు.

ఇది ఆర్. నె 51 రున వర్ణించిన గ్రంథమగుటయేగాక దానికి మాతృకగాఁగూడనున్నది.

---

No. **853.** షట్చక్రవర్తిచరిత్ర.

ṢAṬCAKRAVARTICARITRA.

Substance, palm-leaf. Size, $16\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches. Pages, 317. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured and many leaves are eaten by worms. Appearance, very old. Mode of writing, good but not free from mistakes

Complete, but wants the introductory portion.

Same work as that described under R No. 51 of the Triennial Catalogue of Telugu Mss., Vol. I. The author Mallāreddi, son of Kācabhūpāla of Rācullagōtra, has dedicated this work to God Siddharāmēśvara worshipped at Bikkanavol in the Godavari district.

Date of transcription—Friday, the second day of the bright fortnight of the lunar month Bhādrapada in the year Āngīrasa Name of the scribe—Kallūri Cinajaggarāju.

The author Mallāreḍdi has also composed a Purāṇic work called Śivadharmōttarakhaṇda in eight chapters. In the preface of this work it is stated that Mallāreddi had two brothers called Kāmāreddi and Ellāreḍḍi and both of them were honoured by Akbar, the Emperor of Delhi Paṭṭameṭta Sōmanāthakavi has dedicated his work Sūtasamhitā to Kāmāreddi referred to above

(వి-వి.)—

అవతరణిక తక్కఁ దక్కిన గ్రంథమెల్లఁగలదు. వ్రాఁత తిన్ననిదే. తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు కొలఁదిగాఁగలవు.

ఇది ఆర్. నెం 51 రున వర్ణితమైనదే.

గ్రంథాంతమున నిట్లుగలదు :—

"మోదుకూరి కేశవస్వామీ నీవేదిక్కు. ఆంగీరసనామసంవత్సర భాద్రపద శు ౨ శు సరికి కాల్లూరి చిన జగ్గరాజు వ్రాశిన షట్చక్రవర్తి చరిత్ర సంపూర్ణంగా వ్రాసెను."

---

## No. 854. షట్చక్రవర్తిచరిత్ర.

## ṢAṬCAKRAVARTICARITRA.

Substance, paper. Size, $11\frac{5}{8} \times 8\frac{3}{4}$ inches. Pages, 20 Lines, 20 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Begins on fol. 88*a*. The other works herein are Acalātmajāpariṇayamu 1*a*, and Madhuravāṇīvilāsamu 26*a* Fragmentary.

Same work as that described under R. No. 51 of the Triennial Catalogue of Telugu Mss., Vol. I

Contains the first 107 stanzas relating to the story of Nala.

(వి-వి.)—

నలచక్రవర్తి చరిత్రారంభమందలి యించుమించు 107 పద్యగద్యములుమాత్ర మిందుఁ గలవు గాని యందుఁగూడ గ్రంథపాతము లక్కడక్కడనున్నవి. వ్రాఁత యొక తరబడిగా బాగుగానున్నదిగాని నిర్దుష్టముగాదు.

1*a* అచలాత్మజాపరిణయము, 26*a* మధురవాణీవిలాసము, అను నితర గ్రంథములిందుఁ గలవు.

పూర్వము నోటె.

---

No. 855. సకలకథాసారసంగ్రహము.

SAKALAKATHĀSĀRASAṄGRAHAMU.

Substance, paper. Size, 12 × 8¼ inches. Pages, 534. Lines, 20 on a page Character, Telugu. Condition, fair Appearance, old. Mode of writing, good but not free from mistakes. Good

Contains the Āśvāsas 1—8 complete and 599 stanzas in the 9th Āśvāsa.

A Prabandha in Telugu narrating the purānic stories relating to Nala, Hariścandra, Purukutsa, Purūravas, Sagara, Kārtavīrya (the six emperors) and other kings. The author Puttēṭi Rāmabhadrakavi of Kauṇḍinyagōtra and Āpastambasūtra wrote this work at the instance of Śrī-Krsṇadēvarāya of the Karnāṭaka country and dedicated it to Lord Śrī-Kṛsna.

The following note of Mr. C P. Brown appears at the beginning of the Ms :—

" This is transcribed for me from a Ms in the Mackenzie library at the College, Madras—the original is on country paper and is much injured by worms."

Sd. C. P. Brown,
Oct 1840.

" This is an illiterate poem of no merit-whatever parts are superior are stolen from better authors."

July 1843.

**Beginning :**

శా. శ్రీలీలావతియైన రుక్మిణియు రాజీవాస్యయైనట్టి స
త్యాలోలాక్షియు నిర్వ రేప్పుడతివేలాసక్తి నిర్వంకలన్
హాళి న్నిల్వఁదటిద్ద్వయీలలితనీలాభ్రాకృతిం బొల్చు గో
పాలస్వామి దయాసుధారసము నాపైఁజిలుకన్ నెల్లప్పుడున్.

* * * *

సీ. . . . . . . . . .

ఐనహనుమంతుఁడతిదాంతుఁ డతులమ్ప్రదుర
సాతిశయసుకవిత్వ మహత్త్వమొసఁగి

ఖ్యాతిగా నన్నటాక్షించి కరుణతోడ
గ్రంథమును సాంగ మొనరించుc గవులు నెన్న.

*            *            *            *

తే. సోమనిభుcడగు తిక్కనసోమయాజి
నిత్యసత్కీర్తిc బోతనామాత్యసుకవిc
బట్టుభద్రుcడౌ నన్నయ భట్టుc గాంతి
భాస్కరుని భాస్కరుని వేడ్కc బ్రస్తుతింతు.

*            *            *            *

వ. అని . . . పురాతనచక్రవర్తిప్రముఖపుణ్య పురుషకథా సంబంధబంధురంబగు నొక్క ప్రబంధంబు రచియింపంబూనియున్న సమయంబున.

సీ. . . . . . . . .
గాడుపూరినిగాంచిన కన్నతల్లి
తల్లిబిడ్డలcబెండ్లాడు గొల్లమనికి
మనికితమదీర్పు విలుకానిజనకువిందు
విందునీకీర్తి నరసింహవిభుని కృష్ణ.

వ. ఇట్లు కీర్తివిస్తారధురంధరుండగు కృష్ణరాయనరపాలాఖండలుండు నన్నుcబిలిచి శ్రీమత్సీతారమణచరణకమల పరిచరణాయమాన మానసుండవు బహువిధకవితా చమత్కారధుర్యుండవు సకలపురాణేతిహాస ప్రబంధరచనాధ్యక్షుండవు. మన్మనోరథకార్యనిర్వాహకుండవగుటం జేసి పురాతనమహాకవివిరచిత ప్రబంధంబు లన్వేషించి భగవద్భక్తినిష్ఠాగరిష్ఠులగు రాజశ్రేష్ఠులవృత్తంబులు ప్రసిద్ధంబులగునట్టుగాc బ్రశస్తకథలు విన్యస్తంబుగా యెలుకూచి సాహిత్యలక్షణచిత్రకవిత్వప్రభావంబు లోకోత్కర్ష చోటం గనుపడ రచియింపవలయునని ప్రార్థించి మఱియు నిట్లనియె.

*            *            *            *

వ. . . . అతిమధురరసాయనద్రాక్షాపాకంబుగా శృంగార రసయుక్తంబగునట్లు సకలకథాసారసంగ్రహంబు గ్రంథవిస్తారంబుగాకుండునట్లుగా రచియింపుమని యుపన్యసించిన సంతోషితస్వాంతతరంగితాంతరంగుండనగుచు నున్న సమయంబున.

*            *            *            *

సీ. . . . . . . . .

కనకవస్త్రంబుగల మృదుతనువువాఁడు
ఘర్మనూపురయుతపదాబ్జములవాఁడు
మించివేదాంతముల సంచరించువాఁడు
ప్రౌఢిశ్రీకృష్ణుఁడను పేరఁ బరగువాఁడు.

వ. మదీయభాగ్యవశంబున స్వప్నకాలంబునఁ బ్రసన్నుండై పరమ మంత్రోపదేశపూర్వకంబుగా సకలకథాసారసంగ్రహంబునకుఁ గృతినాయకునిఁ దన్నుం గావింపుమని హితోపదేశంబుచేసి యంతర్హితుండైన నే నంతట మేలుకాంచి . . కన్నడమహీమండలాఖండలుండును బ్రచండపరాక్రమపరరాజశుండాలకంఠీరవుండును నగు నగకంఠీరవరాయసూతిప్రేరిత సకలకథాసారసంగ్రహనామక ప్రబంధంబు రచియింపంజాలుటకు నిప్పుడగదా సమర్థుండనైతినని . . . స్వప్నవృత్తాంతంబంతయు నమ్మహీకాంతునకు నెఱింగించినఁ గుతూహలియగుచు నారాజముఖ్యుం డిట్లనియె.

ఉ. నీవును బాలకృష్ణపదనీరజభక్తుఁడ వార్యచిత్త మో
దావహసద్గుణుండవు రమాధిపునింగలలోనఁగాంచియు
ద్దేవుహితోపదేశమునఁ దేజమునొందినవాఁడ విన్నిటన్
గావున నీప్రబంధము ప్రకాశముగా హరికిమ్ము నావుడున్.

* * * *

క. ఏవంవిధగుణతతికిని
దేవాచలనిభధృతికి నతిదయామతికిన్
సేవితచాగధిపతికిని
భూవినుతోన్నతికి భోజపుత్రీపతికిన్.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సకలకథాసారసంగ్రహంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End:**

చ. కడువచియింపరాని ఘనకష్టము లెల్లను గృష్ణుసత్కృపన్
గడచితి మింకమీఁదను ఘనస్ఫుటరాజ్యరమాభివృద్ధి చొ
ప్పడు నని మీరుగోరుటలు బాపురె వ్యర్థములాయె నింక నే
నుడువఁగనేల మృత్యువెడ నూలొఱని కానఁగవచ్చుచోటులన్.

చ. . . . . . . . . . . . .

As the 9th canto is incomplete, the following colophon is taken from the end of canto 8.—

గద్య. ఇది శ్రీమద్రామభద్ర భద్రప్రసాదలబ్ధ కవిత్వవిశారదశారద సతతవిమిత్ర యాపస్తంబసూత్రపాత్ర కాశ్యపసగోత్రపవిత్ర రామభద్రాది (ద్రధీ?)మద్రాభద్ర రామభద్ర ప్రణీతంబైన సకలకథాసార సంగ్రహంబునందు . . . . అష్టమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. తొలినుండి నవమాశ్వాసమున 599 వ పద్యము వఱకుఁగలదు. వ్రాఁత చక్కనిది. దోషములు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది కర్ణాటాధీశ్వరుఁడగు శ్రీకృష్ణదేవరాయని ప్రేరణమున, షట్చక్రవర్తులు మొదలగు పురాణపురుషుల కథలఁ గూర్చి రచియింపఁబడిన గొప్పప్రబంధము. తొమ్మిదవయాశ్వాసముతో ముగియునో మఱికొన్ని యాశ్వాసము లింకను గలవో తెలియదు. దీనికిఁ గర్త ఆపస్తంబసూత్రుఁడు, కౌండిన్యగోత్రుఁడు నగు రామభద్రకవి. రామాభ్యుదయ కర్త యితఁడేయగును. వీరి యింటిపేరు పుత్తేటివారని లక్షణగ్రంథము లందుఁగలదు.

1840 వ సం॥ అక్టోబరు నెల ప్రాంతములందు బ్రౌను దొరగారు మెకంజీ లైబ్రరీనుండి దీని వ్రాయించిరట ! ఇది పనికిమాలిన గ్రంథమని వారు దలచిరి.

---

## No 856. సకలకథాసారసంగ్రహము.

## SAKALAKATHĀSĀRASAṄGRAHAMU.

Substance, paper Size, $12\frac{1}{8} \times 8\frac{7}{8}$ inches Pages, 591. Lines, 16 on a page Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

The first volume contains the first four Āśvāsas and the second volume contains the Āśvāsas five to eight complete and the ninth Āśvāsa incomplete.

Same work as the above which was transcribed from this Ms.

(వి-వి.)—

అసమగ్రము. ఇది రెండు సంపుటములుగా నున్నది. మొదటి సంపుటమున నాల్గాశ్వాసములును, రెండవ సంపుటమున తర్వాతి వైదా

శ్వాసములును గలవు. రెండవ సంపుటమున నవమాశ్వాసము మాత్ర
ము సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లెక్కువ.

ఇది నె 855 రు ప్రతి మాతృక.

పూర్వమువలె.

---

## No. 857. సకలనీతికథానిధానము.

## SAKALANĪTIKATHĀNIDHĀNAMU.

Substance, paper. Size, 12¾ × 8 inches. Pages, 191. Lines, 20 in a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes.

Breaks off in the fourth Āśvāsa

A Prabandha in five Āśvāsas narrating the stories of the kings who ruled in the Kaliyuga. The author Erraya, was the son of Kūcanāmātya of Śrīvatsagōtra It is stated that the author also wrote Kokkōkam and Purāṇasāramu This work has been dedicated to Tirumala Vēnkaṭēśvarasvāmin and was written at the instance of Kuṇṭamukkula Pinabhairavamantri, chieftain of Koṇḍapalli and son of Sanganāmātya younger brother of Mallamantri The dedicatee of Kokkōkamu was the paternal uncle of this Pinabhairavamantri. For other particulars see the extracts given below

**Beginning:**

ఉ. శ్రీలలనాధినాథుఁ డతసీకుసుమాంచితమూర్తి యష్టది
క్పాలకిరీటరత్నరుచిభాసిపదాబ్జుఁడు మిత్రసర్వభూ
పాలునిఁ గుంటముక్కలనటభైరవపాత్రుని నేలు సత్కృపా
లోలుఁడు వేంకటేశ్వరుఁడు లోకములెప్పుడుఁ బ్రోచుగావుతన్.

* * * *

చ. వినుతియొనర్తు నాంధ్రసుకవీంద్రుల నన్నయభట్టుఁదిక్కయ
జ్వను నమరేశ్వరుం జెదలువాడ మహాత్ముని మాక(ర?)నార్యునా
[భౌమునిన్
చనసుతుసోమభాస్కరుని జెన్నయునిం (జక్కయనుం) గవిసార్వ
వనరుహపుత్రసన్నిభుల వర్ణితకావ్యకళావిధిజ్ఞులన్.

* * * *

వ. అని . . యొక్క విచిత్రకథాప్రబంధంబు విరచింపఁ
దలఁచి తన్మాతృకార్చనాపరాయణుండనై యున్న సమయంబున.

సీ. ప్రభవించె నేపీటి పర్వతాగ్రంబున
నరిగిరీశ్వరుఁడు శ్రీనాయకుండు
వసియించె నేపీటి వర్ణితసాలాంత
రమున మూలస్థాన రాజమౌళి
యుదయించె నేపీటి యుత్తరాశాతటి
భూషణీకృతనింబ పుట్టలమ్మ
పరియించె నేపీటి వలదిశాకోణంబు
నందు గుబ్బటలపై లారమూర్తి
వినుతిగాంచిరి యేపీట విప్రరాజ
వైశ్యశూద్రాది బహువిధవర్ణసమితి
యట్టిపురరత్న మొప్పు భవ్యా(ంబు)జాత
మండితామరతమ(రు)వల్లి కొండపల్లి.

క. ఇటువంటి కొండపల్లీ
పుటభేదనమంత్రిమకుట భూషణమరిచ(రా)
కట-(టక-)టకవిభేదనఘటనో
ద్భటుఁడగు కుంటుముక్కలపిన్న భైరవుఁడొప్పున్.

క. వనితాజన కందర్పుఁడు
ఘనదానఘనాఘనంబు కమనీయవిభా
దినకరుఁడు కుంటుముక్కల
పినభైరయ(వ)మల్లమంత్రి పృథుతరకీర్తిన్.

క. గురుశేఖరప్రభావుఁడు
తిరుమలయాచార్యుఁ డాత్మదేశికుఁ డన సు
స్థిరకీర్తి సత్తసంతతి
వరుఁడగు చినభైరవుండు ప్రతిదివసమునన్.

*　　　*　　　*　　　*

క. ఏనును దన్మంత్రీశ్వరు
సానతి నాస్థానమునకు నరిగి మనోజ్ఞా
సీనుఁడనై యున్నను బహు
మానముతోఁ జూచి మంత్రిమణి యిట్లనియెన్.

సీ. శ్రీవత్సగోత్రవారిధిపూర్ణశీతాంశుఁ
డగు మాచిమంత్రికి నాత్మజుఁడవు

వివిధాష్టభాషాకవిత్వ వాచాప్రౌఢిఁ
 బూర్వకవీంద్రులఁ బోలినాఁడ
వఖిలపురాణేతిహాసకావ్యస్మృతి
 చయము రచించిన చారుమతివి
మాపినతండ్రైన మల్లమంత్రికిని గా
 కోర్కెకంబు చెప్పిన కోవిదుఁడవు
రసికులభినుతిసేయఁ బురాణసార
మనుపమంబుగ నాకిచ్చినట్టిప్రౌఢ
వట్లుగావున నొకటి విన్నవుఁగఁ దలఁచి
యిచ్చుటికిఁ బిల్వఁ బంచితి నెట్టినార్య.

క. భావమునఁ దోఁచెఁ గలియుగ
పావనభూపాలకథలు బంధురకావ్య
శ్రీవెలయ నాంధ్రభాషను
గావింపఁగవలయు సుప్రకాశత నాకున్.

* * * *

వ. అని కర్పూరతాంబూల కనకాభరణాంబరాదు లొసంగి యుని
పిన . . .

* * * *

క. పాపవినాశనతీర్థ
వ్యాపారనిదర్శితాఘ వారణలీలా
టోపఘనగండశైల
స్థాపితవేంకటగిరీంద్ర సదనస్థితికిన్.

* * * *

వ. దండప్రణామంబులు సమర్పించి యేను రచింపంబూనిన సకల
నీతికథానిధానంబునకు నుపక్రమం బెట్టిదనిన.

* * * *

వ-మ. శ్రీమహితరూపపదసేవితసురేంద్రా
క్షేమకరతల్పగత శేషగతశోభా
భామహిత గంగవిభు భైరవసుధీహృ
ద్ధామతిరువేంకటనిధానజగదీశా.

* * * *

క. శ్రీకలితకుంటముక్కుల
శ్రీకరపినబయ్యమంత్రి శేఖరహృదయ
త్స్రాకల్పకభూరుహా యు
ర్వీకమలాహృదయనాథ వేంకటనాథా.

(At the beginning of canto II)

For the extract from the end of the work and for the colophon see under the next No. 858

(వి-వి.)—

అసమగ్రమము. ఆదినుండి చతుర్థాశ్వాసమున కొంతదాఁకఁ గలదు. దీనితర్వాతి నెం 859 రు ప్రతి దీనిమాతృక నెం 858 రు ప్రతిలో దీనితర్వాతిభాగము గలదు. దీనిమాతృకలో నేర్పడిన గ్రంథపాతము లిందు మిక్కిలి హెచ్చుగాఁజేరినవి. వ్రాఁత చక్కనిది. శైథిల్య మించుక గలదు.

ఇది యైదాశ్వాసముల హృద్యప్రబంధము. ఇందు కలియుగపు రాజుల చరిత్రములు గొన్ని వర్ణింపఁబడినవి. విక్రమార్కుని కథలు ప్రధానముగాఁగలవు. బేతాళకథలున్నవి. అనుప్రసక్తములుగా చిన్నచిన్న నీతికథ లనేకము లున్నవి. అనేక నీతిశ్లోకముల కిందుఁ దెలుఁగుసేఁత గలదు. శ్రీవత్సగోత్రుఁడును సూచనామాత్యుని పుత్రుఁడును నగు నెల్లయ దీనికిఁ గర్త. ఈతఁడే కొక్కోకపండితకృతమగు రతిరహస్యమును దెలిఁగించెను పురాణసారమని వేఱొకకృతినిగూడ నీతఁడు రచించెనట! అది గానరాదు. ఈకృతి గంగనామాత్యుని కొమారుఁడును, కొండపల్లి ప్రభువునునగు కుంటముక్కల పినభైరవమంత్రి ప్రేరణమున నాతని యిష్టదైవమగు తిరుమలవేంకటేశ్వరస్వామి కంకితము సేయఁబడినది. కొక్కోకమును గృతిగొన్న మల్లమంత్రి యీ భైరవమంత్రికిఁ బిన్నతండ్రి. ఈ కృతిప్రేరకునకు 'పాత్రుఁడు' అని బిరుదు గలదు. ఓఢ్రరాజులపాలనము నది తెలుపుచున్నది. విశేషముల కుదాహృతపద్యములఁ జూచునది.

---

No. **858.** సకలనీతికథానిధానము.

SAKALANĪTIKATHĀNIDHĀNAMU.

Substance, paper. Size, $13\frac{1}{2} \times 8\frac{3}{8}$ inches. Pages, 48. Lines, 25 on a page. Character, Telugu. Condition, good. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as the above

For the beginning see under the previous number.

**End :**

వ. అంతనుజ్జైనిపురవరాధీశ్వరుండు తనకూఁతురగు శశిప్రభయను దానిఁదెచ్చి మృగాంకదత్తునకు వివాహంబొనరించెనని ఋషీశ్వరుండు కథచెప్పి యన్నరవాహనదత్తునకుఁ దనమంత్రసామర్థ్యంబున వియచ్చరుండెత్తుకొనిపోయిన మదనమంజరికం దెచ్చియిచ్చినఁ దనపురంబునకరిగి సుఖంబుండెనని వజ్రప్రభుండను విద్యాధరుండు వత్సేశ్వరునకుఁ జెప్పి సుఖంబుండెనని బలీంద్రునకు నారదుం డెఱింగించుటయును.

ఉ. గంధకరీంద్రశిక్షణ . . ఖండమహోజ్జ్వలపింఛమాలికా
బంధురకుంటముక్ల పినభైరవపాత్రమనోజ్ఞనీజగ
ద్బాంధవతొండమాభిధనృపాలక సన్నుతిపాత్ర పాత్రసా
గంధికవెంకటాద్రి మణికందరశాశ్వతనీలకంధరా.

క. భిల్లస్త్రీమందస్మిత
గల్లస్థలరచితమకరికామృదువల్లీ
వేల్లితకపోలమహితల
వల్లభపినభైరవేంద్ర వరహృదయేశా.

* * * *

**Colophon :**

గద్య. ఇది యష్టభాషాకవితాప్రవీణ నవఘంటసురత్రాణ కూచనామాత్యపుత్ర సుకవిమిత్ర వినయవిద్యావిధేయ యెఱ్ఱయనామధేయప్రణీతంబైన సకలనీతికథానిధానంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. చతుర్థాశ్వాసము నడుమనుండి కడముట్టఁ గలదు. వ్రాఁత తిన్ననిది. తప్పులు లేవు. శైథిల్యము లేదుగాని గ్రంథపాతము లెక్కువగాఁగలవు. అవి దీని మాతృకలోనివి.

---

## No. 859. సకలనీతికథానిధానము.

### SAKALANĪTIKATHĀNIDHĀNAMU.

Substance, palm-leaf. Size, $9\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches. Pages, 553. Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Complete but breaks off in many places.

Same as the above.

Date of transcription :—The 14th day of the dark fortnight of the lunar month Śrāvana in the year Rudhirōdgārin. Name of the scribe -- Indupalli Bhavānīśaṅkara who copied from a Ms of Basavarāju.

(తె-తె.)—

సమగ్రమే. కాని గ్రంథపాతములు పెక్కు లున్నవి. పెక్కు పత్రములు చినిఁగిపోయినవి. కొన్ని గానరావు. వ్రాఁత మంచిదే కాని తప్పులున్నవి.

ఇది పూర్వవర్ణితమగు పుస్తకమునకు మాతృక. గ్రంథాంతమందిట్లు గలదు.

“ రుధిరోద్గారి నామసంవత్సర శ్రావణ బ ౧౪ శ॥ సరికి సకల నీతికథానిధానం దినవహిబసవరాజుగారి ప్రతినున్న క్రమానను సంపూర్ణముగాను యిాందులపల్లి భవాని శంకరుడు వ్రాశెను.”

---

## No. 860. సత్యభామాసాంత్వనము.
## SATYABHĀMĀSĀNTVANAMU.

Substance, paper. Size, 9½ × 7½ inches. Pages, 285. Lines, 15 in a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Complete in four Āśvāsas.

A rare poem describing the amours of Lord Krsna and Satyabhāma. The author Kāmēśvara Kavi *alias* Tirukāmakavi was the son of Kāmākṣi and Nāganakavi of Vēnganāmātya family. The author flourished in the court of Mūḍalagiri Nāyaka, of Madura in 1650 A.D The author Kāmēśvarakavi was a great musician and wrote also several other works.

**Beginning :**

క. తొలుత నెయ విఘ్నమ స్తని
పలుకక హరిహరులకైన బ్రహ్మకునైనన్
దలఁపొనగూడదు గావున
నలినోద్భవువిఘ్ననాథు నామదిఁదలఁతున్.

ఉ. శ్రీమహికన్యయాత్మకర చిన్మయముద్రికఁజూచె(చి?) దేమినా
నీ మొనగుబ్బ లేనలము నీటిది మానఁగలేనటంచుఁ దా

నామెయిదెచ్చి కల్మిబినతాళికొసంగుడునంట చెల్వుశ్రీ
రాముఁడు ముద్దుళఘురిధారారమణుం గరుణించుఁగావుతన్.

* * * *

మ. మునుగర్వంబున నాంధ్రభారతమహాంభోరాశి నన్యుల్ కవుల్
మునుగం దామ సముద్ధరించు వగ నింపు ల్మింపు సందర్భముల్
దనరంగా నొక రెండు తేపలఁ బ్రబంధశ్రేణి నిర్మించు న
న్ననవెట్టార్యునిఁ దిక్కనాధ్వరిని హృద్యస్ఫూర్తిఁ గీర్తించెదన్.

* * * *

వ. అని . . . యేనభంగుర శృంగారరస తరంగిత వచన రచనానుబంధంబగు నొక్క ప్రబంధంబు నిర్మించ నెంచియున్న సమయంబున.

క. లక్షణ లక్షిత కమలా
వీక్షణ పుంఖానుపుంఖ విభవోన్మేషా
నుక్షణ తతవిశ్రుతియై
దక్షిణమధురాపురంబు తనరు ధరిత్రిన్.

శా. ఆ పీటన్ . . . . . . . . .

మ. జనులంజల్లని శూపులందనుపుచున్ శంపాలతాంగుల్ నయం
బున వేవేల్ తనచెంతఁజేరి యుడిగంబు ల్సేయనంతంతకున్
ఘనతన్ దిక్కులరాజు లెల్లఁబొగడన్ గర్ణాటరాజ్యేందిరన్
గనుసన్నన్ వరియించె ముద్దళఘురిక్ష్మాజాని రంజిల్లుచున్.

ఉ. అంతిపురంబునందగు సహస్రనిజాకృతి భావచిత్రలీ
లాంతరకైతవంబున మృగాక్షులకందఱ కన్ని రూపులై
యెంతయు ముద్దుళఘురి సర్వేశ్వరుఁడేలుఁ బదారువేలసీ
మంతినుల న్నిరంతరము మన్ననసేయుమురారి కైవడిన్.

* * * *

సీ. ఏవేళ నడిగిన హేరాళముగనిచ్చు
నేపాటి కవినైన నెలమిమెచ్చు
గుణమింత గలిగిన గణుతించిజను నేలుఁ
దప్పులన్నియుఁదాళి తలఁచుమేలు

నాయంబు గూర్చుచో నాయంబు పచరించు
నాశ్రితావళిఁ జాల నాదరించు
నిరసించు నెట్టి భూవరునైన ననిఁ జెండు
సాధుగోష్ఠిని బ్రొద్దుజరపుచుండు
నిలనుగావునఁ జక్రవర్తులునురాజు
లార్థురు పదార్థురును గాని యన్యు లెనయె
యనఁగ సుగుణసమష్టిచే నతిశయిల్లు
సరససులభుండు ముద్దులళ్ఘురి విభుండు.

*　　　*　　　*　　　*

వ. వెండియు . . . . . . . . పంచ తిరువళి రాజ సప్తాంగ హారణుండును, . . . నారుహాన్నిబ్బర గండుండును, . . . . . కుంతూరిదుర్గనాయకుండును, . . . . దక్షిణసింహాసనాధ్యక్షుండును, తిరుమలనృపాలకలశాంభోధి పూర్ణిమాశశాంకుండును, ధరణీవరాహాంకుండును, కళ్యాణపరంపరోదార కుమారముద్దు వీరనృపకల్పతరు తపఃఫలంబును, కమనీయగుణతరంగలింగాంబికా శుక్తిముక్తాఫలంబును . . . అగుముద్దళఘురి భూపాలుండు నీరజబాంధవుం డుదయింప నొకనాఁడు . . . . .

మ. హితులున్ రాజుల మాత్యు లూడిగములున్ హేజీబు లార్యుల్ పురో
హితులున్ జ్యోతిషికుల్ నటుల్ భటులుసాహిత్యప్రవీణుల్ కవుల్
మతిమంతుల్ బయకాండ్లు పారకజనుల్ మాన్యులు వజ్రీలు నూ
ర్జితభక్తిన్ గొలువన్ మహావిభవముల్ చెల్వొందనందంబుగాన్.

*　　　*　　　*　　　*

శా. ఆరీతిన్ సభముద్దులళ్ఘురి ధరాధ్యక్షుండు గొల్వుండితా
హేరాళంబుగ నయ్యెడ న్నడచుసాహిత్య ప్రసంగంబు గం
భీరప్రౌఢిమమించునన్ బిలిచి నెమ్మింబల్కె వీణాకన
ద్గౌరీపాణి సువర్ణకంకణ ఝుణత్కారానుబంధోక్తులన్.

చ. అనువుగ రుక్మిణీపరిణయంబును మున్ వావణించియార్యు లౌ
ననఁ దనియించినావు మము నప్రతిమంబుగ నవ్యకావ్య మిం
పునరచియించుమీ సొగసుపో డిమిమీఱఁగ సత్యభామసాం
త్వనమనఁ గప్పురంపు జలువం గెలువందిరుకామసతకవీ.

*　　　*　　　*　　　*

వ. అనిన విని తదాజ్ఞానుమతి నే నంగీకరించిన నతండు సబహుమా నంబుగాఁ గర్పూరతాంబూల కనకచేలకమనీయ రత్నాభరణ స్తోమ గ్రామ ప్రదానంబుల నానందంబు డెందంబునఁ గ్రందుకొన నొనరించిన.

* * * *

వ. . . . . . తదీయవంశావతారం బభివర్ణించెద.

సీ. . . . . . . . . .
రహిఁ జెలఁగుసారరు చిపూరరత్నహార
సహితవక్షోజకాఠిన్య సహనగణ్య
నవనవారుణ్యానటితాబ్ధి నందనార
సారసంబు ముకుందాంఘ్రి సారసంబు.

తే. దాన నొకజాతి జనియించి తనర నాత్మ
వాసనలు ఘుమ్ముమన శుద్ధభావ మమర
నందుఁ దాఁ జెంది యుదయంబు నంచె జగతి
దీప్రభోగప్రభుండు నాగప్రభుఁడు.

క. ఆనాగవిభుఁడు గంగా
స్నానము గావించి విశ్వనాథుని కృప మెం
తేనిఁదగ విశ్వనాథ
క్ష్మానాథునిఁ గాంచె వేడుకలు నలువొందన్.

* * * *

ఉ. డెబ్బదిరెండు రాజులఁ గడిందితనంబునఁ గొట్టిపోరిలో
డెబ్బదిరెండు గెల్పులు వడింగయికొంచుసమగ్ర కీర్తిచే
నుబ్బుచు విశ్వనాథవసుధోత్పలబాంధవుఁ డొప్పునారుహా
నిబ్బరగండఁడంచుఁ దనునిద్ధరనందరు సన్నుతింపఁగన్.

శా. విద్యారణ్యతపోవిపాకవిభవావిర్భూత సింహాసన
ప్రోద్యద్దుర్గమభార్గవీ విజయలీలోన్నిద్రభద్రార్చనా
హృద్యప్రక్రియ నింటఁజేర్చుకరణిన్ శ్రీవిశ్వనాథుండు చం
చద్యోగంబునఁ జెంచెఁదత్కరుణ హెచ్చన్ శాశ్వతైశ్వర్యముల్.

క. ఆ విశ్వనాథనృపతికి
శ్రీపిరాజమకుఁ బెద్దకృష్ణనృపాలుం
డావిర్భవించెఁ ద్రిభువన
కోవిదసంస్తూయమాన గుణమణిఖనియై.

* * * *

ఉ. ఆ పెదకృష్ణభూవరకులాగ్రణికిన్ జనియించె సంతత
ప్రాపితకీర్తిహారి సుకృతైకవిహారి తత్ప్రతాపవ
ద్వ్యాపవతంస ముక్తిపరిపోషణతోషితశేషభోగి వా
ణీపతి పెద్దవీరధరణీపతి కోప తిరస్కృతారియై.

* * * *

క. ఆ వీరవిభుఁడు తిరుమల
దేవి రమణీయ లీలఁ దేలుచు విశ్వే
శ్వవిభుఁ గుమార కృష్ణ
క్ష్మావరుఁ గస్తూరిరంగ జనపతిఁ గాంచెన్.

* * * *

క. ఆ విస్స(శ్వ)నరపతివలన
నావిర్భూతంబు చెంది యఖిలప్రభుసం
భావితనిజవిజయప్ర
స్తావుఁడు శ్రీముద్దుకృష్ణజనపతి వెలసెన్.

* * * *

చ. కలుపుగ ముద్దుకృష్ణనరనాథశిఖామణి గాంచె వేడ్కతో
నిలపయిఁ జంద్రసూర్యు లుదయించి రొకో యనిలోకులెన్న ని
శ్చలగతి ముద్దువీరనృపచంద్రుని శాశ్వతకీర్తిసాంద్రు ని
ర్మలతరధీరతావిజితమందరుఁ దిర్మలభూపురందరున్.

* * * *

క. అల తిరుమల నరనాథుం
డల మేలమయందుఁ గాంచె ననఘచరిత్రో
జ్జ్వలవిభవసాంద్రకీర్తులు
వెలయంగఁ గుమారముద్దువీరనరేంద్రున్.

* * * *

క. లలితహారిభాషణ కుతూ
హల విజయవచస్సమంచితాత్మయునై తాఁ
గలితసుభద్రాభిధయై
యలరారున్ మధురనాయికాంబ గణింపన్.

సీ. తిరుమలమేదినీవరుముద్దువీరధ
రాధినాథుండు మీనాక్షమాంబ
యందల చొక్కనాథావనీపాలు లిం

గాంబికయందు ముద్దళఘరీంద్రు
నాజమాంబికయందు నచ్యుతేంద్రునిఁజిన్న
యచ్యుతుఁ మధురనాయకమయందు
నారసింహక్షమానాథశిఖామణి
నెనలేని వేడుకల్ హెచ్చిలంగఁ
గాంచె నెంతయుఁ గల్పద్రుపంచకంబుఁ
బాలమున్నీటిచందానఁ బ్రథితదాన
వర్తనంబును గీర్తివిస్ఫూర్తి మెఱయ
సరససుమనోమనో విలాసంబు మె(నె)ఱయ.

* * * *

సీ చోళంబు పగులనాభీలకరామర్ద
గాఢాగ్నిశిఖగీలి రూఢిపఱచి
మత్స్యంబు సుడివడ మండు వేసవిఫ్రాఁట
గాటంపుఁబేరెండకడఁక నెఱపి
సింధుపుశోషింపసీమారవద్ఘోర
బాఃకబజ్జ్వలదర్పిపటిమఁబేర్పి
వంగంబుపై పైఁగరంగబంధురగంధ
వాహాబాంధవకీల వైపుఁజూపి
పంపులకు రాకదొరలు గర్వింపఁగినుక
వివిధ దేశమ్ములను దండు విడియునపుడు
తనరు వీరయ చొకరనాథక్షితీంద్రు
చంద్రహాసనటద్ధామచండిమంబు.

* * * *

సీ. ఘనుఁడితండని మొనసిన కాందిశీక
పారసీకశకాంగబర్బ్బర కళింగ
వంగ బంగాళ చోళ నేపాళ భయద
ఘనవిజయధాటి ముద్దులక్ష్మరికిరీటి.

* * * *

మ. జలవంశంబునఁ బుట్టురట్టు నతిచాంచల్యాయశంబుంజనన్
మెలఁగఁగోరి విశుద్ధవంశమున లక్ష్మీదేవి లక్ష్మీసతీ
తిలకంబై జనియించి సుస్థిరగుణాధిక్యంబుఁ జెందం దదా
కలనన్ ముద్దళఘేంద్రుఁడర్మిలిఁగనున్ గార్హస్థ్యధర్మోన్నతుల్.

మ. సరసీజాక్షుఁడు చక్రధారియును నిచ్చల్ హెచ్చు శ్రీముద్దుల
ళ్ఘురిశౌరిన్ మఱపించు నాత్మజునిపేలన్ శ్రీయనంబొల్చు బం
గరుసౌమ్మ్యయది రుక్మిణీత్వము తగంగా ధారుణిన్ రుక్మిణీ
హారిణీలోచన నన్నెగాంచెను సముద్యల్లోకముఖ్యస్థితిన్.

మ. అనఘుండైన కుమారుఁగాంచి శుభవిద్యామూర్తియౌనన్న కీ
ర్తినినల్వొందిరమావిలాసమమఱున్ రీతిన్ విజృంభించి చ
ల్లనివేఁజూపులనందరిన్మనుపులీలంబొల్చె నాఢ్యత్వమా
నన ముద్దళ్ఘురి రాజమౌళిసతి మీనాక్ష్యంబ భాగ్యోన్నతిన్.

ఉ. ఆనృపచంద్రుతమ్ముఁడనిశార్చితనీలగళుండు సర్వ వి
ద్యా నిపుణుండు ధన్యుఁడువదాన్యశిఖామణి దివ్యకీర్తికాం
తా నవమన్మథుండు కవితాచతురుండు చెలంగుజన్యసి
మానటితోరుశౌర్యఖని యచ్యుతశౌరియశోవిహారియై.

* * * *

ఉ. బుద్ధులతావు మేలములప్రోవు గొనమ్ముల రేవు బోంట్లకున్
ముద్దులతావు చెండిదొరమూకలకున్ బలుగావు నర్థులౌ
పెద్దలవేల్పుటావు చినవీరనృపాలుతపంబులావు నా
ముద్దుల యచ్యుతాధిపుఁడు మోహనమూర్తి చెలంగునిమ్మహిన్.

ఉ. అన్నలుతమ్ములీకరణి నందరు నొద్దికయై యశోరమన్
జెన్నువహించి రాముకృపచే నృపచేళిమరాజ్య సంపద
భ్యున్నతభోగభాగ్యుఁడయి యుర్విని సర్వనృపాలకోటిలో
నెన్నిక కెక్కె ముద్దళఘురీంద్రుఁడు దివ్యమహామహోన్నతిన్.

శా. జాణైయింపుగఁబలుక్కు కులుక్కు నునుపుల్ జగ్గుత్తి గన్నిత్య క
ల్యాణస్ఫూర్తి నెసంగ గాజతులు చాలా మించిరాణించఁగా
నేణాక్షీతతి ముద్దులళ్ఘురిధరిత్రీశుండు లాలించి తా
వీణావాద్యము నేర్పుమీటుఁవగనౌ వింతందనంతన్రహిన్.

సీ. . . . . . . .

చల్లఁదనముల్లసిల్లంగ నెల్లవారు
నౌర శాబాసు మేలు మ ఝ్ఝారె యనఁగఁ
బ్రౌఢి మెఱయంగ సాహిత్యరచనసేయు
నెపుడు ముద్దళఘురిశౌరి రిపువిదారి.

సీ. . . . . . . . . . .

భావరసములుతగవృద్యభరతవిద్య
నలవరచుఁ దాను బాలలనతనులీల
విదితరణకేలి శాత్రవవిపినకీలి
కవికమలహేళి ముద్దళ్ళవిరి భుమాళి.

* * * *

క. ఏవంవిధ సద్గుణమణి
కావలయాంచద్ధరావరాంగీహీర
గ్రైవేయకాభిశోభియ
శోవిలసితధవళఘృణికి శూరాగ్రణికిన్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగానా యొనరింపంబూని నసత్యభామా సాంత్వనంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన.

శా. శ్రీశుం డానరకాసురుం గెలిచి రాఁ జెల్వల్ప దార్వేలు తా
రాశం గూడఁగ నల్లుసత్యనెటులూరార్చేరనాసతత్కథన్
ధీశక్తిఁ జనమేజయుండడుగఁ దానెకొన్న మోదంబుతో
వైశంపాయనుఁ డిట్లనెన్ మధుసుధావాద ప్రవీణోక్తులన్.

**End :**

కవి. వినుతకృపావన రమ్యకృపావన విభ్రమపావన దృక్కమలా
తనురుచిమానస సంభవమానసదాసనమాన సమగ్రయశా
వననిధిసారవ(స) నాధిపసారస వక్రమసారస ఘనవిభవా
వనజభవాసనవారిజగద్యుతివారిజసారజయాభ్యుదయా.

**Colophon :**

గద్య. ఇది శ్రీకాళహస్తీశ్వర చరణారవింద మిళిందాయమానాంతరంగ జ్ఞానప్రసూనాంబికా కృపావలంబవిజృంభమాణ సారసారస్వతసుధాంతరంగ వెంగనామాత్యలింగన మఖివంశపావన విరచిత విద్యాధిదేవతాసంభావన దక్షిణ సింహాసనాధ్యక్ష తిరుమలకుమారాంతకరుణాకటాక్షలక్షిత స్వచ్ఛముక్తాగుళుచ్ఛసితచ్ఛత్ర చామరకళాచికాకనకాందోళికాది రాజోపచార ధీరజనహృదయ రంజకవచో విహారవల్లకీవాదనధురీణవర్ణ గీతాదిగాంధర్వ స్వరనవీనకల్పనాప్రవీణ కామామ్యంబికానాగనకవిరాజనందనకలిత సకలబాంధవ హృదయానందకర సుకవిజనవిధేయ శ్రీకామేశ్వరనామధేయ ప్రణీతంబైన సత్యభామాసాంత్వనంబను మహాప్రబంధంబునందు సర్వంబును జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము. గ్రంథపాతములు లేవు.

నాల్గాశ్వాసముల యీ యపూర్వ ప్రబంధమున సత్యభామానునయకథ హృద్యముగా వర్ణితమయినది. గ్రంథకర్త శ్రీ కామేశ్వరకవి. తిరుకామకవియనియుఁ గలదు. దక్షిణ మధురాపురము రాజధానిగాఁ బాండ్యదేశము నేలిన ముద్దళఘు ప్రభుని కీ ప్రబంధము కృతి సేయఁబడినది. గ్రంథకర్తయగు కామేశ్వరకవి శ్రీ కాళహస్తీశ్వరస్వామి భక్తుఁడు. మధురాధీశ్వరుఁడగు తిరుమలనాయకునిచే రాజాహ్వాసమ్మానములఁబడసినవాఁడు. కామాక్షి నాగనకవుల పుత్త్రుఁడు. సంగీతవిద్యావిశారదుఁడు. వీణావాదన చతురుఁడు.

---

## No. 861. సత్యభామాసాంత్వనము.

## SATYABHĀMĀSĀNTVANAMU.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches. Pages, 188 Lines, 8 on a page. Character, Telugu. Condition, Slightly injured Appearnce, old. Mode of writing, good but not free from mistakes and breaks off here and there.

Complete.

Same work as the above.

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యమించుక కలదు. గ్రంథపాతములును గొలఁదిగాఁ గలవు.

పూర్వము వోలె.

---

## No. 862. సత్యభామాసాంత్వనము.

## SATYABHĀMĀSĀNTVANAMU.

Substance, paper. Size, 12½ × 7½ inches. Pages, 392. Lines, 24 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper. Different readings are interlined and the correct readings are given on the opposite blank pages.

Complete but pages 173—184 are wrongly bound.

Same work as the above.

The following note of Mr. Brown appears on fol. 2*a*.

"The great theme of this book is Purusha Viraham on the part of Satyabhama and Strı Viıaham (see 3–12) on the part of Cristna" (వి-వి.)——

సమగ్రమేకాని 173 మొదలు 184 వఱకుఁగల పత్రములు 197 వ పత్రము తరువాత నుండవలసినవి. ఇది సంపుటీకరణమునఁదలి లోపము. పత్రము లొక్కొక్క వైపుమాత్రమే వ్రాయఁబడినవి. పాఠభేదములు పంక్తులనడుమ నిరికింపఁబడినవి; వానిలోని నిర్దుష్టపాఠము లెదురుగానుండు వ్రాయని పుటలమీఁద వ్రాయఁబడియున్నవి. వ్రాఁత చక్కనిది గాని నిర్దుష్టము గాదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువాలె.

## No. 863. సత్యభామాసాంత్వనము.

## SATYABHĀMĀSĀNTVANAMU.

Substance, palm-leaf Sıze, 17 × 1⅝ ınches. Pages, 153 Lines, 7 on a page. Character, Telugu Condition, good Appearance, old Mode of writıng, good but not free from mıstakes.

Complete.

Same work as the above.

సమగ్రము. కడపటి యాశ్వాసము తుదిపట్టు వదలిపెట్టఁబడినది. వ్రాఁత బాగుగానున్నదిగాని నిర్దుష్టముగాదు.

పూర్వమువాలె.

గ్రంథాంతపు తాటియాకు లోతట్టున నిట్టి వ్రాఁతకాగిత మొకటియున్నది:——

"రాజమండ్రి మకాం చిత్రాడ కాపరస్తులయిన చెలికాని ధర్మారాయునింగారివద్దినుంచ్చి మనుచరిత్ర సత్యభామాస్వాంతం కలవక పుస్తకం భాసం(నుం)బైల కొండ్డలరావు తెప్పించి మెస్తరు శి. పి. బ్రౌన్ ధొరగారి స్వంత్తముకుఇచ్చినాడు. ౧౮౩౮ వ సం॥ యేప్రిలు ౧౮ వ తేది రోజు జయ సం॥ చైత్ర శు ౭ శుక్రవారం. ............. Condulrow inhabitant of Cocanada."

## No. 864. సమీరకుమారవిజయము.

## SAMĪRAKUMĀRAVIJAYAMU.

Substance, paper. Sıze, 12¼ × 8 inches. Pages, 327. Lınes, 20 on a page. Character, Telugu Condıtıon, faır. Appearance, old. Mode of writıng, good but not free from mistakes

Complete.

A poem in five Āśvāsas describing the story of Hanūmat; the author Puṣpagiri Timmanna, was the son of Ōbalāmba, and Appayārya of Viśvāmitragōtra and Āśvalāyana sūtra. The author had two elder brothers named Vēṅkaṭakṛṣṇakavi and Vēṅkaṭakavi. The work under notice was dedicated to God Rāma. The author also translated into Telugu, the Subhāṣitatriśatī of Bhartṛhari and helped Kaṅkaṇṭi[1] Pāparāju and Ṭēkumalla Raṅgaśāyikavi in writing certain works. For other particulars see the extracts given below.

**Beginning:**

శా. శ్రీలీలం దిలకంబు కస్తురిని జిత్రించంగ నీచెక్కుట
ద్దాలం జూచెదని . . . నానగదదుద్వృత్తాకారంతికర్పూరరే
ఖాలక్ష్మింగన వింతయెంచమది చకరంజూడు నాఁ జూచిపీ
తూశిన్నల్పుగ మెచ్చుసీతనగు రామాధీశుఁజింతించెదన్.

* * * *

సీ. . . . . . . .
స్వప్నమునమున్నునాకు సాక్షాత్కరించి
తత్త్వమస్యాదివాక్య సంతతికి నర్థ
మెఱుక చేసినగురుఁడ నే నే యటంచు
నానతిచ్చినహనుమంతు నభినుతింతు.

* * * *

వ. అని . . . . . . .

సీ. శ్రీగురూత్తమపాద సేవాగతాధ్యాత్మ
తత్త్వకవిత్వ మహత్త్వవిదుఁడ
నాశ్వలాయనసూత్ర హారివిశ్వామిత్ర
గోత్రాబ్ధిచంద్రుండఁ గుశలమతిని
నలపుష్పగిరియప్ప నార్యున కోబలాం
బకునుసుపుత్రుండ బ్రహ్మవేత్త
యైనవేంకటకృష్ణ యాగ్రణికిని వేంక
టాఖ్యకవీంద్రున కవరజుండ
సరసగుణయుతుండ వరకవితిమ్మనా
హ్వయుఁడ నేను జననమంది మనుట
కెల్ల ఫలముగల్గఁ గృతియొకటి రచింప
నూహసేయుచున్న నొకరనాఁడు.

సీ. మాయన్నకృష్ణధీ మణియును మత్సఖుల్
ధన్యులంతర్ముఖుల్ తాడిపర్తి

పాపనార్యుని చెట్టఁ బట్టినోచినయ(యె ?) ల్ల
మాగర్భశుక్తిని మౌక్తికంబు
క్రియ నుదయించిన కేశవ పెరుమాళ్లు
ప్రబలవంశాబ్ధి తారాకళత్రుఁ
డగు చెన్న(న్న?) భట్టార కాగ్రకుమారుండు
రాజయోగవిదుండు రఘుపతియును
శిష్టగోష్ఠినుండి హితులు గావుననాఁడు (దు ?)
నెమ్మదిని బ్రబంధ నిర్మిమీవ
గ్రమ్మి యునికి యెఱిఁగి నెమ్మియు సమ్మోద
మినుమడింపఁ బలికి రిట్టులనుచు ॥

* * * *

మత్త. ధారతప్పక చెప్ప నేర్తు వుదారవాక్ప్రచురత్వమో
హారనాఁగఁ బ్రబంధ మొకటి యొకటినాఁటనె సన్నుతా
చారముం బరతత్త్వ మార్గవిచారముం గల పేటి వా
కౌర తిమ్మనసత్కవి రసనార్థ గౌరవభారవి ॥

* * * *

ఉ. "నీవు కవిత్వతత్త్వముల నేర్పరివౌటకు సత్ఫలంబుగాఁ
బావని నీకు సద్గురుఁడు ప్రాణవిభుండు నభీష్టదైవముం
గావునఁ దచ్చరిత్ర లాడికంబుగఁ గూరిచి సేయుమా జగ
త్పావనమై ప్రవర్తిలఁ బ్రబంధము దుష్కృతబంధముక్తికిన్ "॥

* * * *

ఉ. వారి నుతించి మంచి మతి వాయుజుపుణ్య చరిత్ర లన్నియున్
గూరిచి తత్ప్రబంధమునకుం బతి నెవ్వరి సేతు నంచు లోఁ
గూరినజాలి నొండొకరిఁ గూడి వచింపక యొకనాఁడు గౌ
రీరమణాలయంబుకడ రేపటివేళ వసించి నిష్ఠతోన్ ॥

* * * *

చ. రవిశశిమండలంబుల స్థిరత్వము మానక కొంతలోపలన్
దవిలినగాడ్పుపీడ కమనస్కతనైకె గురియందుడిందు బిం
దువు వెలిగ్రమ్మ నీక యటఁదోఁచిన రూపులు ద్రోయ గ్రమ్మరన్
దివిరిన నన్నులేనగవు దేరఁగనుం గొనియాఘనుండనున్ ॥

ఉ. ఓయి సుధీంద్ర నీవిమలయోగవిరోధము సేఁచురాము మే
మీయెలనాగ సీత విను మే రఘురాముఁడ మామరుత్సుతుం

బాయకకొల్చితతర్కథ ప్రబంధముచేసెద వంకితంబుగాఁ
జేయుమమాకు నీకెఱుకచెల్వగునంచు నదృశ్యమాటయున్॥

* * * *

క. నూతన ఝషకేతన సమ
చేతనమోహన మహావిశేషాకృతికిన్
శ్రీ తారుణ్యావతీసమ
సీతాలావణ్య రతికి శ్రీరఘుపతికిన్ ॥

వ. సమర్పితంబుగా నాయొనర్పంబూనిన సమీరకుమార విజయంబను మహా ప్రబంధంబునకు శ్రవణక్రియాప్రవణ జనామిత జనుషఘ్రాతాయత దుషఘ్రాతలతాల (వి)చిత్రంబగు కథా సూత్రంబు బెట్టెదనిన.

**End :**

క. ఈ సామీరి చరిత్రం
బేసుజనుఁడు చదువుకొన్న హితమతివిన్నన్
వ్రాసిన మఱి వ్రాయించిన
నాసాత్వికుఁ డిహపరంబులందు సుఖయగున్.

తే. అనిసకల భూతజాతదయా గరిష్ఠుఁ
డగువశిష్ఠ మునిశ్రేష్ఠుఁ డాత్మనిష్ఠుఁ
డానతిచ్చిన హనుమన్మహత్త్వమెల్ల
వినిశతానందుఁ డానందమునఁ జెలంగె.

* * * *

ఉత్సా. దారుణప్రయోగ బాణధారణా నివారణా
వారణాభియాతి శౌర్యవైభవాదికారణా
కారణాత్మచిన్మనోలగత్తమోనికారణా
కారణాతి దూరదైత్యగర్వహృన్మహారణా.

**Colophon :**

గద్య. ఇది శ్రీమదంజనాతనయ దయారస లసత్కటాక్ష వీక్షా మహాత్త్వ సంప్రాప్తకవిత్వ విద్యావధానసుగుణ నిర్గుణధ్యాన వాసనానిధాన మానసబిసపుష్ప పుష్పగిర్యప్పనార్య కుమారసమాశ్రిత బుధాధార గురుజనవిధేయ తిమ్మన నామధేయ ప్రణీతంబైన సమీర కుమారవిజయంబను మహా ప్రబంధంబునందు అర్జున శరసేతు భంగంబును, భీమునకు వరంబొసంగుటయు, పురుష మృగాగమనంబును, కింపురుష వర్షవర్ణనంబును నన్నది సర్వంబును సప్తమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

అయిదాశ్వాసముల యీ యబ్బురపుం బ్రబంధమున బహు పురాణములనుండి హనుమంతుని కథలెల్లనేర్చి కూర్పఁబడినవి. గ్రంథకర్తను ప్రఖ్యాతుఁడగు పుష్పగిరి తిమ్మకవి. ఆశ్వలాయన సూత్రుఁడు. విశ్వామిత్ర గోత్రుఁడు. అప్పనార్యుని కుమారుఁడు. వేంకటకృష్ణ వేంకటకవుల తమ్ముఁడు ఈ కృతి శ్రీరామాంకితము. ఈతఁడు భర్తృహరి సుభాషితత్రిశతిని దెనిఁగించెను. కంకంటి పాపరాజు, తేకుమళ్ల రంగశాయికవి, యీతనితోడ్పాటున గ్రంథముల రచియించిరి. విశేషములకు దాహృత గ్రంథభాగములఁ గాంచునది.

---

## No 865. సమీరకుమారవిజయము.

## SAMĪRAKUMĀRAVIJAYAMU.

Substance, palm-leaf. Size, 18⅝ × 1½ inches. Pages, 315. Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

**Complete.**

Same work as the above, which was transcribed from this Ms.

సమగ్రము. వ్రాత యొకమాదిరిగా నున్నదిగాని నిర్దుష్టము గాదు.

ఇది నెం 864 రున వర్ణితమగు గ్రంథమగుటయేకాక - యాప్రతికి మాతృకగాఁ గూడనున్నది.

పూర్వమువోలె.

---

## No 866. సానందగణేశ్వరవిలాసము.

## SĀNANDAGAṆĒŚVARAVILĀSAMU.

Substance, paper. Size, 7⅞ × 6½ inches. Pages, 301. Lines, 14 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes and breaks off here and there.

**Incomplete.**

A Prabandha in three Āśvāsas describing the greatness of Śivapañcākṣara, as found in the Skāndapurāṇa. The author Koṇḍamadugu Puruṣōttamakavi was the son of Vengamma and Giriyappa of Bhāradvāja gōtra. The author had a title "Kavigandhasindhura" and was a devotee of God Nṛsiṃha worshipped at Kambagiri. The work was written at the instance of a Vaiśya sage Kiccaghana (of Kuñjēṭi family) who was the son of Vēngamāmba and Nāgiśeṭṭi of Mithunakula gōtra. For other particulars see the extracts given below.

**Beginning:**

ఉ. శ్రీశుకవాణినైన కళలచేఁ జెలువందిన గౌరి భూరిలీ
లాశుభ లక్షణంబుల నలంకృతి గాఁ బరమేశునర్ధదే
హాశకు నెగ్గి కాంచిన మహామహిమాఢ్యుఁడు దాఁబగుంట్లపీ
ఠేశుఁ డశేషవాక్యముఖరీకృత సత్కృతి నేలుఁ గావుతన్.

*　　*　　*　　*

సీ. లోకసుశ్లోకి వాల్మీకిని గొనియాడి
యావ్యాసుపదయుగం బర్థిఁ దలఁచి
తగుభక్తితోఁ గాళిదాసుఁ బ్రశంసించి
తతవాక్యములదండి దండిఁ బొగడి
ప్రకటభాషాభూతి భవభూతినుతియించి
పాండితీయధురీణు బాణు నుడివి
నిగమాగమవిహారుని మయూరు భజియించి
భజితార్యు నయ్యన్నపార్యుఁ దిక్కన-
కవిని నాచనసోము భీమవరభీము
రంగనాథాగ్రగణ్యు భారవిని వీర
భద్రశివభద్ర భాసురప్రకట సంస్కృ
తాంధ్రకవులనుఁ గైమోడ్పు లాచరింతు.

*　　*　　*　　*

వ. అని యభీష్ట దేవతాప్రార్థనంబుఁ జేసి సుకవి సముదయ హృదయానందం బొనర్చి కుకవినికర నింద లందంద కావించి యనంతరంబు నిదురించినయెడ.

సీ. . . . . . . . . . . .
దివ్యతేజంబుతోడ సంభావ్యలీల
గలిగి నాస్వప్నమునను సాక్షాత్కరించి

బాలకయటంచుఁబిలిచి నాపాల నిలిచి
పరమగుణభద్రుఁడ వీరభద్రుఁడనియె.

*　　*　　*　　*

క. సానందగణేశ్వరకథ
మానితమతిసత్ప్రబంధమణిరాయదివా
నానిగమవచనములవలె
నైనది నాకంకితముగ నర్పింపుమనా.

*　　*　　*　　*

క. ఏతత్కృతిపతివంశము
చేతోముద మొదవ వినుతి చేసెద భూవి
ఖ్యాతిగ సుమహాత్కవితా
పూతమతిస్ఫూర్తవితతభూషణ మనుచున్.

శా. సాలంకాయనమౌని పూర్వమున భాస్వద్దివ్యతేజోధనుం
డాలీలానిధివంశసంభవులలో నత్యుజ్జ్వలాచారవా
గ్జాలుల్స (ర్స) త్యధను లుకుబేరసదృశులౌ భాగ్యభాగోదయుల్
మేలింపొందిన వైశ్యవర్ధనులు గాంభీర్యామితౌదార్యులై.

క. ఆ పుణ్యపురుషు లమిత
వ్యాపారు లనంగఁబ్రబలి వాసవకన్యా
దీపితకృపచే వర్ధిలి
రాపరమదయాళు లాత్మలందోకపీకన్.

సీ. శ్రీ నగేశ్వర ( . . . ) శ్రీపాదపద్మసే
వారంభసంభ్రమోదారులగుచు
వింధ్యవాసిని గంగ వెలయుంగ నుతియించి
నారు సంతతకళాధారులగుచు
ధరజనార్దనమూర్తివరముచే విస్ఫూర్తి
సరసంబుగన్నారు సభ్యులగుచుఁ
గమనీయముగఁగోనకమలా ప్రసాదంబు
వహింగాంచినారిలావాసులగుచు
గరిమఁ బదునెన్మిదిపురంబు లురుతరముగ
నపుడుగల్పించినారు సత్యాత్ములగుచు
ధన్యులనమించినారు మూర్ధన్యులగుచు
భాసురారాధ్యాంఘ్రిసేవాప్రభావులగుచు.

*　　*　　*　　*

క. కుంజేటికులశిఖామణి
రంజితసాద్గుణ్యగణవిరాజితతేజః
పుంజనభోమణి యనఁదగు
మంజులఘృణి నాగిసెట్టి మహిమోన్నతుఁడై.

సుగంధి. మిథునకులగోత్రమున మేటియన మించెన్
మధురవాక్తతి వెంగమాంబను వరించెన్
బుధవినుతసుమతియనుపోణిమిరహించెం
గధితవైఖరిఁగిచ్చఘురుసుతునిఁగాంచెన్.

చ. అతనిసహోదరుండు వినయాభినయాతిమతిప్రతీతశా
శ్వతశుభలక్షణుండు విలసత్ఫలసత్కృతిభారతీచమ
త్కృతినతిమేధబోధగవరించిచరించిన నిత్యసత్యశో
భితకుతుకాభిరాముఁడు గభీరగుణాఢ్యుఁడుబుచ్చనాఖ్యుఁడున్.

* * * *

మ. మును నేఁజెప్పినబుచ్చనాహ్వయునిసత్పుత్రు ల్పవిత్రకీ
ర్త్యనవద్యప్రియు లాశ్రితామరతరుల్ హర్యంఘ్రిపంకేజపూ
జనదీక్షానుచితక్షణేక్షణకళాంచచ్చారు గంభీరభా
జనులౌ నాగయరామధీమణులు భాషాభూషణు ల్వారిలోన్.

ఉ. నాగఘనుండు పండితజనస్తుతిమేధ దలంచిచూడఁబు
న్నాగఘనుండు సజ్జనమనఃప్రమదాతి సమాఖ్యయందుఁబు
న్నాగఘనుండు భూసురగణంబులపాలిటి కోనదేవసే
నాగఘనుఁడు వైశ్యకులనవ్యసుధాకరుఁడెంచిచూడఁగన్.

ఉ. రాముఁడుతమ్ముఁడాతనికిరాట్సభలందుఁదలంపసత్కృపా
రాముఁడు సాత్త్వికంబుననె రాముదమీనెలకొన్న భార్గవీ
రాముఁడుచాకచక్యమునరాజిలు మోజులరాజరాజులోన్
రాముఁడు తోడునీడనుధురంబువహించెను నాగిశెట్టికిన్.

సీ. ఆకిచ్చఘనకుమారాగ్రేసరుఁడు చిద్వి
లాసంబుమీసంబు గాసహించి
సలలితాశాపాశములు మనోవీథిలో
పలఁ బోవనాడిసంభ్రమముగూడి
లక్ష్యలక్షణకళాలంకారనిశ్శంక
ఖిరుదాంకుఁడనుదారిఁ బేర్మిఁగోరి

వాచామగోచరంబై చెల్వుగను పర
బ్రహ్మప్రభావంబు భావనంబు
గా మెలంగించి వృజినసంఘముఁగలంచి
పంచవింశతితత్వప్రపంచసత్వ
మాత్మ నూహించి సాత్వికం బఖినయించి
యలరె విఖ్యాతిచేత నయ్యావధూత

(Here are wrongly written four passages that ought to have been written after the stanza marked 43; but in this extract, the passages are given in their right place.

దీని తరువాతి 14 పంతులును 43 వ సంఖ్యగల పద్యము తరువాత నుండవలసినవి. ఇకడనుండుట తప్పు. ఇందు ఎత్తి వ్రాయుటలో ననుక్రముగానే వ్రాయఁబడినవి.)

* * * *

శా. ఆ పుణ్యాత్ముఁడు దూబగుంట్లనగరార్యానందనవ్యాపక
త్వాపోజ్యోతికి వీరభద్రపతి కేతతార్యసద్రత్నమా
లావల్యంకిక నియ్యనెయ్యమునఁజాలాచిత్తపద్మంబులో
దీపింపన్ననుఁబిల్వఁబంచిలలితోక్తి స్నతఃకృతిం జేయఁగన్.

వ. ఇట్లనియె.

శా. ఆపస్తంబసుసూత్రకొండమడుగూద్యద్వంశజాగిర్యప
శ్రీపార్వత్యుపమాంగవెంగమసుతా శేషాహిభాషాగభీ
రా పాండిత్యధురంధరప్రబల భారద్వాజగోత్రోద్భవా
నీపేర్మిం బురుషోత్తమాఖ్యసుకవీనిర్మింపు మేతత్కృతిన్.

మ. అని తాంబూల సుగంధవస్త్రములు నెయ్యంబొప్ప నిప్పించి ప
లికనచో నామదినొయ్యనియ్యకొని మే ల్మెంచు సానందస
న్మునిలోకేశు చరిత్ర మేనుడువ సమ్మోదంబుతోఁ దేనెత్రా
వనుజేతంబడుగంగ నేల యని శేవంబూనినానీక్రియన్.

క. మదవద్రిపునాశనునకుఁ
గదనజయాటోపవిపులఖడ్గద్యుతిసం
పదకుటిలకేశునకు స
ద్విదితచిదాకాశునకును వీరేశునకున్.

* * * *

వ. సమర్పితంబుగా నాకొనర్పంబూనిన సానందగణేశ్వర విలాసంబనుమహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**End :**

క. అని శౌనకాదిమునులకు
ఘనుఁడగుసూతుండు శివునికరుణాకలనా
ననమున నీకథ వినుపిం
చిన నది విని వారు ముదముఁ జెందిరి గరిమన్.

* * * *

మాలిని. పరహితగుణముద్రా భద్రకాళీవినిద్రా
చిరతరవరరౌద్రా చిత్కళాలోలనిద్రా
సరసరుచిసముద్రా సన్నమద్రామభద్రా
విరుచిరమతిభద్రా విశ్వభృద్వీరభద్రా.

**Colophon :**

గద్య. ఇది శ్రీమత్కంబగిరి నరసింహపదారవిందవందన సదానంద కందళితాంతరంగసముత్తుంగ సాద్గుణ్యసకలకళా ప్రవీణతాఖండపాండిత్యకొండమడుగన్వయ విరాజద్భారద్వాజసగోత్రపవిత్ర ప్రభావిభాసమానమహనీ యయ్యలూర్యగ్రహారాదికానేక శాశ్వతైశ్వర్య భరణ గిరియప సుధీవరేణ్యానంద నాంధ్రభాషా విశేష పురుషోత్తమకవి గంధసింధుర ప్రణీతంబైన సానందగణేశ్వరమునిచరిత్రంబను మహాప్రబంధంబునందు సర్వంబును దృతీయాశ్వాసము సంపూర్ణము.

(వి-వి.)—

సమగ్రము. కొన్ని స్థలములందు పద్యము లనుక్రమముగా లేవు. వ్రాఁత బాగుగానున్నది గాని దోషములు హెచ్చు. శైథిల్యము లేదు. అక్కడక్కడ గ్రంథపాతములును గలవు.

శివపంచాక్షరీమంత్ర మాహాత్మ్యముం బ్రకటించు నీకథ స్కాంద పురాణమునుండి గ్రహింపఁబడినది. భద్రదత్తా పూర్ణవిత్తుల కుమారుఁడగు సానందుఁడు నరకబాధలను వినఁజాలక జాలిపడి యమలోకమునకుఁబోయి శివ పంచాక్షరీ మంత్రోచ్చారణచే నచటి పాపులనునరక బాధా విముక్తులఁజేసి శివుని దర్శించి తదనుగ్రహమున గణేశుఁడయి మోక్షమందుట యిందలి కథ.

గ్రంథకర్తయగు కొండమడుగు పురుషోత్తమ కవి భారద్వాజ సగోత్రుఁడు; వెంగమ్మయు గిరియప్పయు నితని తలిదండ్రులు. ఇతఁడయ్యలూరగ్రహారముమున్నగు సొత్తులుగలిగి శ్రీమంతుఁడై యుండెనట. కంబగిరి నృసింహస్వామి భక్తుఁడగు నీ గ్రంథకర్త కవి గంధ సింధుర

బిరుదముగలవాఁడు. వైశ్యజాతుఁడై యవధూతచర్యవహించిన కుంజేటి కిచ్చఘునుని ప్రోత్సాహముచేత నీగ్రంథము రచియింపఁబడి దూబగుంట్లలో నున్న వీరభద్రస్వామికంకితము చేయఁబడినది. మిథునకులగోత్రులగు వెంగమాంబయు నాగిసెట్టియు నీకిచ్చఘునుని తలిదండ్రులు. ఇతని వంశవిషయము నుదాహృతపద్యములఁబట్టి తెలిసికొననగును.

---

## No. **867**. సానందగణేశ్వరవిలాసము.

## SĀNANDAGAṆĒŚVARAVILĀSAMU

Substance, paper. Size, 12⅜ × 8¼ inches. Pages, 121 Lines, 23 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, new. Mode of writing, good, but not free from mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. కొన్నిచోట్ల పద్యములవరుస సరిగాలేదు. వ్రాఁత తిన్ననిదే. తప్పులున్నవి. గ్రంథపాతము లకడకడ కలవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమందిట్లు గలదు.—

"మొకాబిలా చాయడమయినది. వారణాశి రామస్వామివ్రాలు. కొట్టిపాటి చెన్నప్పవ్రాలు."

---

## No. **868**. సానందోపాఖ్యానము.

## SĀNANDŌPĀKHYĀNAMU.

Substance, paper Size, 12¾ × 8 inches. Pages, 226 Lines, 20 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

The variations in the readings are interlined. Breaks off here and there.

Complete.

Similar to the work described under No 865 *ante* The author Kōṭa Śivarāmakavi, son of Alamēlmanga and Bāpanayya, says that he wrote this work at the instance of his preceptor Sadāśivaguru and has dedicated it to God Śiva worshipped at the śaiva shrine Śri Kālahasti-ksētra It is said that the author was a devotee of Kāḷī. For other particulars see the extracts given below.

**Beginning :**

శా. శ్రీకాళీరమణీమణీపరిణయ శ్రీవేళఁ గాతూహలా
స్తోకుండై తుహినాచలేంద్రుఁడు భవద్గోత్రాన్వయాశిక్యముల్
మాకుం జెప్పుమటన్న నొంటనక లీలామందహాసాంకుర
వ్యాకోచాననుఁడైనధూర్జటిమదీయాభీష్టము ల్సల్పెడున్.

*　　　*　　　*　　　*

సీ. . . . . . . . .
భర్మమంజీరమంజులార్భటులు చెలఁగఁ
జారుశృంగారమోహనాకారలీల
తెసఁగ సాక్షాత్కరించి మదీప్సితంబు
లిచ్చు శ్రీకాళికాదేవి నిచ్చఁ గొలుతు.

*　　　*　　　*　　　*

వ. ఇవ్విధంబున నిష్టదేవతాభివందనంబును శిష్టకవివందనంబును దుష్టకవినిందనంబును గావించి యొకమహాపుణ్యకృతి సేయందలంచి యున్నసమయంబున.

సీ. ఏమహాత్ముఁడు దక్షిణామూర్తిగతి శిష్య
　　తతికి బోధించె నద్వైతబోధ
యేరాజమాన్యుండు సారచిత్రకవిత్వ
　　గరిమఁ బ్రబంధసంఘములు సేసె
నేరమ్యగుణశాలి శ్రీరాజయోగసం
　　యోగవిజ్ఞానైక యుక్తి వెలసె
నేసంతతానందుఁ డీశ్వరచరణాబ్జ
　　సేవామహాద్భుత సిద్ధిఁ గాంచె
నట్టియభినవధూర్జటి యస్మదీయ
దేశికస్వామి కరుణాభిధేయుఁ డగుచు
వచ్చి నా చేయుపూజల కిచ్చమెచ్చి
పలికె నిట్లని మధురవాక్పటిమ మెఱయ.

*　　　*　　　*　　　*

క. సానందోపాఖ్యానము
పూని వచింపంగఁ గలుగుఁ బురుషార్థము పు
ణ్యానూనకీర్తి శోభలు
మానితముగ వెలసెదీవు మహిలోఁ ననినన్.

చ. గురుచరణాంబుజాతములు గొల్చి తదీయకటాక్షవీక్షణాం
కురితవిభూతిపెంపెసఁగ కోరివచింపఁగఁ బూనినట్టిసుం
దరతరకావ్యసుందరికి నాథుఁ డెవండని చింతసేయ న
ప్పరమశివుండు నాహృదయ పద్మమునందు వెలింగె నత్తఱిన్.

శా. శ్రీకాళద్విపనాథుఁడీశ్వరుఁడు మా చేతోంబుజాతంబునం
దాకల్యాణము గాఁగఁ దోఁచునని భద్రానందయుక్తుండనై
యీకావ్యాధిపుఁ డమ్మహాత్ముఁడు నిజాంబిక్తోట మద్భాగ్యరే
ఖాకౌశల్యవిశాలభూతి కవిలోకంబర్థిఁ గీర్తింపదే.

* * * *

సీ. తత్క్షణంబున సర్వ ధర్మస్వభావుండు
సమయవిశేష దీక్షాప్రవీణుఁ
డుత్తమగుణశాలి యోగాగ్రకవిజ్ఞాని
యాగమతత్త్వ రహస్యవేది
శివపాదపంకజ సేవానురక్తుండు
చిన్మయాత్ముఁడు సదాశివగురుండు
వేదాచలస్థాన విహరణోన్నిద్రుండు
కరుణాకటాక్షసంకలితుఁడగుచు
రమ్ము శివరామ నీకు యశమ్ముగలుగు
నిమ్మహాకృతి కాళహస్తీశు పేర
నంకితముసేయు మన్న దేహంబుపొంగి
యటులె చేసెద నన్న లెస్సాయె ననిన.

క. శ్రీకాళహస్తినాయకుఁ
డీకవితాకన్యకకు నధీశ్వరుఁ డనుచున్
జేకొనిమద్వంశక్రమ
మేకొంతనుతింతుఁ జిత్తమిగురొత్తంగన్.

* * * *

ఉ. మేనకమోవితేనెలకు మిక్కిలిఁజొక్కిన వశిష్ఠుతోఁజగం
బాని యెదిర్చి బ్రహ్మఋషి యనాననిపించుకొ నెంత్రిశంకుభూ
జానికొసంగెఁ దాబదులు స్వర్గముస్రష్టయొనర్పు సృష్టికిన్
బూనిసృజించె సృష్టిమునిపుంగవుఁ గౌశికు నెన్న శక్యమే.

క. ఆకాశికగోత్రాబ్ధిసు
ధాకరుఁ డఖిలైకదానధర్మకళాసు
శ్లోకుఁడు చెంగనయానం
గాకీర్తివహించెఁ గోటకరణంబగుచున్.

తే. అతఁడు కాళమ్మవలనఁ గృతార్థుఁడైన
పోట్టినాయనిఁ బడసె నాపుణ్యశాలి
రూపరేఖాగుణశ్రీల రూఢిగన్న
పరమసాధ్విని సూరమాంబను వరించె.

సీ. ఆనఘూవరులకుఁ బావనచారిత్రుఁ
డగు వేంకటాద్రి నిత్యాన్న దాన
పరుఁడైనయణ్ణాంచి (ణచిన్న)పద్మయగురువయ
యనగుణవంతులై నట్టిసుతులు
పొడమిరి నలుగురు పొలుపొంద వారిలో
నారిజనైక కందర్పమూర్తి
మహితాత్ముఁ డణ్ణాంచిఁ మానవేంద్రులసభా
స్థలిఁ బ్రసిద్ధివహించె ధన్యుఁడనఁగ
కోటసీమకుఁగరణమై గురువిలాస
పరమసద్గుణమణిగణాభరణబిందు
భరణశరణాగతత్రాణ కరుణయగుచుఁ
చెలఁగు కామాక్షమాంబను చెట్టపట్టె.

క. కామాక్షమాంబయందు మ
హామహుఁడణ్ణాంచి గాంచె నతులితతేజో
ధాముల వినయోద్దాముల
భూమానితనాములైన పుత్రాగ్రణులన్.

క. అందగ్రజుఁడై విభవము
లందెను పెదబాపనయ్య యాతనిగారా
బుందమ్ములు మనిరి కళా
విందులు చినబాపనయ్య వేంకటపతియున్.

ఉ. వారలలో మహాగణకవర్యుఁడు శాంతుఁడు – సద్వైభవో
దారుఁడు బాపనయ్య వసుధాస్థలిలో వెలసె న్సమస్తధా

త్రికమహాగ్రగణ్యులు సుధీమణు లార్యులుబంధువర్గముల్
గూరిమి సన్నుతింప ననుకూలనిజస్థిర ధర్మమార్గుఁడై.

*  *  *  *

ఆ. బాపనయ్య యొసఁగు బాపనయ్యాల కగ్ర
హారమూర్తికాగ్ర హారవార
సారభూరిగంధ సారకత్నాంబర
మాన్యమాన్యతతులు మహిమ వెలయు.

తే. అతనియర్ధాంగ లక్ష్మియై యతిశయిల్లఁ
గళలుగలబొమ్మ పతిభక్తిగలుగుకొమ్మ
భాగ్యములకివి సకల సంపదలదీవి
మహితగుణపేటి యల మేలమావధూటి.

*  *  *  *

క. ఆ దంపతుల పురాసం
పాదితపుణ్యప్రభూత భాగ్యం బనఁగా
నాది జనించెన్ గురువయ
యాదటఁ బాపన్నరామనాఖ్యులుపొడమన్.

క. అందగ్రజుండు గురువయ
మందారశతారతార మహనీయయశ
స్సుందరుఁడై పుణ్యకళా
బృందంబుల వెలసెఁ బ్రజలుప్రేమ నుతింపన్.

క. అతని సహోదరుఁడు నిజా
శ్రితజనపరిపాలనై కశీలుఁడు నిరత
క్షితిధరకార్ముకపూజో
న్నతుఁ డతనినుతింపఁ దరమె నరమాత్రులకున్.

సీ. పథన్యుఁ డఖిల రాజాధిరాజులచెంత
నఘుటనఘుటన సామర్థ్యమెసఁగ
నేధిరుఁ డుద్యద్విరోధి సంఘంబుల
మెదలంగనీయక మదమణంచె
నేమహాచతురుఁ డుద్దామమేధాశక్తి
వరుస లెకర్లుగూడి వ్రాయఁదొణఁగ
నేఘనుం డీశజటాఘుమంఘుమితధు
న్యారవోక్తుల భాషలాడనేర్చె

నతఁడుసామాన్యుఁడే సమస్తావనీశ
మంత్రతంత్రకళా శ్రీసమంజసైక
మూలభావక్రియా లోకశీలశాలి
కవనవాక్కేళి పాపయ గణకమౌళి.

చ. అతనికిఁ దస్సూఁడన్మధుర సాధికనవ్యవిచిత్ర సాహసీ
కృతిరచనాచమత్క్రియలఁ గీర్తివహించిన రామనాఖ్యుఁడన్
సతతముఁ గాళికాంబపద సారసయుగ్మముఁ గొల్చి తత్కృపా
ప్రతిభవహించి దివ్యతరభవ్య తరాత్మగురు ప్రసాదినై.

వ. కృతిపతియగు కాళహస్తిపతికిఁ బునఃపునః ప్రణామంబులుగా వించి యమ్మహాదేవుం డవాఙ్మనసగోచరుండయ్యును భక్తసంరక్షణ విచక్షణాక్షీణదీక్షాదక్షుఁ సగుణస్వభావుండగుట నానేర్చువిధంబునఁ దదీయ మహిమం బభివర్ణించెద.

* * * *

సీ. . . . . . . . . .
సౌఖ్యసంభూతియై సదాశాంతుఁడగుచు
భూతములకెల్ల నాధారభూతుఁడగుచు
వెలయుదక్షిణకైలాస నిలయుఁడీశ్వ
రేశ్వరుండైన కాళహస్తీశ్వరుండు.

క. ఏవంవిధగుణలీలా
పావనపుణ్యప్రభావ బంధురమతికిన్
దేవప్రదత్త వాగ్రే
ఖావిశ్రుతకృతికి దక్షకన్యాపతికిన్.

* * * *

వ. సమర్పితంబుగా నాయొనర్పఁబూనిన సానందోపాఖ్యానంబునకుఁ గథాసంవిధానం బెట్టిదనిన.

**End:**

వ. అని చెప్పి కౌతూహలోపేతుండై సూతుండు మౌని వ్రాతంబున కిట్లనియె.

శా. ఆచంద్రాంబుజమిత్రసప్తనగతారాంబోధియై నిల్చుఁగా
కీచారిత్రమిదెవ్వరేనివినినన్ హేలాగతిన్ వ్రాసినన్
ప్రాచుర్యంబుగ వారికబ్బు ధనలాభక్షేమసౌభాగ్యలీ
లాచంచద్విభవంబు లీశ్వరకృపాలాలిత్యవీక్షోన్నతిన్.

* * * *

క. సానందచరిత్రం బిది
యానందము మీఱ వినినయంతనె కలుగున్
శ్రీనందనమదహారి
దానందపురంబు సంతతానందంబై.

* * * *

పం. హారిత్పటీపటీరహీరహారరజిద్విభాధరా
ధరాధరాప్రదీప్తరత్న ధామచత్వరోదరా
చరాచర విసర్వభూత జాతజీవనాకరా
కరాంతరస్ఫులింగకీలి కాదహానలాశిరా.

Colophon:

గద్య. ఇది శ్రీమత్కాళికాంబావరప్రసాదలబ్ధసాహిత్యవైభవసదా శివస్వరూప సద్గురుచరణారుణరాజీవసేవాసమాసాదిత ద్వైతానుభవ కాశికగోత్రసుధార్ణవపరిపూర్ణకైరవబాంధవకోటి బాపనయ్యతనూభవసవి నయగుణవిధేయ శివరామనామధేయప్రణీతంబైన సానందోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పులు చాలఁగలవు. పాఠ భేదములు బంతులనడుమ నిఱికింపఁబడినవి. గ్రంథపాతము లక్క డక్కడఁ గలవు.

ఇది నెం 865 రున వర్ణితమైన గ్రంధమువంటిదే. అదేకథ యిందు వర్ణితమైనది. కాని యిది దానికంటె విస్తృతమై యుపకథలతోనున్నది. కోట శివరామకవి యేతద్గ్రంధకర్త కాశికగోత్రుఁడు, కాళీభక్తుఁడు. అలవేలమ్మ, బాపనయ్యలకొడుకు. సదాశివగురుని శిష్యుఁడు. ఈతని వంశమున పూర్వులనేకులు గణకశ్రేష్ఠులట! మఱికొన్ని విశేషములు దాహృతపద్యములఁబట్టి తెలిసికొనునది.

---

## No. 869. సానందోపాఖ్యానము.
## SĀNANDŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, $11\frac{3}{4} \times 7$ inches Pages, 131. Lines, 23 on a page. Character, Telugu. Condition, much injured Appearance, very old Mode of writing, good, but full of mistakes

Wants the last portion of the fifth Āśvāsa, otherwise complete. Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. పంచమాశ్వాసములేదు. వ్రాఁతచక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

No 870. సానందోపాఖ్యానము.

SĀNANDŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 13¾ × 1¼ inches. Pages, 122. Lines, 6 on a page Character, Telugu Condition, much injured. Appearance, old Mode of writing, bad and contains mistakes.

Complete.

Same as the above.

(వి-వి.)—

సమగ్రము వ్రాఁత చక్కనిదిగాదు తప్పులు గలవు, అతిశిథిలము. గ్రంథపాతములు గలవు.

పూర్వము వలె.

---

No. 871. సానందోపాఖ్యానము.

SĀNANDŌPĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 18⅝ × 1¾ inches Pages, 124. Lines, 9 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old Mode of writing, good but full of mistakes.

Complete in five Āśvāsas.

Same as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత బాగుగా నున్నదిగాని దోషములు హెచ్చు.

పూర్వము వలె.

ఆశ్వాసాంతములం దిట్లుగలదు :—

" శ్రీరాచవీటి రాచరాయనమః. శ్రీ యిందుకూరిపేట విశ్వేశ్వరాయనమః. కొండూరి వేదేశ్వరాయనమః. శ్రీ మంగల్లి భీమేశ్వరాయనమః. శ్రీ చెన్నవరప్పాటి నళసాని సాంబశివాయనమః. శ్రీగురు సారంగమఠ నీలకంఠేశ్వరాయనమః."

## No 872. సానందోపాఖ్యానము.

## SĀNANDŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 15⅜ × 1¼ inches. Pages, 96. Lines, 7 on a page Character, Telugu Condition, much injured. Appearance, very old Mode of writing, good but contains some mistakes.

Incomplete.

Similar to the work described under No 867 *ante*; the author Telikapalli Rāmalingabhattāraka of Kausikagōtra was the son of Subbamāmba and Lingadhīmani, and was the disciple of Sangara Nrsimhānandasvāmi The work is dedicated to God Śiva.

**Beginning:**

ఉ. శ్రీపృథివీధ్రకన్య మదిఁ బ్రేమభరాలసయయ్యెనంచుఁ బు
ష్పాపచయంబు సేయుతన హస్తమునం దనరైన మేఁటియం
దేపవళించు నద్భుతన దేయిడఁ జూచునుముందుముందుగా
నా పరమేశ్వరుం డతిదయామతినీకృతినిర్వహించుతన్.

* * * *

శా. ఆర్యాదివ్యపదారవిందయుగళ ధ్యానస్తవారాధన
స్థైర్యస్వాంతునిఁ జిన్మయాత్మకుఁ బర జ్ఞానాశ్రయుం గిల్బిషా
హార్యాఖండలు శఙ్కరాన్వయ నృసింహానందనాథాహ్మదా
చార్యస్వామిని సన్నుతించెద మనీషాయోగ్యతాసిద్ధికిన్.

* * * *

చ. సరసకవిత్వలక్షణ ని వక్తఘనాంధ్రమయప్రబంధభా
సురులఁ బ్రశాంతచిత్త పరిశుద్ధులఁ దిక్కన సోమయాజి భా
స్కరకవి నన్నపార్యముఖ ప్రథితాదిమసత్కవీంద్రులన్
నిరుపమకీర్తిశోభితుల నెమ్మది నెప్పుడు సన్నుతించెదన్.

* * * *

తే. పరగ నిటు లిష్టదేవతా ప్రార్థనంబు
గురునిసంస్తుతి సత్కవీశ్వరులవినుతి
కుకవినిందయుఁ గావించి సుకరముగను
వాసిగా మామకాన్వయావళివచింతు.

వ. అదియెట్లనిన.

సీ. పరతెల్కపలివంశ వార్ధిసుధాంశుండు
కాశ్యపగోత్రప్రకాశకుండు

వేదవేదాంతప్రవీణాగ్రగణ్యుండు
సురుచిరాపస్తంబసూత్రఘనుండు
పరశివధ్యానానుభవమహాత్మ్యవంతుండు
హారహీరపటీరగౌరయశుండు
ప్రథితవనీపకారామవసంతుండు
కల్మషధ్వాంతతతి కర్తనుండు
సత్యసంధుండు సజ్జనసంగతుండు
ఘనసదాచారమార్గసంకలితుండగుచు
సిరులఁజెన్నొందు లింగార్య శేఖరుండు
మరలనతనికి లింగార్యమణి జనించె.

మ. కమనీయంబుగఁ గశ్యపర్షికదితీగర్భంబున న్వేడ్కతోఁ
గమలాప్తుం డుదయించుచందమున విఖ్యాతోదయుండై త్రివి
క్రమసాధ్వీమణియందు లింగసుధికి న్గల్గెం గులోద్దీపకుం
డమితప్రాభవుఁ డక్కనార్యమణి న్యాయామ్నాయశాస్త్రజ్ఞుఁడై.

ఉ. ధీవరులక్కనార్యునకుఁ దిర్మలదేవికిఁ గల్గి రాత్మజుల్
పావనుఁడప్పకొండ శివభక్తిధురీణుఁడు లింగసూరి పృ
థ్వీవరమాననీయులగు వేంకటరామత్రివిక్రమాహ్వయుల్
వావిరిఁ గీర్తిశాలి భగవానులనన్ జగతిం బ్రసిద్ధులై.

* * * *

క. ధర నాలింగసుధీమణి
కరుదుగఁ బుట్టిరిపు సుబ్బమాంబికయందున్
వరవేంకటనారాయణ
పురుషోత్తము లనుజులైరి భూరిగుణాఢ్యుల్.

ఉ. వారల కగ్రజుండ ననివారితశాంకర తత్త్వమార్గసం
చారవిలోలుఁడన్ గణితశాస్త్రవిధిజ్ఞుఁడ సజ్జనాప్తుఁడన్
ధారుణిఁ జెల్కపల్లికుల ధాముఁడఁ గశ్యపగోత్రుఁడన్ యశో
గారుఁడ రామలింగమను ఖ్యాతివహించినవాఁడ వేడుకన్.

తే. వేదవేదాంతవేద్యుండు విమలచరితుఁ
డాశ్రితావనతత్పరుం డైనశివున
కంకిత మొనర్ప సంకల్ప మాత్మఁ బొడమెఁ
గాన షష్ట్యంత పద్యషట్కము రచింతు.

క. భర్గునకు వినితదివిష
ద్వర్గున కాహార్యరాట్సుతామానసనం
సర్గునకు భక్తులసదప
వర్గునకుఁ గరేణుదానవవిసర్గునకున్.

* * * *

వ. ఇట్లంకితంబుగా నారచియింపంబూనిన సానందోపాఖ్యానంబు
నకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**Colophon:**

గద్య. ఇది శ్రీ మదుమామహేశ్వర కరుణాకటాక్ష సంజనిత కవి
తాపాండిత్య పరతత్త్వజ్ఞాన సమాశ్రిత సజ్జనసాంగత్య తెలికెపలి లింగ
నార్య కుమారక రామలింగభట్టారక ప్రణీతంబైన సానందోపాఖ్యానంబు
నందుఁ బ్రథమాశ్వాసము.

**End:**

మ. కరుణాహీనుఁడు ప్రాణిహింసకుఁడు దుష్కర్ముండు పాపక్రియా
నిరతుం డుద్ధతకోపసంగతుఁడు సన్నిందాపరుం డుగ్రని [ష్ఠురవాక్యుండు ఖలుండు నాస్తికుఁడు హ్రస్వ ప్రాణ్యుండు మూర్ఖాత్ముఁ]
నిరయావాసులు సుమ్ము నిక్కముగ మౌనివ్రాతచూడామణీ.

క. యమివర్య బ్రహ్మహత్యా
ప్రముఖమహాపాతక ప్రపంచమునకు నె
య్యమున నొక జాడ నిష్కృతి
యమరును విశ్వనితోఁబోరు నతనికిఁ దక్కన్.

క. పైతృక క్రియలవియెల్లను
పితసుకృతియగుచు సడల విడిచినవాఁడే
పాతకుఁడు సుమ్ము నారక
యాతనలను జెందునతఁడు యతిశార్దూలా.

క. ఆరయఁ గృతఘ్నమతులగు
వారికి విశ్వసితమానవప్రతతిపయిం
గూరిమిపాడమకయుండెడి
వారికి నిష్కృతులు లేవు వసుమతిలోనన్.

(వి-వి.)—

అసమగ్రము. మొదటనుండి తృతీయాశ్వాసము కొంతదాఁకఁ
గలదు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లెక్కువగాఁ గలవు. శైథిల్యము
గ్రంథపాతములు గలవు.

ఇది నె 868 దున వర్ణితమైన గ్రంథమునంటిదే. తెలికపల్లి రామలింగ భట్టారకు డు దీనికిఁ గర్త. ఆతఁడు కౌశికగోత్రుఁడు. సుబ్బమాంబకు లింగధీమణికిఁ గుమారు డు. శన్గక ? నృసింహానందనాథస్వామికి శిష్యుఁడు. ఈ గ్రంథ మెన్ని యాశ్వాసములుగలదో యెఱుఁగరాదు. ఉదాహృత పద్యములఁబట్టి గ్రంథకర్తనుగూర్చి విశేషము తెలియఁగనగును.

---

## No 873. సారంగధరోపాఖ్యానము.

## SĀRAṄGADHARŌPĀKHYĀNAMU

Substance, paper Size, 12⅝ × 7¾ inches. Pages, 234 Lines, 33 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper and the different readings are noted on the other side.

Wants the introductory portion ; otherwise complete.

Similar to the work described under R No. 166 of the Triennial Catalogue of Telugu Mss., Vol. II, Part III.

The plot of this poem is the well-known story of Sārangadhara His hands and legs were cruelly cut off at the command of his father Rājanarēndra on account of the misrepresentations made to him by his second wife Citrāngi that Sārangadhara compelled her to accept his love, though the fact was quite the reverse Sārangadhara, by the powers of a Siddha, got back his hands and legs ; meanwhile the king also came to know the truth, punished Citrāngi and repented for his folly. Rājanarēndra is said to have been the king of Rajahmundry and some of the places mentioned in the story are even now identified.

The author Cēmakūra Vēnkatarājakavi, known as Vēnkaṭakavi is made out from the colophon and dedicatory stanza, to be the author of Vijayavilāsa For other particulars see under the next No

చ. అనిగణుతింప నగ్గురుకులాగ్రణిసేవలు చాలఁజేసి దీ
వనలు వహించి పుణ్యులగు వారలకుం దన దివ్యమూర్తి కుం
భినిఁ గనిపింపుచుం దనదు పేరు దలంచిన వారికిన్ యశో
ధనములు గల్గఁజేయుచు సదా నుతుఁడయ్యెఁ జిరాయురున్నతిన్.

క. సారంగధరచరిత మె
వ్వారలు చదివినను వినిన వారికి సౌభా
గ్యారోగ్య పుత్రపౌత్ర
శ్రీరత్నధనాదివస్తు సిద్ధులుగలుగున్.

* * * *

అరాతిక్షమాభృద్భిదాం చక్ర పాణా
నరాధీశ్వరా కారనాళీక బాణా
స్థిరానందనా రామ సేవాధురీణా
విరాజచ్చతుష్షష్టి విద్యాప్రవీణా.

**Colophon :**

గద్య. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదలబ్ధ వాగ్వైభవచా (చే) మకూర లక్ష్మణామాత్య తనూభవ సదారాధిత బుధసమాజ వేంకటరాజ ప్రణీతంబైన సారంగధరోపాఖ్యానంబునందుఁ ద్వితీయాశ్వాసము సర్వము సంపూర్ణము.

(వి-వి.)—

పీఠిక తక్కఁ దక్కినదెల్లఁ గలదు. వ్రాఁత చక్కనిది. అది పత్రమున కొకవైపుననే కలదు. ఎదిరి పుటలలో పాఠాంతరములు చూపఁబడినవి. తప్పు లంతగా లేవు శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

మాళవదేశాధిపతియగు రాజనరేంద్రుని కుమారుఁడు సారంగధరుఁడు సవతితల్లియగు చిత్రాంగి మేడమీఁదవ్రాలిన తన పావురమును దెచ్చుకొఁబోఁగా నామె యాతనివలచి పైఁబడుటయు, నాతఁడు గర్హించి వెలికివచ్చుటయు నాచిత్రాంగి తన పెనిమిటియగు రాజనరేంద్రునితో సారంగధరునిమీఁదనే దోష మారోపించి చెప్పుటయు, దానిపై నాతఁడు కుమారుని కాళ్లు దెగనఱకించుటయు మీననాథుఁడను సిద్ధుని యనుగ్రహమున నాతఁడు చక్కఁబడి సిద్ధుఁడగుటయు మొదలగు కథ యిందు వర్ణితము. గ్రంథకర్త చేమకూర వెంకటకవి విజయవిలాస మీతనికృత్యంతరము. తంజావూరినేలిన తెలుఁగు నాయకరాజగు రఘునాథరాయల కిది యంకితము. అవతరణిక లేదుగాన విశేషవిషయము లిందు వివరింపఁగాదు. మఱికొన్ని విషయములకు నె 874 రు చూచునది.

## No. 874. సారంగధరోపాఖ్యానము.
## ŚĀRAṄGADHARŌPĀKHYĀNAMU

Substance, paper Size, 10¼ × 6½ inches Pages, 83 Lines, 19 on a page Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes. Short notes are found throughout the Ms. in Mr C. P. Brown's handwriting.

Incomplete and imperfect.

Same work as the above.

**Beginning :**

ఉ. శ్రీసతివక్షుఁడైన సరసీరుహనేత్రుఁడు విశ్వగాత్రుఁ డ
బ్జాసనపాకశాసన హుతాశనముఖ్య సురేంద్రరక్షితో
ద్భాసదయాసముద్రుఁడు సదానతరుద్రుఁడు భద్రుఁ డర్మిలిన్
భాసుర లీల లోకములఁ బ్రస్తుతికెక్కఁగఁ బ్రోచుఁ గావుతన్.

*  *  *  *

సీ. వరవేదశాస్త్రార్థ వల్మీకు వాల్మీకు
వాసుదేవస్తుతోల్లాసువ్యాసు
రమణీయగాత్ర ప్రభా(?)రవి భారవిఁ
గఱకంఠహృద్భాసుఁ గాళిదాసుఁ
బద్మాకటాక్ష సంభవభూతి భవభూతిఁ
దారిఱకచర్చితో ద్దండిదండిఁ
గలితశబ్దార్థ సంఘట్టు నన్నయభట్టు
భీమలబ్ధ కవిత్వ ధాముభీము
సుజననుతిరాజిఁ దిక్కనసోమయాజి
భూరి కవిరాజు బమ్మెరపోతరాజు
మొదలుగాఁగల సుకవుల సదమలముగఁ
దలఁచి యంజలిగావించి తగ నుతించి.

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన వందనంబునుం గావించి యే నొనర్పంబూనిన సారంగధరోపాఖ్యానంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

పా అం. ("అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన సారంగధర చరిత్రంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన" ఈ వచనమే సరియైనయెడల నవతారికలో గ్రంథము కొంత కొఱఁతగాఁ గనిపించును.)

సీ. ద్విజరాజవిలసనోత్తేజమై యుండియు
నక్షత్రశూన్య వన్యాశ్రయంబు
చక్రేశ్వరానంద సంయోగమయ్యును
బంకజవిధ్వస్త భానుగంబు
ఆర్యసంశ్రయధామమై యొప్పుచుండియు
విగతవిగాహాతు విమలతలము
శూద్రసత్తమ వర శోభితంబయ్యును
శూద్రకరహిత విశోకయుతము
భండదిశదండచండ దోర్దండపాలి
మలయమాళవదేశ సన్మధ్యమంబు
*　　*　　*　　*
సాంద్రవిభవంబు రాజమహేంద్రపురము.
క. రాజనరేంద్రుఁడు రిపుఫణి
రాజనరేంద్రుఁడు కళా పరాక్రమరేఖా
రాజిత భోగపరాజిత
రాజనరేంద్రుఁడు సుధాకరకులుం డలరున్.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. ప్రథమద్వితీయాశ్వాసాంతములందుఁ గొంతగ్రంథము కొఱఁతగాఁ గలదు. బ్రౌను దొరగారి టిప్పణి గ్రంథమున బహుస్థలములఁగలవు. కృత్యవతరణిక యింకేకాగితపుఁబుస్తకమునను లేదుగాన యిందది యసమగ్రముగనే యున్నను జూపఁబడినది. కథాంరంభవచనములు రెండు తెలుఁగులవి గలవు. ఇందుఁగల యవతరణిక యొక తెలుఁగు వచనమునకే సరిపడును.

పూర్వమువలె.

---

No **875.** సారంగధరోపాఖ్యానము.

SĀRAṄGADHARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, $17\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 51. Lines, 7 on a page. Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, good but full of mistakes and breaks off in many places.

Incomplete

This manuscript seems to be the original of the Ms. described under No. 874

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథపాతములును గలవు. ద్వితీయాశ్వాసాంత మందలి యించుమించు 20 పద్యములును దక్కఁగా మొదటి రెండా శ్వాసములును గలవు. ఈ రెండాశ్వాసములకును నడుమఁగొంత గ్రంథము గనిపించదు. గ్రంథ మాశ్వాస విభాగరహితమై యున్నది. వ్రాఁతయొక తరఁబడిగా నున్నదిగాని దోషభూయిష్ఠమై యున్నది.

ఇది నెం 873 దున వర్ణించిన గ్రంథమే. అంతేగాక యిది నెం 874 దున వర్ణించిన ప్రతికి మాతృకవలె నున్నది.

---

## No. 876. సారంగధరోపాఖ్యానము.

## SĀRAṄGADHARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 13½ × 1¼ inches. Pages, 174. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old Mode of writing, good but contains mistakes and breaks off in many places.

Wants the introduction, and 78 stanzas at the end; otherwise complete.

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. అవతరణిక లేదు. కడపట, 78, పద్యములు లేవు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాత ములు గలవు.

పూర్వము వలె.

---

## No 877. సారంగధరోపాఖ్యానము.

## SĀRANGADHARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, 16 × 1⅜ inches. Pages, 114. Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, bad, contains mistakes and breaks off in many places.

Wants the introductory portion; otherwise complete.

Same work as the above.

(ఖి-ఖి.)—

అవతరణిక సరియైనది లేదు. తక్కిన గ్రంథమెల్లఁగలదు. వ్రాఁత చక్కనిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు అమితముగాఁగలవు.

పూర్వమువలె.

---

## No 878. సారంగధరోపాఖ్యానము.

## SĀRAṄGADHAROPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 14¾ × 1¼ inches. Pages, 249. Lines, 4 on a page. Character, Telugu Condition, very much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Contains portions of the first and second Āśvāsa without the beginning and end.

Same work as the above

(ఖి-ఖి.)—

అసమగ్రము. ప్రథమాశ్వాసమునఁ గొంచెమును, ద్వితీయతృతీయాశ్వాసములునుగలవు. ఆశ్వాసాద్యంతములును లేవు. వ్రాఁత తిన్ననిదే. తప్పులుచాలఁ గలవు. శైథిల్యము మిక్కిలి హెచ్చు. గ్రంథపాతములు పెక్కులు.

పూర్వమువలె.

---

## No. 879. సారంగధరోపాఖ్యానము.

## SĀRANGADHARŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, 9¾ × 6 inches. Pages, 137. Lines, 26 on a page Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, good but full of mistakes and breaks off in many places.

Wants the introductory portion, otherwise complete.

Same work as the above.

A note apparently in the hand of Mr C. P Brown appears at the beginning of the work.

"This volume contains three poems. Sarangadhara Padya Cavyam, Ratnavali Parinayam in Telugu. Ratirahasyam in Sanskrit."

All these are transcribed from old manuscripts that were very imperfect and the copies were taken only for the sake of comparing the text. Of the Saranga Dhara I have a separate critical edition.

Of the other two books . . . my only copy. At the end of the work it is stated in Telugu language that the Ms under notice was compared by Krsnayya and Kondalrāyadu on the 26th day of September 1829 A.D

(వి-వి.)—

అవతారిక తక్కఁదక్కిన గ్రంథ మెల్లఁగలదు. గ్రంథపాతములు నక్కడక్కడఁగలవు. వ్రాఁతబాగుగా నున్నదిగాని దోషములు హెచ్చు.

మిక్కిలి శిథిల మగుటచేత కాగితములు ముక్కలుగాఁ బడిపోకుండుటకై సన్నని కాగిత మందలి ప్రతి పత్రమునకు నతికింపఁబడియున్నది.

పూర్వము వ్రాఁతే.

---

## No. 880. సారంగధరోపాఖ్యానము.

## SĀRAṄGADHARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 16 Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes.

Incomplete and imperfect.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథపాతములకు లెక్కయే లేదు. ప్రథమాశ్వాసమందు 106 మొదలు 163 వఱకు నుండు పద్యములు మాత్రము గలవు. వ్రాఁత యొక మాదిరిగా నున్నదిగాని తప్పులకుప్ప.

పూర్వము వ్రాఁతే.

---

## No. 881. సారంగధరోపాఖ్యానము (సటీకము).

## SĀRAṄGADHARŌPĀKHYĀNAMU (with commentary).

Substance, paper. Size, $12\frac{3}{4} \times 9\frac{5}{8}$ inches. Pages, 358 Lines, 20 on a page. Character, Telugu Condition; injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Same work as the above, but contains also the commentary, which has been written in a peculiar sort of colloquial language.

It is stated that the transcription of the Ms under notice was finished on the 29th day of May 1843.

**Beginning :**

**Text :—**

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పఁబూనిన సారంగధర చరిత్రంబను మహాప్రబంధంబునకుఁ గథాప్రారంభం బెట్టిదనిన.

**Comment :—**

టీ. అభ్యుదయ । అధిక శ్రేయస్సులయొక్క । పరంపరా । సముదాయమునకు । అభివృద్ధిగా । అభివృద్ధియగునట్లు । నా । నాచేయొనర్పంబూనిన । నేను చేయనుద్దేశించినటువంటి సారంగధరచరిత్రంబను । సారంగధరుని కథారూపమనె । మహా । గొప్పదియైన । ప్రబంధంబునకు । కల్పించిన కథలు గల గ్రంథమునకు । కథాప్రారంభంబు । కథారంభము । ఎట్టిదనిన । ఎటువలెనంటేను

**End :**

**Text :—**

క. సారంగధర చరిత్రమె
వ్వారలు చదివినను వినిన వారికి సౌభా
గ్యారోగ్యపుత్రపౌత్ర
శ్రీరత్నధనాదివస్తు సిద్ధియుఁ గలుగున్.

**Comment :—**

టీ సారంగధరచరిత్రము । సారంగధరునియొక్క కథను । ఎవ్వారలుచదివినను । ఎవ్వరు పఠించినను । వినిన । ఆకర్ణించినను । వారికి । ఆ చదివిన విన్నవార్లకు । సౌభా . . . ద్ధియు । సౌభాగ్య । ఐశ్వర్యమున్ను । ఆరోగ్య । నిరోగత్వమున్ను । పుత్ర । సుతులున్ను । పౌత్ర । మనమలున్ను । శ్రీ । సంపత్తున్ను । రత్న । రత్నములున్ను । ధనాదివస్తుసిద్ధియు । ద్రవ్యము మొదలైన వస్తుప్రాప్తియు । కలుగును । సిద్ధించును.

**Text :—**

భు. అరాతిక్ష్మాభృద్బిదాంచత్కృపాణా
నరాధీశ్వరాకార నాళీకబాణా
స్థిరానందనారామ సేవాధురీణా
విరాజచ్చతుష్షష్టి విద్యాప్రవీణా.

**Colophon :**

**Text :—**

గద్య. ఇది శ్రీ సూర్యనారాయణ వరప్రసాదల . . . . . భావ చేమకూర లక్ష్మణామాత్యతనూభవ బుధసమాజ వేంకటరాజప్రణీతంబైన సారంగధరోపాఖ్యానంబునందుఁ ద్వితీయాశ్వాసము.

(బి-బి.)——

ఆసమగ్రము. ఉపక్రమ ... గ్రంథమెల్లఁగలదు. ప్రతి పద్యము క్రిందను టీక గలదు. వ్రాఁత చక్కనిదే. తప్పులు గలవు.

ఇది నెం 873 రున పన్నెండవ ... యుండు టీకకూడ గలదు. టీక రచించినవా రెవరో యెఱుఁగరాదు.

---

### No. 882. సింహాసనద్వాత్రింశత్తు.
### SIMHĀSANADVĀTRIMŚATTU

Substance, paper size, $12\frac{1}{4} \times 7\frac{5}{8}$ inches Pages, 475 Lines, 21 on a page. Character, Telugu Condition slightly injured Mode of writing, good but contains few mistakes and breaks off in some places Written on only one side of the paper.

A poem in 12 Āśvāsas narrating the 32 stories relating to Vikramāditya, as told by the 32 dolls on the throne of Vikramāditya to King Bhōja while he attempted to ascend it For further information see Mr. C P. Brown's notes incorporated in No 884 The author Gōparāju of Haritasa gōtra was the son of Kēśavarāju who was the son of Gōpana, grandson of Singana and great grandson of Amarēśvara, who was the son of Koravi Vennaya. Vennaya had the titles of Rāyagajagandhavārana Vairimāṇḍalikabhēkaphanīndra, Kalingadēśanirdhūmadhāma, Vīragōttavibhāla, etc. It is stated that he reinstalled the King of Velanādu and was very much honored by certain chiefs such as Peddirāja, Mallava Dēvarāju of Pallikonda, etc. For other particulars see the extracts given below.

Notes in English are found here and there in Mr C P. Brown's handwriting. Different readings are interlined, and also written on separate slips which are inserted in their appropriate places

**Beginning :**

శా. శ్రీమత్పర్వతనందనీతనుల తాశ్లిష్టాంగమై బాహుశా
ఖామధ్యంబుననున్న పన్నగఫణా ఘంటాకులై [illegible]
ద్దామంబౌ శశిరేఖ పుష్పరుచి నొందంగా జటాపల్లవ
స్తోమంబౌ హరపారిజాతము భజింతు న్వాక్ఫలావాప్తికిన్.

*  *  *  *

క. ఆభారత పర్వత్రయ
మీభారతపర్వ మెల్ల నెలుఁగఁ దెనుఁగునన్
శ్రీభారతిగతిఁ జెప్పిన
నా భావకు (భారతుం) డనితలంతునన్నయభట్టున్.

క. వే(లే ?) ములవాడ (ర) క సుఖినైయె
వే (లే ?) ము(మ) లవాడఁజరిం చి(చు) వే (లే ?) ములవాడన్
దా మెఱసినభీముని నుత
భీముని బలభీము విమత భీముఁ దలంతున్.

ఉ. అనఘు హరిహరకీర్తి భాసురు మహామతిఁబిల్లలమఱ్ఱి పెద్ది (వీర) రా
జును ఘనునాగ (చినవీర) రాజుఁగవి సోమునిఁదికరాన సోమయాజిఁ గే
తనకవి రంగనాధు సుచితజ్ఞుఁని నెఱ్ఱి (ర్ర) న నాచిరాజు సో
మనసమరేశ్వరుందలఁతు మతుకలచంద్రుల సత్కవీంద్రులన్.

వ. అని . . . . ప్రశంసించి తత్పి సాదాసాదిత
సహజ సాహిత్యతరంగితాంతరంగుండనై . . . .

* * * *

వ. . . . . . సింహాసన ద్వాత్రింశత్కథా కథనమూల
కారణంబైన యంబికారమణుండును మత్కవితాసంపద్విధాయకుండగు
లక్ష్మీనాయకుండును గావ్యనాయకులుగా నియమించుటంజేసి.

సీ. . . . . . . . .
సగముపాడవునఁ జెలువు నా సగము నలువు
నయ్యు మెడనొకకవన్నియ యగుచుమేను
లెనయ ముకరింటియును వెన్నుఁడునునసంగఁ
బొలుచు వేల్పు నాకబ్బంబుఁ బ్రోచుఁగాత.

క. తత్పదపద్మారాధన
తత్పరులను రాజమంత్రి ధర్మజ్ఞుల మా
సత్పురుషుల వర్ణించెద
మత్పారంపర్య మొకక్రమంబునఁ దెలియన్.

సీ. కలుషమండలిక భేక ఫణీంద్రుఁ డనరాయ
గజగంధవారణ ఖ్యాతిమెఱసి
పిరగొట్టబిభాళుఁ డారూఢ బిరుదవి (ని)
రోధి కళింగ వి(వి)రోధియనఁగ
వెలసి నానాటికి వెలనాటిపృధ్వీశ్వ
రుని రాజ్యభారధురుం డనంగ
నారెలుఁ గన్నడీ లఱవలుఁ దెలుఁగులుఁ
దనబిరుదందియఁ దగిలికొలువ
నెగడెఁ జందవోలు నెలవుగా భూసుర
వంశసాగరామృతాంశుమూర్తి

చక్రవర్తిమాన్య సౌజన్యధన్యుండు
విక్రమార్కనిభుఁడు వెన్నవిభుఁడు.

* * * *

క. అమరఁగ వెన్నయమంత్రికి
నమితశశాంకకీర్తి పాత్రుఁడై పౌత్రుండై
యమరేశ్వర మంత్రినిభుం
డమరేశ్వరమంత్రి వెలసె నార్యులు వొగడన్.

క. సంగతి నమరేశ్వరునకు
గంగాంబకు బుట్టిన(ర?)ట్టిఘను లన్నయయున్
సింగయమంత్రియుఁ దమలో
నంగీకృత రామలక్ష్మణాకారులనన్.

ఉ. అన్నయ(మ ?) నామధేయసచివాగ్రణి పుత్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధిపల్లి(వల్లి ?) కొండ జనపాలుఁడు మల్లినదేవరాజుచే
నెన్నఁగ గుంటెలందలము నెల్లియుఁ గైకొనిమంత్రియై ప్రతా
పోన్నతికెక్కె ధర్మముల నొప్పెడు బ్రహ్మకుల ప్రతిష్ఠలన్.

చ. అనఘులు సింగనార్యునకు నబ్బయగోపయ మంత్రి సత్య నా
రనయనఁగల్గి రాత్మజులు రాములు మువ్వురు దోఁచినట్లు పెం
పున వెలయంగ నబ్బయకుఁ బుత్రులు పుట్టిరి రామరాజుఁ గే
స(క్ష)నయును బాచిరాజు గుణసాంద్రుఁడు సింగనయుం గ్రమంబునన్.

క. ఘను లగ్రజులకు నీడై
వనములు క్రతు(ఁబెరు)వులును కృతులు వరుసనిలిపి బా
చనయును సింగనయుం దగ
రనపోతకుమారసింగయకు మంత్రు లనన్.

క. రామాయణ కృతికృ(ప)తియై
తా మెఱయుచు నాంధ్రకవి పితామహుఁ డనఁగా
భూమిని బిన భీమనయును
నామంబునఁ బరగె సత్యనారన కవియై(ఘనుఁడై).

ఉ. నారన కగ్రజుండు సుగుణజ్ఞుఁడు గంగమసింగమంత్రికిన్
గూరిమిపట్టి నాఁబరగు గోపన(య)మంత్రి నిజానువృత్తినిం
పారెడు నెల్లమాంబిక కులాంగనగా నుతికెక్కె దాన(ర)తా
రారుచికీర్తి యాకన(సు)వరాజతనూజుఁడుగాఁ బ్రసిద్ధుఁడై.

వ. ఇట్లు గోపరాజు తనూజుండైన కసు(స)వరాజు దానగుణరాధే
యుండగు రాణామ(ణివ)ల్ల నరేంద్రునకుం బరమ గురువై శైవాచార
ప్రథమసింహాసనాధీశ్వరుండైన బ్రహ్మదేవపడి(ప్రవాడ)యలకూంతురు కా
మాంబిక యను కామినీరత్నంబును గా మించి పరిగ్రహించి సుగుణగణగ
ణ్యుండై నెగడె.

* * * *

ఆ. వేముగల్లు జన్మసీమ గాంజెలిగియు
నీవు లెల్లమాటం జేటపజని (నేటి న్నపుటమాట గీటుపటిచి)
హరిపదైక బుద్ధి హరితసగోత్ర
రాజనంగం గసువ(గోప) రాజు మించె.

వ. ఇట్టి మంత్రి శిఖామణికి నునికిపట్టైన పట్టణం బెట్టిదనిన.

శా. రాణామల్లన (నాణవల్లన) కీర్తిచంద్రికలు పర్వంబొంగి మధ్యా
(సుద్యా?) శ్రిత
క్షోణీభృత్తన దుర్గమై గుణమణిస్తోమంబుల న్నిండి యు
క్షీణశ్రీపురుషోత్తమాశ్రయమ్మునై చెల్వారి హానామృత
శ్రేణిం గ సముద్రనామము వహించె న్వేముగల్లిమ్మహిన్.

వ. అట్టి పురంబునందు.

క. పూజితులగు కవులకృపన్
భ్రాజిష్ణుండై గొంత యాంధ్రభాషావిదుండన్
రాజహితుండైన కసువయ
రాజతనూభవుండ గోపరాజను వాండన్.

శా. చిత్రఖ్యాతివిదీర్ణ విక్రమ ధిశ్రీవిక్రమాదిత్య చా
రిత్రా(త్ర)ఖ్యాపన శాసనంబులకు భూరిస్తంభసంభారమై
ధాత్రీపాలురం గావ్యవేదులును మోదంబొంద సింహాసన
ద్వాత్రింశత్కథలాను (బుంగుణంబులు)గుణ్యాముగం గావ్యంబొ
ప్పుగాం జెప్పెదన్.

**End:**

మ. అనుచుం జెప్పిన సద్ద్విజాతమిగులన్ హర్షించి యో దేవ యే
నునుపూర్వంబునం గొంత వింటిం బిదప న్నూత్నప్రసంగంబునన్
వినని పోగతి నేండు విస్తరముగా వింటి న్మహావీరుండా
తని సామర్థ్యము నీప్రసాదమునం జిత్రం బయ్యె మృత్యుంజయా.

* * * *

మా. నవహీరాంకుర కర్పూరము కందిత్తో దు క్ష్మారాటా
జవనవ షభ హా శ ఖచ కదేశా
ధవళతర(విజ)తకిరా దా . కృష్ణ నకొరా
శివమురహ్ఫ రూపా శిష్ట పక్ష వాపా.

**Colophon :**

గద్య. ఇది రాయగజగంధవారణవైరిమండలిక భేకఫణీంద్ర వీరఘోర (గో) ట్టవిభాళాదిబిరుద ప్రకటచారిత్ర కళింగదేశ నిర్ధూమధామ త్యాగనాగార్జున కర్ణాట ద్రావిళాంధ్ర మహారాష్ట్ర భూపాలరూప నూపురసుందర చరణారవింద (చ) దవర ప్రవోలి పురాధీశ్వర వెలనాటి పృథ్వీశ్వరరాజ సముద్ధరణకొఱవి వెన్నయామాత్య హా తపాంత ఫగోత్ర పవిత్ర సకలసుకవి జనమిత్ర వసువరాజతనూజ గోపరాజ విరచితంబైన సింహాసనద్వాత్రింశతి(క)యను కావ్యంబునందు (విక్రమార్కచరిత్రయందు) . . . . . సర్వంబును ద్వాదశాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పు లల్పముగాఁ గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతము లత్యల్పముగాఁ జిన్నచిన్నవి అక్కడక్కడగలవు. 114 పత్రములదాఁక కాగితమున కొక్కప్రక్కనే గ్రంథము వ్రాయఁబడెను. తర్వాత రెండు ప్రక్కలను వ్రాయఁబడెను. వ్రాయని ప్రక్కలలోఁ గొన్నింటఁ బాఠభేదములును బ్రౌను దొరగారి టిప్పణులునుగలవు. పెక్కు పాఠభేదములు పెక్కులు బంతుల నడుమ నిఱికింపఁబడినవి. ఇవి అక్కడక్కడ క్రొత్త కాగితపుఁ జీలికలమీఁదఁ గూడ వ్రాసి యదికింపఁబడినవి.

ద్వాత్రింశత్సాలభంజికల కథలను పేర దేశభాషలలోను, సంస్కృతమునను వచన రూపమునన్న కథల ననుసరించి కొఱవి గోపరాజను కవీశ్వరుఁడు పండె డాశ్వాసముల యీ మహాప్రబంధమును రచియించెను. ఇందు అనుప్రాసక్తము నొక కథలో నంధ్ర కవితా యతిప్రాసాది లక్షణములు సుకవితో దాహరణము నిఘంటూదాహరణము మొదలగునవి చెప్పఁబడినవి. ఈ ప్రతిలోఁ ననేక పాఠభేదములు సమకూర్పఁబడినవి. గ్రంథకర్తయగు కొఱవి గోపరాజు వేములగల్లు పురవాస్తవ్యుఁడు. రాణా మల్లనకేంద్రుని మంత్రియగు వసువరాజుకుఁ గొమారుఁడు. గ్రంథకర్త కేశవతరమువాఁడగు వెన్నమంత్రి వెలనాటి

పృథ్వీశ్వర భూపాలుని రాజ్యము నుద్ధరించిన మంత్రివర్యుఁడు. మఱియు గ్రంథకర్త పిన్నతాతయగు సత్యనారన రామాయణ కృతిని రచించి (పాఠ భేదములుగలవు. కృతికృతియని, కృతిపతియని) ఆంధ్రకవి పితామహుఁడని పేరందెను మఱియు గ్రంథకర్త పెద్ద తాత కొడుకులు బాచిరాజు, సింగన, యనువారు, అనపోత భూపాలుని కుమారుఁడగు కుమారసింగ భూపాలునికి మంత్రులై యుండిరి. వారి వంశవృక్ష మిట్టిది :—




[1] ఈ వెన్నమంత్రి కలుషమాండలికభేకఫణీంద్రుఁడు, రాయగజగంధవారణము, వీర గోట్టువిభాళుఁడు, ఆయూథబిరుదవిరోధి, కళింగవిరోధి, వెలనాటిపృథ్వీశ్వరరాజ్యభారధురంధరుఁడు, చందవోలువాస్తవ్యుఁడు.

[2] ఈ పెద్దిరాజు పల్లికొండరాజగు మల్లనదేవరాజుచే సమ్మానితుఁడు.

[3] ఈ సత్యనారన రామాయణకృతిక(భ?)ర్త, ఆంధ్రకవిపితామహుఁడు, పినభీమన, అని బిరుదులుగలవాఁడు.

[4] రాణామల్లనరేంద్రునిగురువును శైవాచారప్రథమసింహాసనాధీశ్వరుఁడునునగు బ్రహ్మదేవవొడియలకూఁతునుగామాంబను బెండ్లాడెను. వేములపల్లినగరమున రాణామల్లనరేంద్రునిమంత్రియై నెగడెను.

[5] బాచిరాజు, సింగన, యని పేరుగల యీయిర్వురు ననపోతకుమారసింగభూపాలుని మంత్రులు.

[6] ఈతఁడేయేతత్కృతికర్త.—కవిస్తుతిలోనిందు పిల్లలమఱ్ఱి పెద్దిరాజు, పినవీరరాజు గూడ స్తుతింపఁబడిరి.

## No 883. సింహాసనద్వాత్రింశత్తు.
## SIṀHĀSANADVĀTRIṀŚATTU.

Substance, palm-leaf. Size, $16\frac{1}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 90 Lines, 7 on a page. Character, Telugu Condition, slightly injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion and breaks off in the third Āśvāsa

Same work as the above.

At the end of the work there are four stray leaves containing two stanzas in praise of Vatsarāya Gajapatīśvara, one song narrating the story of the Rāmāyaṇa, one song addressed to Lord Kṛṣṇa and one song in praise of Ganapati

(వి-వి.)—

అసమగ్రము. అవతారిక లేదు. తృతీయాశ్వాసారంభముదాఁకఁగలదు. వ్రాఁతమంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

ఈ గ్రంథాంతమున నాల్గుపత్రములమీఁద నీ క్రిందివిషయములు గలవు. వత్సవాయరాయ జగపతీశ్వరుని ప్రశంసాపద్యలు రెండు, ఒక కావ్యారంభపద్యము, రామాయణకథాసంగ్రహముగు నొకపాట, కృష్ణునిమీఁదిదొకపాట, విఘ్నేశ్వరునిమీఁదిదొకపాట.

---

## No. 884. సింహాసనద్వాత్రింశత్తు.
## SIṀHĀSANADVĀTRIṀŚATTU.

Substance, paper Size, $11\frac{3}{4} \times 9\frac{1}{2}$ inches. Pages, 366. Lines, 19 on a page. Character, Telugu. Condition, good. Appearance, new. Mode of writing, good and almost free from mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Same as the above

The following note by Mr. C P Brown appears in the beginning of the Ms —

"This is the new edition of the Vicramarca Tales, or Tales of the Throne, in stanzas in twelve books.

This edition was duly corrected by the editor Narasimhachari under my directions, in the year 1842".

"C. P Brown"

"The style of the poem is much admired but most of the stories are deplorably silly and all turn upon the prodigious sanctity of

Bramins. Many are nasty enough, though not nearly so filthy as the stories in the Mahabharat and the Bhagavat."

* * * *

There are some blemishes in the style of this poem. In my Dictionary this author is referred to by the letter G."

(వి-వి.)——

సమగ్రముగాఁగలదుగాని కృత్యవతరణిక మాత్రము వ్రాయక విడువఁబడినది. వ్రాఁత చక్కఁగానిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము, గ్రంథపాతములు, లేవు. ఈ ప్రతి 1843 వ సం॥ మే నెల 5 వ తేదికి ముగిసినదట !

పూర్వమువోలె.

నెం 882 రు ప్రతి కిది పేర్పువ్రాఁత. ఈ ప్రతిని దమకోరిక ప్రకారము నరసింహాచారి 1842 వ సం॥న సంగ్రహించి వ్రాసెనని యది మొదలుగా బ్రౌనుదొరగారు ఇంగ్లీషున వ్రాసిన దిందునఁజూపఁబడినది. బ్రౌను దొరగారి నిఘంటువునందిది G అనుగుర్తుతోఁ దెలుపఁబడినదట !

గ్రంథాంతమున విషయసూచిక 40 పుటలలోఁగలదు.

---

## No 885. సింహాసనద్వాత్రింశత్తు.

## SIṀHĀSANADVĀTRIṀŚATTU.

Substance, paper. Size, $12\frac{3}{4} \times 7\frac{7}{8}$ inches. Pages, 463. Lines, 22 on a page. Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, fair and free from mistakes. Breaks off in some places.

Wants the introductory portion, otherwise complete.

Same work as the above.

At the end of this Ms 44 pages contain the index of this work.

Date of transcription :—The 29th day of December 1842 A.D.

(వి-వి.)——

సమగ్రము. కాని కృత్యవతరణిక మాత్రము లేదు. వ్రాఁతమంచిది. తప్పులంతగా లేవు. శైథిల్యము లేదు. అక్కడక్కడ చిన్న గ్రంథపాతములున్నవి.

పూర్వమువోలె.

గ్రంథాంతమున 43 పుటలలో నీగ్రంథపు విషయసూచికకలదు. అది 1842 వ సం॥ డిసెంబరు 29 వ తేది నాఁటికి ముగింపఁబడినదట !

## No 886. సింహాసనద్వాత్రింశత్తు.
## SIMHĀSANADVĀTRIMŚATTU.

Substance, palm-leaf. Size, 15 × 1¼ inches. Pages 376. Lines, 6 on a page. Character, Telugu Condition very much injured Appearance, very old Mode of writing fair but not free from mistakes

Fragmentary and imperfect

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. ఆదినుండి ఏకాదశాశ్వాసమునఁ గొంత దాఁకఁ గలదు. వ్రాఁతమంచిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు అమితముగానున్నవి. పత్రములెల్లను గొంతకొంత త్రుటితములయియున్నవి.

పూర్వమువలె.

---

## No 887. సిరియాళచరిత్ర.
## SIRIYĀLACARITRA.

Substance, palm-leaf Size, 16½ × 4⅝ inches Pages, 13. Lines, 4 on a page. Character, Telugu. Mode of writing, not good and contains mistakes Breaks off in many places

Contains the first Āśvāsa incomplete.

Similar to the work described under R No. 278 of the Triennial Catalogue, Volume II, Part III; by Tammaya

**Beginning:**

శ్రీనగమందిరుం దనుజశిక్షమహోన్నతుఁ బార్వతీపతిన్
భానుమహోగ్రదీప్తు నత భక్తగృహాంగణ పారిజాతమున్
దీనదరిద్రసంతమసదీప్తికి చంద్రమచంద్రకోజ్జ్వలున్
మానుగమాకు నెల్లప్పుడు మంగళమిచ్చు ఘనంబుగైవడిన్.

ఉ. వారికి నగ్రజన్ముఁడు శివాంఘ్రిసరోరుహమత్తభృంగుఁడున్
ధారుణిపైఁబ్రసిద్ధుఁడును(సుధాకర)ను దారకదీప్తుఁడు లింగనిష్ఠుఁడున్
సారవిచారచిత్తుఁడును శాంభవ ముద్రకు నంతరంగుఁడున్
వారకజ్ఞానయోగరత . , వాండు . తమ్మయయంద్రుడున్ బుధుల్.

**End:**

ఆడపంబుగిండియు హస్తంబులంబట్టి యాడిగంబులనుండువారును, పరిమళ వ్రాతసంభరితపేటికలు ధరించి నిలుచువారును, నిల్వుటద్దంబుల

లో శృంగారంబులం జూచుకొనుచు భర్తలకింపుగ మెలంగువారును

. . . .

(వి-వి.)—

ఈసమగ్రము ప్రథమాశ్వాసమేని కడముట్టలేదు. వ్రాఁత మంచిదిగాదు. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు పెక్కులు గలవు.

కాంచీపురవాస్తవ్యుఁడగు చిఱుతొండభక్తుఁడు తన కుమారుఁడగు సిరియాలుని శివయోగి వేషధారియగు శివునికి ఆహారముగా వండిపెట్టి శివలోకమునకు సకుటుంబ పరివారముగా వేంచేసిన కథయందు వర్ణితము గ్రంథకర్త తమ్మయ . అల్పభాగము మాత్రమే యుండుఁగలదు . గాన విశేషము తెలియరావు.

---

## No 888. సీతావిజయము.

## SĪTĀVIJAYAMU.

Substance, paper. Size, 8¼ × 6½ inches Pages 293 Lines, 15 on a page Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, good but full of mistakes. Written on only one side of the paper.

Wants the introductory portion, otherwise complete

Same work as that described under R Nos 625 and 742 of the Triennial Catalogue of Telugu Mss Volume IV, Part III.

Date of transcription —August 1832 Compared by Vāraṇāsi Rāmasvāmi and Korrapāti Cannappa

(వి-వి.)—

సమగ్రమే కాని గ్రంథావతరణిక కొఱఁత. వ్రాఁత మంచిదే. తప్పులు చాలఁగలవు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది ఆర్. నె 625, 742 రులందు వర్ణితమైన గ్రంథమే. ఇదుఁగూడఁగృతిపతి పేరు భోగయగా మార్పఁబడినదిగాని, యతిస్థలమున "సారకీర్తి విశాలపోచమనృపాల" యనిదిద్దపిలుగాని విధమున నుండుటచేనది యస్లే విడువఁబడినది. కృతిపతిపోచయనృపాలుఁడేయగును.

గ్రంథాంతమున నీ వ్రాఁత కలదు :—

"ఆగస్టు ఆన 1832 వ సంవత్సరం మొకాబిలా చేయడమైనది. వారణాశి రామస్వామి వ్రాలు. కొఱ్ఱపాటి చన్నప్ప వ్రాలు."

## No 889. సీతావిజయము

## SĪTĀVIJAYAMU.

Substance, palm-leaf. Size, 16¾ × 1¼ inches. Pages, 74. Lines, 5 on a page Character, Telugu Condition, much injured Appearance, very old Mode of writing, good and free from mistakes.

Incomplete

Similar to the work described above. The work under notice has been dedicated to God Rāmalingēśvara, worshipped in the place where the river Kauśikī joins the sea

**Beginning :**

క. శ్రీపార్వతీమనోహర
. . . . చి
ద్రూపజగన్మయభూతివి
లేపనధవళాంగ రామలింగ మహేశా.

వ. దేవాయవధరింపుము రోమశమహామునింగని ధర్మరాజతివినయంబున మ్రొక్కి సీతావిజయకథాశ్రవణ కుతూహలుండై శతాననవధప్రకారంబువినవలతుం జెప్పవే యని యడిగిన సంతోషించి వసిష్ఠ రామాయణంబునందుఁ జెప్పంబడిన సీతావిజయంబు చెప్పఁదొడంగె నది యెట్టిదనిన.

గీ. వినుము రఘునాథ దశముఖుంజననము నకు
సంతసం బేల వినవయ్య సకల లోక
దారుణుండైన వాఁ డొకఁడు దానవుండు
శతముఖుం డింద్రవిద్వేషి సాంద్రబలుఁడు.

**End :**

శి. సకలవంద్య విష్ణుసంవేద్యనాయక
రామలింగ యక్షరాజసంగ
కాలకంఠదేవ కౌశికాసాగర
సంగతీరవాస జగదధీశ.

మాలిని.

నిగమనియతఘోటా నీరజారిందుజూటా
నగపతిశరచాపా నవ్యధామస్వరూపా
సుగుణభుజగహారా సుందరీమానచోరా
యగణితబలశీలా యద్రిజామానలోలా.

(ఐ-ఐ.)—

అసమగ్రము. ప్రాఁతే చిన్నదిది. తప్పులంతగా లేవు. శైథిల్యము గలదు. గ్రంథపాతము అల్పముగాఁ గలదు.

ఇది పూర్వవర్ణితముకంటె వేఱయినది. గ్రంథకర్త పేరెఱుఁగరాదు. గోదావరి శాఖయగు కౌశిక సాగరముతో సంగమించుచోట గల విష్ణుసంవేద్య క్షేత్రమున వెలసిన రామలింగేశ్వరస్వామి కిది యంకితము. ఇందును శతముఖ రావణుని సీత సంహరించుకథయే వర్ణితము.

---

No. 890. సుకుమారీపరిణయము.

SUKUMĀRĪPARINAYAMU

Substance, paper Size, 11⅜ × 6⅞ inches. Pages, 167. Lines, 25 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, bad and full of mistakes

Begins on Foll. 1(b).

Complete

A poem in four Āsvāsas describing the story of the marriage of Nārada with Sukumārī, daughter of Sr̥ñjaya, king of Ayōdhyā. The author Akkmapalli Narasimhakavi, son of Jōgayāmātya of Kaundinya gōtra wrote this work at the instance of Ākumūri Tirupatipradhāna. The author was a devotee of Ellamanda Kōtīsvara For other particulars see the extracts given below

**Beginning:**

శా. శ్రీకపికుచదుర్గసీమ విహరిం శ్రీదేవి కాత్మీయవ
క్షోదేశంబు నివేశతల్పమయి శో భిల్లఁ గ్రీడారసా
స్వాదస్ఫూర్తి త్రిలోకసౌఖ్యకరుఁడు కంజాతాక్షుఁ డెల్లప్పుడా
హ్లాదంబొప్పఁగఁ బ్రోచుతం దిరుపతిం బ్రధానామాత్యచూడామణిన్.

* * * *

సీ. . . . . . . . . .
శ్రీమదాకూరివంశాబ్ధిసితకరుండు
శ్రీకరుం డాశ్రితాబ్జప్రభాకరుండు
ప్రాజ్యసామ్రాజ్యలక్ష్మీనివాసలసదు
పేంద్రుఁడగు తిరుపతి పధానేంద్రుఁ డెలమి.

క. ననుఁ గోటీశ్వరకరుణాం
జనలబ్ధకవిత్వనిధిని, జయ్యన్ననఁ బిలిచి గా

బరిచి కృపతోడఁ బలికెను
డనమృదువాక్సరణి బుధవితానము పొగడన్.

క. ధన్యుఁడవు సకలబుధజన
మాన్యుఁడ వకళంకసుకృతిమహితసుగుణసౌ
జన్యుఁడవు ప్రథితకవితా
కన్యుఁడవు నృసింహనామకవివర దలఁపన్.

*     *     *     *

ఉ. పాలితభక్తజాలుఁడు కృపాళుఁడు ప్రేమ వసిష్ఠగౌతమీ
కూలము మాధవాఖ్యపురి కుంభినిపై వెలిదీవియు న్వికుం
ఠాలయమట్లు పెంపెసఁగ నాతతవైభవశాలి రాజగో
పాలుఁడనం బ్రశస్తనుతి భాసిలుచుండె దయాంబురాశియై.

*     *     *     *

తే. శ్రీకరంబుగఁ జెలువొందె యాకునూరు
కులము తామరతంపరవలె ధరిత్రిఁ
బరగుతత్కులవరసరో వరము వెలయ
నుదయ భాస్కరుఁడన రాయ లుదయమయ్యె.

*     *     *     *

ఉ. శ్రీయుతశాలిసద్గుణకళశేష మిళద్వరశీలి ధారుణీ
నాయకమాన్యకేళి రిపునాయకకాననకీలి ధార్మికో
పాయకమౌళి బంధుజనపద్మవనాంచితహేళి యైన యా
రాయలమంత్రి యుక్తులకు రాయలమంత్రిధరాతలంబునన్.

*     *     *     *

క. ఆ రాయమంత్రిశేఖరు
నారీమణి బాపమాంబ నయయుతగుణ ల
క్ష్మీరమణీమణి కైన యనఁ
గా రమణీయమమఁగ వినుతి గని వర్ధిల్లెన్.

*     *     *     *

శా. ఆరాజీవనిభాస్యయందుఁ గనె రాయామాత్యుఁ డౌదార్య వి
ద్యాగాధేయుని సూరరాయు నఁ జిన్నయ్యాఖ్యు సన్నీతి వి
స్తారు న్మేరునగేంద్రధైర్యు విబుధస్వస్థానభూదానగో
ధారానిర్జరవర్ధితాఖిల సముద్రప్రాప్తగాంభీర్యునిన్.

*     *     *     *

క. ఆ సూరరాయసచివ సు
నాసీరునికొమ్మ విమలనానాసుగుణో
ల్లాసోరుసితాంశుకాంతి ద
యా సరసస్వాంత పార్వతమ్మ తలంపన్.

* * * *

క. ఆ రామభక్తినిపుణుం
డారామారత్నమందు నాత్మసమానా
కారున్ లక్ష్మీపతియను
సారమతిన్ గాంచె సుతుని సర్వోన్నతునిన్.

* * * *

క. మారంరాజు కులోద్భవ
నైన రంజిలుతిర్పతమ్మ నన్నుల మిన్నన్
ధీగత. పాణిగ్రహణము
సారమతిం జలిపి పిదప సరసత వెలయన్.

సీ. అమిరప వంశసుధార్ణవచంద్రుఁడై
తనరారు శరభప్రధానమౌళి
శ్రీవేంకమాంబికాస్త్రీరత్నమున నను స
త్పుత్రుల విమలచారిత్రఘనుల
దానరాధేయులఁ దతభాగధేయుల
వినయవిధేయుల విపులయశుల
బేరయామాత్యుని చెరుకూరు వెంకయ మంత్రి
యనువారిఁ గాంచి మున్ననిననిరుల
వరలు శ్రీరామలక్ష్మిని గరిమనొసఁగఁ
బరిణయంబయి యిరువురుతరుణు లలరి
వారికి భూదేవి శ్రీదేవియట్లు దనకు
భక్తి సలుపంగ వర్ధిల్లెఁ బ్రభుఁడు దనంగ.

తే. అలరులక్ష్మీపతిసచివునగ్ర భార్య
తిరుపతమ్మ పతివ్రతాతిలకములకుఁ
దిలక మన మెప్పి వసుమతిఁ దెగడె నార
పతికి నిష్పంకవృత్తిఁ దాఁబాదుకొల్పి.

* * * *

క. ఆపడతియందు నాల
క్ష్మీపతి సుతు సార శేముషీ సంయుతు ధా
త్రీపతిమానితు సుగుణా
ఢ్యాపితవరచరితు సీతయామాఖ్యుఁ గనెన్.

*　　　*　　　*　　　*

సీ. ఆపుణ్యమూర్తి లక్ష్మీపతినిజకులా
రామలక్ష్మియగు నారామలక్ష్మి
వలన సగుణగణవర్ధిష్ణు ననఘు నా
ర్యవిధేయుఁ దిరువత్యార్యాభిధేయు
ధీరనిర్జరశాఖి ధీదేవతాగురు
శుభ్రభాసుసమాఖ్య సుబ్బయాఖ్యు
సకలభూజననేత్ర సరసిరుహాహ్లాదిత
సూరసన్నిభధుర్యు సుబ్బయార్యు
వఱలఁ గనె నందనుల విరాట్పురుషుఁ డెలమి
హరిహరహిరణ్యగర్భులకరణి ముగురి
శ్రీనివాసకత్రైశ్వర్యధీ నిపుణుల
భవ్యభూసురమణుల సద్భావచణుల

ఉ. ఆమహనీయభోగవిజితామరవల్లభులందు సద్గుణ
స్తోముఁడు సుబ్బయార్యమణి శోభిలు నన్యవధూవిరక్తి శ్రీ
ధామవిశేషభక్తి నిరతంబును నైష్ఠికయుక్తిగాన వి
ద్యామితశక్తి సువ్రతచయామలరక్తి మృదుప్రియోక్తిచేన్.

*　　　*　　　*　　　*

క. ఆమహనీయకుటుంబిని
శ్రీమానిన్యంశకలనఁ జెలఁగి మహాల
క్ష్మీమహితాఖ్యవహించిన
యామహిళామణి నుతింపనగు వేనోళ్లన్.

*　　　*　　　*　　　*

తే. సూరయార్యుఁడు సావిత్రి సుందరాంగిఁ
బోలు సావిత్రి తనకు నిల్లాలుగాఁగ
నెసఁగె వైభవ విజిత దేవేంద్రుఁడగుచు
రూపవంచితపుండ్రేక్షుచాపుఁడగుచు.

క. అం దగ్రజుఁ డఖిలాశ్రిత
మందారుఁ డఖండకీర్తి మండలజితరా
కేందుఁడు తిరుపతి మంత్రిపు
రందరుఁ డౌదార్యఘనధురంధరుఁ డగుచున్.

* * * *

తే. అయ్యనఘురాణి శ్రీగంగమాంబ యంబి
కను దెగడి నౌర కన్నచో గండములను
బాపఁగా నేర్చి తాఁ బెట్టఁబట్టు చోట
బ్రాహ్మణావన సద్వృత్తి వరఁగఁగూర్చి.

* * * *

సీ. * * * *
భక్తిఁ దనుఁ బరివేష్టించి ప్రబలభూమి
మాధవపురి యనందగు మాధవపురి
మహి సిరులు మీఱి కీర్తి మంత్రిశౌరి
ప్రబలెఁ బ్రబలుచునున్నాఁడు ప్రబలఁగలఁడు.

* * * *

క. నిరతాన్నదాన ఘనలస
దురుగుణసాంద్రునకు నాకునార్యన్వయసా
గరరాకా చంద్రునకుం
దిరుపత్యభిధానమంత్రి దేవేంద్రునకున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన సుకుమారీ పరిణయంబను శృంగారప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టి దనిన.

* * * *

ఉ. శ్రీ పరిసేవిత వ్రత విశిష్ట జనస్తవనీయ హేమసం
స్థాపిత వప్రకల్పిత విశాల విడంబిత రత్నదీపికా
దీపితదిఙ్ముఖాంతర ముదీరిత వైభవ భాస్వరం బయో
ధ్యాపుర మొప్పుచుండు వసుధాసతి కంఠ విభూషణంబనన్.

**End :**

కవిరాజ విరాజితము.
నయగుణ సాధన నిత్యసమేధన నవ్యయశోధనదివ్యఖనీ
దయితను బోధన మానసుయోధన ధర్మవిశోధన ధర్మజనీ

హయగజయూథనమన్నిజయోధనరావృత సాధనటద్రమణీ
జయరఘునాథనతిస్తుతి రాధన సత్వసుమేధ నతారిజనీ.

**Colophon:**

మ. ఇది శ్రీ కుంటురిసతుర్లామల సుధాబ్ధీశేందు నాగేంద్రకో
విదసంవర్ణిత రీత్యలంకృతికళోద్యత్యాదిసంపత్ప్రశ
స్తిదికంచత్సుకుమారి సత్పరిణయ శ్రీనుతుర్యతీశాస్త్రికా
ర్యదః కద్యతర్విపాలస్యమైతగు చతుర్థాశ్వాసమొప్పన్ భువిన్.

గద్య ఇది శ్రీ రెల్లమంద కోటీశ్వర కరుణాకటాక్ష వీక్షణసమా
సాదిత కవితా విజృంభణ నాగేశ్వర వాక్ప్రీతి భావిత సకల సుక
విసంభావిత భాస్వర వికస్వర సారస్వత పదమంజు మంజీర రవచ
మత్కార మృదుమధురవచనరచనోచితాకిర్ణినపల్లి వంశకలశోదధి
సుధాకర భాసమాన జోగయామాత్యపుత్ర పవిత్ర చరిత్ర కౌండిన్య
గోత్రసుజన విధేయ నరసింహాభిధేయ ప్రణీతంబైన సుకుమారీపరిణ
యంబను శృంగారమహాప్రబంధంబునందు సర్వంబును చతుర్థాశ్వాసము.
(వి-వి.)——

సమగ్రము. వ్రాంత తిన్నగిదే. తప్పులుగలవు శైథిల్యము గలదు.
గ్రంథపాతములు లేవు.

సుకుమారీ పరిణయ మని పేరుగల యీ నాల్గాశ్వాసముల ప్రబం
ధమున నయోధ్యాధీశ్వరుండైన స్వంజయనృపాలుని కుమార్తెయగు
సుకుమారిని నారదమహర్షి పెండ్లాడు కథ వర్ణితమయినది. గ్రంథ
కర్త యకిర్ణినపల్లి నరసింహ కవి. కౌండిన్య గోత్రుండు, జోగయా
మాత్యుని పుత్రుండు. ఎల్లమందకోటీశ్వరస్వామి భక్తుండు. కృతి
ప్రేరకుండు ఆకునూరి తిరుపతి ప్రధానుండు. ఉపాన్యాత పద్యములం
బట్టి కృతిపతి వంశవృత్తాంత మెఱుంగఁదగును. ఆదిలక్ష్మీపరిణయా
దులు, నరసింహ కవి కృత్యంతరములు.

---

No **891** సుకుమారీపరిణయము

SUKUMĀRĪPARIṆAYAMU

Substance, paper. Size, 12 × 9¾ inches. Pages, 146 Lines, 20 on a page Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, bad and contains mistakes.

Complete.

Same work as the above.

(వి-వి)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు

పూర్వమువలె.

---

## No 892. సుకుమారీపరిణయము.

## SUKUMĀRĪPARINAYAMU

Substance, palm-leaf. Size, 13 × 1¼ inches Pages, 204. Lines, 6 on a page. Character, Telugu Condition, fair Appearance, old. Mode of writing, good Not free from mistakes

Complete

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లంతగా లేవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె.

---

## No 893. సునందాపరిణయము.

## SUNANDĀPARIṆAYAMU.

Substance, paper Size, 8 × 6½ inches. Pages, 204. Lines, 16 on a page. Character, Telugu. Condition, fair Appearance, old. Mode of writing, good but full of mistakes

Complete but breaks off in some places.

An original poem in five Āśvāsas describing the marriage of king Pradīpa with Sunandā, daughter of Bhīmasēna, as narrated in the Mahābhārata The author Cintakunta Kōdandarāmakavi, son of Lingamāmba, and Timmanamantri was given in adoption to Akkanamantri and Mangamāmba, paternal uncle and aunt of the author For other particulars see the extracts given below with the introductory portion.

సమగ్రమే కాని చిన్నచిన్న గ్రంథపాతము లక్కడక్కడఁ గాన వచ్చుచున్నవి. ఈ గ్రంథ సంబంధమైన కడపటి యేడు పత్రములును సంపుటీకరణమందుఁ బొరపాటునఁ బుస్తకాంతమందుఁ బడిపోయినవి, వ్రాఁత యొకతఱఁబడిగాఁ బాగుగానున్నది కాని దోషములు విశేషము

ఇది యైదాశ్వాసముల యపూర్వకావ్యము. ఇందు భరతవంశ జాతుండగు ప్రదీపుఁడు భీమసేనకుమారియగు సుచంత నుద్వాహ మగుట మున్నగు విషయములుగల భారతకథ వర్ణింపబడియున్నది. గ్రంథకర్తయగు చింతకుంట కోదండరామ కవి. నందవరీక బ్రాహ్మణుఁడు; లింగమాంబా తిమ్మనమంత్రు లితని జనకపితరులు; పినతండ్రి యగు అక్కనమంత్రి కితఁడు దత్తుఁడయ్యెను.

రాయన భాస్కరుఁడు తన శ్వశురవంశమున పూర్వులలోఁ బ్రఖ్యాతుఁడనియు నాతఁడు అనవేమమహీశునిచే ననేకాగ్రహారముల నందెననియు, వినుకొండ, కొండపల్లి, దుర్గముల కధిపతిగానుండెననియు నతఁడు చెప్పికొన్నాఁడు.

**Beginning :**

శా. శ్రీవైదేహసుతాపయోధర(త?)పటీ సిందూరపంకారుణ
శ్రీవిభ్రాజదురస్స్థలాంతర పరిస్ఫీతాచ్ఛముక్తావళీహా
రావారాంచిత దివ్యమంగళ శరీరాభావిలాసుం డయో
ధ్యావాసుండగు రాఘవుం డొసఁగుఁగాత న్నాకు నిష్టార్థముల్.

* * * *

తే. వ్యాసు వల్మీకభవుఁ గాళిదాసు మాఘు
బాణు శ్రీనాథు వేముడ(ల)వాడభీము
నన్నపార్యునిఁ దిక్కన నల్లసాని
పెద్దనార్యుని సేవింతుఁ బెంపుమీఱ.

క. సరసులు మెచ్చఁగ నొకకృతి
విరచించెద భర్గమకుటవిలుఠద్గంగా
సరి దమల ఝరీ ధారా
పరఘుమఘుమ మధురసధర వాగ్వైఖరులన్.

* * * *

వ. . . . . . ఏతత్ప్రబంధంబునకు నాయకుఁడగు మదీయ వంశంబు వర్ణించెద.

* * * *

ఉ. ఆచతురాననాన్వయసునందుఁ దపఃపరితప్తయోగవి
దావ్యచరిత ప్రభావజనితామలమానసుఁడుజ్జ్వలప్రభా
నూచితభానుఁడాగమ శ్రుతి(?)స్మృతిమార్గవివిక్తసత్స్వభా
వోచితకర్మఠుండు మహిమోన్నతినొప్పు గౌతముండిలన్.

ఉ. నందనృపాలదత్తమగు నందవరంబుననుండునట్టియా
నందవరీకభూసుర జనంబులలోపలఁ బెద్దటంచు నెం
చందగుచింతకుంటకులసాగర చంద్రుఁడు పెద్దనార్యుఁ డిం
పొందె దిగంతరాళములఁ బూర్ణముగాఁ దనకీర్తినిండఁగన్.

* * * *

క. ఆపెద్దన్న కుమారుఁడు
శ్రీపతిపాదారవింద సేవకుఁ డంచ
ద్రూపవిసర్జితమన్మథు
డేపొందెను వెంగళన్న యెన్నఁగ విబుధుల్.

క. వెంగళమంత్రికి భాస్కరుఁ
డంగజనిభమూర్తి తిరుమలామాత్యుండున్
రంగలరెడు వెలమ?రా
ట్పుంగవుఁడు జనించి రతుల భోగాస్పదులై.

* * * *

క. ఆ భాస్కరమంత్రికి నురు
శోభాయుత విగ్రహుండు సుతుఁ డుదయించెన్
ప్రాభవమొప్పఁగ భాగ్య
శ్రీభరితుఁడు తిమ్మనార్యశేఖరుఁ డెలమిన్.

చ. పొలుపుగఁ జింతకుంటకులముఖ్యుఁడు తిమ్మనమంత్రి చంద్రుఁ డిం
పలరఁగముట్టునూరి నయనారితనూజను మారమాంబికా
లలనను ప్రేమమీఱ శుభలగ్నమునందు వివాహమై జనం
బులు దను సన్నుతింపఁ జెలు వొందెఁగనద్విభవాభిరాముఁడై.

క. ఆరమణీ రమణుల కరు
దారఁగ జన్మించె నఖిల ధరణీసురసం
ఘా రావన దక్షుఁడు పర
నారీసోదరుఁడు సర్వనాఖ్యుండరయన్

* * * *

సీ. ఏమంత్రి నిర్మించె నీశ్వరాలయములు
  శ్రీనగాద్యుత్తమ క్షేత్రములను
ఏమంత్రి గావించె నెల్లదేశములందు
  నాతతకూప తటాకవితతు
లేమంత్రి వాకిట సామంతబృందంబు
  గాంచి మ్రొక్కులు వేయఁ గాచియుండు
నేమంత్రియింటను భూమిసురశ్రేష్ఠు
  లాగమోక్త శివార్చనానురక్తు
లతఁడు దిగ్దేశభూప సభాంతరప్ర
శస్తకవిబృంద మధురవాగ్జనిత కావ్య
చయనుతౌదార్య విక్రమాంచద్యశుండు
గుంటి(బ?)పలిముత్తనార్య దికుఁంజరుండు.

క. నాలుగుదర్గంబులు పదు
నాలుగు దేశముల ప్రజల నయమార్గమునన్
లాలించుచుఁ జిరకాలము
పాలించెను ముత్తమంత్రి ప్రభుమాత్రుండే.

క. ఆముత్తన మంత్రీంద్రుఁడు
ప్రేమం దగు చింతకుంట వేఁటయతనయన్
భామామణిఁ దిమ్మాంబను
గామించి వివాహమయ్యెఁ గరుణదలిర్పన్.

క. ఆదంపతులకు భాస్వ
త్తేజోజితభాస్కరుండు ధీజననిచయాం
భోజవనీ భాస్కరుఁడు
ద్భాజితవిక్రముఁడు భాస్కరన్న జనించెన్.

సీ. స్థిరతర ప్రజ్ఞావిశేషాతినిష్ఠాతి
  రసకృతనిర్జర రాడ్గురుండు
అసదృశమంత్ర యోగాతివశీకృత
  సన్మంత్రదేవతా సముదయుఁడు
నిరుపమ శ్రుతిసూక్త నిర్ణీత సన్మార్గ
  వర్గోచితాచార వర్తనుండు
ఘనతరపాణిని గ్రంథార్థశోధన
  సందర్భ సన్మనీషాన్వితుండు

సత్యభాషా హరిశ్చంద్ర జనవిభుండు
సలలితౌదార్యనిర్జిత జలధరుండు
ఎల్లమాంబాసతీ ప్రాణవల్లభుండు
గుంటుపలి భాస్కరుండు సత్కులవరుండు

తే. అట్టి వల్లభునకును శుభాస్పదముగ
జనన మొందె సదానన చంద్రబింబ
కలితకుంతలరోలంబ ఘనలతంబ
మహితసద్గుణ నికురుంబ మల్లమాంబ.

క. ఆమల్లమాంబ సతుల
శ్రీమించఁగ సర్వమంత్రి శేఖరుఁడు శచీ
భామామణి నింద్రుం డుప
యామంబై సల్లు పరిణయంబై చెలఁగెన్.

క. ఆసర్వన్నకుమారుం
డైసరసులు మెచ్చ నెగడె నతులితభాగ్య
శ్రీసంపద్వైభవజిత
వాసవుఁడనఁ బద్మనాభ వర్యుం డుర్విన్.

* * * *

ఆ. ప్రథితమైన గుంటిపల్లి ముమ్మశిముత్త
మంత్రిసుతను రామమాంబ నెలమిఁ
బద్మనాభమంత్రి పరగ వివాహమై
పెంపునొందె బంధువితతు లెన్న.

క. ఆజ్ఞాయాపకులకు సుర
రాజోన్నతవైభవాభి రాముఁడు విద్యా
భోజుఁడు ధైర్య శ్రీవి
భ్రాజితుఁ డుత్తముఁడు సర్వమంత్రిజనించెన్.

* * * *

తే. గుంటుపలిశంకరామాత్యు కూర్మితనయ
నంబమాంబావధూలలామను (?) వివాహ
మై ముదంబునఁ బుత్రపౌత్రాభివృద్ధి
దనరఁ జెన్నొందె సర్వప్రధానమౌళి

ఉ. నందవరాగ్రగణ్యుఁడు ఘనాఘనవాహనవాహమల్లికా
కుందశతారతార సుగకుంజరహీరసుధాబ్ధిపిచికా

చందనశారదాభ్రఘనసారవిశాకరసాంద్రకీర్తిఁ బెం
పొం(?)దెను జంతకుంటకుఁ సర్వయ తిమ్మనమంత్రివేడుకన్.

ఆ. పెంపుమిగుల సాగి పెరుమాళ్లతనయను
లింగమాంబ నతుల లీల లాదవఁ
దిమ్మనప్రధానధీమంతుఁ డుద్వాహ
మయ్యె నచలమైన నెయ్యమొసఁగ.

క. చెఱకున ఫల ముదయించిన
తెఱఁగునఁ బుత్తడికిఁదావి దేఱినరీతిన్
సరసుఁడు తిమ్మనమంత్రికి
గురుతనయుఁడు జగ్గరాజు కూర్మి జనించెన్.

చ. చిలువలరేఁడు పుట్టెను జెరు సుధాంశుఁడు వంకు దాల్చునా
జలజజసూతి మాని కలశాంబుధి చంచలభంగుఁ డంచు ది
గ్వలయమునందు సాటెవరు గానక త్రిమ్మణు నెల్లప్రొద్దు ని
చ్చలమునఁ జంతకుంటకుల సర్వయయక్కన కీర్తి పూనిగన్.

* * * *

క. ఎనయఁగఁ గుడుమల వెంగన
తనయను మంగాభిధానతరుణీమణి నిం
పొనరఁగఁ బరిణయమయ్యెను
ఘనుఁ డక్కన సచివుఁ డమలకరుణ దలిర్పన్.

చ. సురుచిరభాగ్యసంపదల సుందరరూపవిలాసరేఖలన్
స్థిరతరకీర్తిశాలియగు తిమ్మనమంత్రికి లింగమాంబకున్
వరతనయుండ వంశమున వన్నెయు వాసియుఁ గల్గువాఁడఁ బెం
పరయఁగ దత్తపుత్రుఁడను నక్కనమంత్రికి మంగమాంబకున్.

క భూమీశ్వరసన్మాన్యుఁడ
శ్రీమంతుఁడ సుకవిజనవశీకరుఁడ సదా
రామార్చనాభిరతుఁడను
నామమ కోదండరామనామాత్యుండన్.

సీ. ఘనతరౌదార్య దీక్షాకల్పితానల్ప
కరనిబద్ధసువర్ణకంకణుండు
ఆసేతుశీతనగాంత ధరాట్సభా
మధ్యవిశ్రుతకీర్తి మండలుండు

కొండపల్లి వినుకొండ దుర్గద్వయీ
దేశ ప్రజావనధీయుతుండు
సకలావనీపక సంతానయాచిత
వస్తుప్రదాన ప్రవర్తనుండు
అన్నవేమమహీశదత్తాగ్రహార
మదకలాందోళికార్వ సన్మణివిశేష
భూషణాద్యష్టభూతి విభూషితుండు
భానుతేజుండు రాయనభాస్కరుండు.

ఉ. వన్నెకు నెక్కు భాస్కరుని వంశమునం దుదయించెఁ గీర్తిసం
పన్నుఁడు బంధుబృందపరివార జనాశ్రిత సత్కవీశ్వరా
పన్నశరణ్యుఁ డంచిత కృపాఢ్యుఁడు వేంకటనారసింహుఁ డ
త్యున్నతిఁ జెందె దశ్చ్యవనతుల్యలసద్విభవాభిరాముఁడై.

* * * *

తే. అనయ వేంకటనారసింహార్యమౌళి
సరసవాక్తంత్రి రెంటాలచమడమంత్రి
తనయ నచ్చమ సాధ్వి నుద్వాహ మయ్యె
నింద్రుఁడు పులోమసుతను వరించినట్లు.

* * * *

క. ఆరమణీరమణులకు ను
మారమణీరమణచరణమానితభజనో
దారతరోద్యద్ధిషణ కు
మారిక జన్మించె రామమాంబ యనంగన్.

తే. అంత నాదంపతులు ప్రేమ లంకురింప
రామమాంబాఖ్యతనయాలలామ నెలమి
దనరఁ గాఁ జింతకుంట కోదండరామ
వరున కుపయామ మొనరించి గురుతరముగ.

తే. అంతటను రామమాంబయుం దతులలీలఁ
బుత్రపౌత్రాభివృద్ధిఁ జెంపొందియుండి
స్థిరముగా నే నొనర్చు ప్రదీపభూప
వరచరిత్ర కధీశు నేర్పఱచుఁ దలఁచి.

* * * *

వ. ఇట్లు బాదరాయణప్రసాదంబునవైశంపాయనుండు భారతవంశసంభవుండగు ప్రదీపభూమండలాఖండలుండు భీమసేనకుమారికసునందాదేవిని బరిణయంబైన తెఱంగు జనమేజయునకెఱింగించినప్రకారంబున శ్రీరామచంద్రమూర్తికి మనస్స్వాన్తా నాంధ్రభాష నంకితంబు సేయంబూని కృతనిశ్చయుండనై

క. శ్రీకరదినకరకులర
త్నాకరపరిపూర్ణ వరసుధాకరునకు సీ
తాకాంతావదనాబ్జది
వాకరునకు రామచంద్రవసుధేశునకున్.

* * * *

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన సునందాపరిణయంబను మహాప్రబంధంబునందలి కథాలక్ష్మికి నుద్భవస్థానంబైన పుటభేదనం బెట్టిదనిన.

**End :**

సీ. యమునానదీతీరరమణీయమంజుల
వంజుల మల్లికాకుంజములను
గరిపురపరిసర సురుచిరతరువర
విలసితకాంతారవిసరములను
గమనీయతపనీయగారుడగ్రావనిబద్ధ
నిరుపమవేదికానిచయములను
గలహంసకులకలకాంచితకలకల
నినదపూరితసరోనికటములను
గల్పితానల్పశీతలకాయమాన
కలితకేళీగృహాంతరములను దినము
దినముం గోరుము లూరంగ మనుజవిభుండు
వనితతోంగూడి యానందమునం జెలంగె.

క. అని వైశంపాయనముని
జనమేజయభూమిపతికిం జతురత మెఱయన్
వినుపించిన నావలికథ
వినవలె సెలవియ్యవలయు విశదముగాంగన్.

* * * *

**End:**

మత్త. ఖండశాంర్మ్య కముక్త కాండ విఖండితాహితమండలా
పుండరీకవిశాలలోచన భోగవిజితాఖండ లా
గండమండితనవ్యమణిగణ ఖచితకాంచనకుండ లా
చండదుష్టకబంధ విదళనశాతధారా మండలా.

**Colophon:**

గద్య. ఇది శ్రీరామభద్ర కటాక్షలబ్ధ కవితా విచిత్ర చింతగుంట వంశపవిత్ర అకరాగమంత్రి పుత్ర సహజసాహిత్య కోదండరామామాత్య ప్రణీతంబైన సునందా పరిణయంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

---

No **894**. సునందాపరిణయము.

SUNANDĀPARINAYAMU

Subs'ance, palm-leaf Size, 14¾ × 1½ inches. Pages, 205 Lines, 7 on a page. Character, Telugu Appearance, old Mode of writing, fair, but not free from mistakes and breaks off here and there

Same work as the above.

At the end of the work there is the horoscope of Bhāskara Peda-vēnkatanāranappa who was born on Thursday the 15th day of the bright fortnight of the lunar month Kārttika in the year Pingala

(వి-వి.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. చిన్న చిన్న గ్రంథపాతము లక్కడక్కడ గలవు.

పూర్వము వోలె

గ్రంథాంతమున నొకవిషియాంకుపై భాస్కరుని పెద వెంకటనారాయణప్ప జాతకమున్నది. అతడు పింగళ సం॥ కార్తిక శుద్ధపూర్ణమా గురువారమున జనించి నట్లున్నది.

---

No. **895**. సునందా పరిణయము.

SUNANDĀPARINAYAMU.

Substance, paper. Size, 11¾ × 6⅞ inches Pages, 254 Lines, 20 on a page Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good, and free from mistakes.

Complete

At the end of the Ms. it is stated that this Ms. was compared by Korapāti Cannappa and Avadhānula Appayya and that the variations in the readings are noted by Vāranāsi Rāmasvāmi and Jūlūru Laksmīnārāyana on the 14th day of June 1832 A.D.

(వి-వి.)—

సమగ్రము. అక్కడక్కడ గ్రంథపాతములు గలవు. వ్రాఁత మంచిది తప్పు లున్నవి.

పూర్వము వలె.

గ్రంథాంతమం దిట్లు గలదు :—

"అవధానుల్ల అప్పయ్య మొకాబిలా చూచి దిద్దినది. కోరపాటి చన్నప్ప మొకాబిలా చదవబడుచున్న అయినది. వి ౧౪ జూన ఆన ౧౮౩౨ సం॥ ప్రతిభేదాలు ఎక్కించడమయినది. వారణాశి రామస్వామి వ్రాలు. జూలూరు లక్ష్మీనారాయణ వ్రాలు."

---

## No 896. సురాభాండేశ్వరోపాఖ్యానము (సటీకము).

## SURĀBHĀṆDĒŚVARŌPĀKHYĀNAMU (WITH MEANING).

Substance, paper Size, 7¾ × 4¼ inches Pages, 194. Lines, 15 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Complete.

Same work as that described under R. No 10 of the Triennial Catalogue of Telugu Mss, Vol. I. The author Gattuprabhu, son of Ellanāmātya, has also written Kucēlōpākhyāna. The work under notice is followed by a commentary the author of which is not known.

**Beginning:**
**Text:**

క. శ్రీమత్కాశీపట్టణ
ధాముఁడు విశ్వేశ్వరుండు ధరణీధర క
న్యామణికుచకుంకుమపం
కామలవక్షుండు మమ్ముఁ గృతార్థులఁ జేయున్.

**Comment:**

టీ. శ్రీమత్ । సంపత్తులు కలిగినటువంటి । కాశీపట్టణధాముడు । కాశీపట్టణమే నివాసముగా గలిగినటువంటివాన్ని । ధరణి . . వక్షుండు ।

ధరణీధర । హిమవత్పర్వతమునకు । కన్యామణి । శ్రేష్ఠమైన కూతురై నటువంటి పార్వతీదేవియొక్క । కుచ । స్తనములయందలి। కుంకుమ పంక । బురద పదనైన కుంకుమతోటి కూడుకొనిన । అమలవత్సుండు । నిర్మలమైన రొమ్ము కలిగినటువంటి । విశ్వేశ్వరుండు । విశ్వేశ్వరస్వామి । మము । మమ్ములను । కృతార్థుల జేయుఁగాక । కృతకృత్యులను చేయుగాత । అనగా కోరికలనిచ్చుననుట.

*　　　*　　　*　　　*

**Text:**

సీ. బ్రహ్మభాగవతాది పదునెనిమిది పురా
　　ణములను స్కాందంబు రమణఁగాంచెఁ
గల వందుఁ బర్వత ఖండంబు కాశికా
　　ఖండంబు కేదార ఖండ మనఁగ
నేఁబది యందులో నెక్కుడు కాశికా
　　ఖండంబు ముక్తికిఁ గారణంబు
పరగు నందును సురాభాండేశ్వరంబనఁ
　　బుణ్యచరిత్రంబు భూరిమహిమ
నట్టికథ తేటతెనుఁగున నతులమృదుల
సరసమాధుర్యవాక్యము లస్ంఘటించి
కవులకరుణావిశేషంబు కలిమికతన
విశ్వపతి కంకితంబుగ విన్నవింతు.

**Comment:**

టీ. బ్రహ్మ । బ్రహ్మపురాణమును . . . . విన్నవింతు । వినుపించుతున్నాను.

**Text:**

క. భ్రమరాంబాకరలిఖితా
　త్యమలినసద్వర్ణసముదయాంకితజిహ్వా
　సుమహితుఁడ నాశుకవితా
　ప్రమదాజనకుఁడను గట్టుప్రభ్వాఖ్యుండన్.

**Comment:**

టీ. భ్రమరాంబా । శ్రీశైలమునందుండే భ్రమరాంబయొక్క . . . . గట్టు ప్రభ్వాఖ్యుండన్ । గట్టుప్రభువు అనే పేరుకలవాడను.

*　　　*　　　*　　　*

**Text :**

క. ఆశాంబరునకు హారునకు
కాశ సుధాచంద్రతారకల్పకహిమసం
కాశశరీరునకును శ్రీ
కాశీవిశ్వేశ్వరునకుఁ గఱకంఠునకున్.

టీ. ఆశ । దిక్కులె । అంబరునకు వస్త్రములుగా కలిగినవానికిన్ని । . . . విశ్వేరునకు । విశ్వేశ్వరస్వామికి.

వ. సమర్పణంబుగా నాయొనర్పంబూనిన సురాభాండేశ్వరోపాఖ్యానంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన.

**Comment :**

టీ. సమర్పణంబుగా । అర్పితముగాను । . . . క్రమంబెట్టిదనిన । క్రమమేలాగంటె.

**End :**

వ. అని సురాభాండేశ్వరుం బ్రశంసించి శంభుం డయ్యంబుజాననం బతిపుత్రసహితంబుగాఁ గైలాసంబునకుం దోడ్కొనిపోయెనని చెప్పిన విని శౌనకాది మహామును లానందకందళితహృదయారవిందులై రప్పుడు.

**Comment**

టీ. అని । ఈ ప్రకారముగా । సురాభాండేశ్వరున్ । సురాభాండేశ్వరలింగమును । ప్రశంసించి । వర్ణించి । శంభుండు । శివుడు । అయ్యంబుజానన । ఆ యాడిగదానిని । పతిపుత్ర సహితంబుగా । పెనిమిటి కొడుకులతోకూడా । కైలాసంబునకుం । కైలాసపర్వతమునకు । తోడ్కొని పోయెనని । వెంటబెట్టుకొని పోయెనని । చెప్పినవిని । చెప్పగావిని । శౌనకాది మహామునులు । శౌనకుడు మొదలైన మునీశ్వరులు । ఆనంద । సంతోషముచేతను । కందళిత వికసించినటువంటి । హృదయారవిందులు । మనస్సులనే పద్మములు కలవారు । అప్పుడు । ఆసమయమునందు । ఐరి । అయిరి.

* * * *

**Text :**

మాలిని. సరసిజనిభహస్తా సర్వలోకప్రశస్తా
నిరుపమశుభమూర్తీ నిర్మలారూఢకీర్తీ

పరహృదయువిదారి భక్తలోకోపకారి
గురుజనబుధపోషీ ఘోరదైతేయశోషీ.

**Comment :**

**టీ.** సరసిజభవ (సభ) । పద్మములతో సమానమైనటువంటి । హస్తా । చేతులు గలవాడా । . . . . . . . ఘోరదైతేయ । భయంకరులైన రాక్షసులను । శోషీ । శోషింపజేసేవాడా.

**Colophon :**

**Text :**

గద్య. ఇది శ్రీమద్రుక్మరాంబికా ప్రసాదలబ్ధకవితావిచిత్ర సరసకవిమిత్ర యెల్లనామాత్యపుత్ర సరససద్గుణవిధేయ ఘట్టుప్రభునామధేయ ప్రణీతంబైన సురాభాండేశ్వరంబను మహాప్రబంధంబునందు సర్వంబు నేకాశ్వాసము.

**Comment**

టీ. ఇది । ఈ గ్రంథము । . . . . । ఏకాశ్వాసము । ఒకటే ఆశ్వాసమూ.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పులు గలవు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

స్కాందపురాణాంతర్గతమయిన కాశీఖండములోనిదగు సురాభాండేశ్వరకథ యిట్లు ఏకాశ్వాసప్రబంధముగా ఘట్టుప్రభువను కవిచే రచితమయినది. ఘట్టుప్రభువు తండ్రి యెల్లనామాత్యుఁడు. కుచేలోపాఖ్యాన మీతని యితర కృతి.

ఇందు వ్యాఖ్యకూడఁ గలదు. వ్యాఖ్యాత పేరెఱుఁగరాదు.

దీనిమూలము ఆర్. నె 158 రున వర్ణితమైనది.

---

No. **897**. సురాభాండేశ్వరోపాఖ్యానము (సటీకము).

SURĀBHĀNDĒŚVARŌPĀKHYĀNAMU (WITH MEANING).

Substance, paper. Size, 11⅜ × 7 inches Pages, 108 Lines, 22 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, bad but free from mistakes Written on only one side of the paper.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది గాదు. తప్పు లంతగా లేవు. పత్రమున కొక్క ప్రక్కనే వ్రాఁత కలదు. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వము వలె.

---

No. **898.** సురాభాండేశ్వరోపాఖ్యానము.

SURĀBHĀNḌĒŚVARŌPĀKHYĀNAMU

Substance, paper Size, $10\frac{3}{4} \times 6\frac{1}{2}$ inches Pages, 80 Lines, 21 on a page Character, Telugu. Condition, fair Appearance, old. Mode of writing, good but full of mistakes The variations in reading are interlined Written on only one side of the paper. Correct readings are written on the other side of the paper

Complete.

Same work as the above.

సమగ్రము. ఈ చిత్తు ప్రతి పత్రమున కొకవైపున మాత్రమే వ్రాయఁబడినది. పాఠభేదములు పంక్తులనడుమ నిఱికింపఁబడియున్నవి ; వానిలోని నిర్దుష్ట పాఠములు వ్రాయనివైపునఁ బ్రత్యేకము వ్రాయఁబడియున్నవి. బ్రౌనుదొరగారి యాంగ్లేయ టిప్పణీసహిత మక్కడక్కడఁ బంక్తులనడుమ నిఱికింపఁబడియున్నది. వ్రాఁత చక్కఁగా నున్నదిగాని దోషములు హెచ్చు.

పూర్వము వలె

---

No. **899.** సురాభాండేశ్వరోపాఖ్యానము.

SURĀBHĀṆḌĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, $16 \times 1\frac{1}{8}$ inches. Pages, 2. Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Contains only a small portion

Same work as the above

(వి-వి.)—

అత్యల్పభాగము మాత్రమే కలదు. వ్రాఁత మంచిదేగాని నిర్దుష్టము గాదు. శైథిల్యము గలదు.

పూర్వమువలె.

## No 900. సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀNDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 14¾ × 1¼ inches Pages, 54 Lines, 5 on a page. Character, Telugu. Condition, injured. Mode of writing, fair but full of mistakes.

Complete.

Same work as the above

At the end of the Ms 5 pages contain some songs in Telugu language.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

కడపట ౫ విడియాకులలోఁ గొన్ని పాటలు పద్యములు వ్రాయఁబడియున్నవి.

---

## No. 901. సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀṆDĒSVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1⅛ inches. Pages, 29 Lines, 6 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old. Mode of writing, fair but full of mistakes.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. వ్రాఁత మంచిది. దోషములు గలవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువోలె.

---

## No 902. సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀṆDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 16 × 1¼ inches Pages, 32 Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Mode of writing, fair but not free from mistakes.

Complete but imperfect.

(ఇ-ఇ.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములును గలవు.

పూర్వమువలె.

---

## No. 903. సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀNDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, 12¼ × 7½ inches. Pages, 2. Lines, 23. Character, Telugu Condition, good. Appearance, old Mode of writing, good but not free from mistakes.

Incomplete.

Same work as the above.

(ఇ-ఇ.)—

అసమగ్రము. వ్రాత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతము లేవు.

పూర్వమువలె.

---

## No. 904. సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀṆḌĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, 16⅝ × 1¼ inches. Pages, 20. Lines, 8 on a page Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Complete

Same work as the above.

(ఇ-ఇ.)—

సమగ్రము. వ్రాత మంచిది. తప్పు లెక్కువ. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

## No. 905 సురాభాండేశ్వరోపాఖ్యానము.
## SURĀBHĀNDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 15⅜ × 1¼ inches. Pages, 34. Lines, 6 on a page. Character, Telugu Condition, much injured Appearance, very old Mode of writing, bad and full of mistakes.

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదిగాదు. శైథిల్యము, గ్రంథపాతములు గలవు. తప్పు లెక్కువగాఁ గలవు.

పూర్వము వోలె.

---

## No 906. సురాభాండేశ్వరోపాఖ్యానము.

## SURĀBHĀṆḌĒŚVARŌPĀKHYĀNAMU

Substance, palm-leaf. Size, 14⅝ × 1¼ inches Pages, 76. Lines, 4 on a page Character, Telugu. Condition, very much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes.

Complete

Same work as the above

At the end of the Ms. 4 foll contain some anthological stanzas.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత యొకమాదిరిగా నున్నది. తప్పు లున్నవి. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువోలె.

గ్రంథాంతమున నాలుగు తాటాకులలో చాటుపద్యములు గలవు.

---

## No 907. సురాభాండేశ్వరోపాఖ్యానము.

## SURĀBHĀṆDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, 16½ × 1¼ inches Pages, 32. Lines, 6 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes and breaks off in some places.

Incomplete.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. కొన్ని పత్రములు పోయినవి. వ్రాంత బాగుగా నున్నదిగాని నిర్దుష్టము గాదు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు.

పూర్వమువలె.

---

No 908 సురాభాండేశ్వరోపాఖ్యానము.

SURĀBHĀNDĒŚVARŌPĀKHYĀNAMU

Substance, paper Size, 9¾ × 6¼ inches. Pages, 55 Lines, 18 on a page. Character, Telugu, Condition, fair. Appearance, old Mode of writing, good but not free from mistakes. English notes in Mr. C. P Brown's handwriting are found here and there.

Complete,

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. వ్రాంత బాగుగానున్నది తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. బ్రౌనుదొరగారి యింగ్లీషు టిప్పణి అక్కడక్కడ గలదు.

పూర్వమువలె.

---

No 909. సురాభాండేశ్వరోపాఖ్యానము.

SURĀBHĀṆDĒŚVARŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, 10¼ × 6½ inches. Pages, 104. Lines, 17 on a page, Character, Telugu. Condition, fair. Appearance, old. Mode of writing, good but full of mistakes. Written on only one side of the paper. Variations in reading are noted on the other side of the paper.

The last eleven stanzas are wanting to complete the work.

Same work as the above.

(వి-వి.)—

అసమగ్రము. గ్రంథ సంపూర్తి కంతమందలి 10, 11 పద్యములు కొఱంతగానున్నవి. ఇది పత్రమున కొకవైపు మాత్రమే వ్రాయం

బడినది; రెండవవైపునఁ బాఠభేదములు వ్రాయఁబడియున్నవి. వ్రాఁత చక్కఁగా నున్నది గాని దోషములు విశేషము.

పూర్వమువలె.

---

## No 910. సూర్యతనయాపరిణయము.

## SŪRYATANAYĀPARIṆAYAMU.

Substance, paper. Size, $11\frac{5}{8} \times 7\frac{1}{8}$ inches. Pages, 198 Lines, 20 on a page Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes.

The other works herein are 1 *b*, Vīrabhadravijayamu, 229 (*a*) Bhallānacaritramu (Dvipada), 264 (*b*) Sārangadharacaritra (Dvipada) with Telugu meaning.

A Prabandha describing the story of the marriage of Lord Kṛṣṇa with Kālindī, daughter of the Sun god. The author Lingarāja, son of Vēnkatapati mantri of Tekkellupādu, belonged to the Ārvēlaniyōgi sect and Āpastambasūtra

As the Ms is incomplete it is not possible to find out the extent of this work

**Beginning :**

ఉ. శ్రీమహిజాపయోధరకుశేశయకోరకముక్తహారమా
త్యామితకాంతి సంకలితమై మదబంభరడింభమాలికా
శ్రీ మెఱయంగ వక్షమునఁ జేర్చి సతి న్ముదమొందఁ జేయు శ్రీ
రాముఁడు పక్షసంభవహరస్తుతనాముఁడు మమ్ముఁ బ్రోవుతన్.

* * * *

తే. వ్యాసులకు మ్రొక్కిలిడి కాళిదాసుఁ గొల్చి
దండిభవభూతి మాఘులఁ దగ నుతించి
నన్నపాఖ్యుఁ దిక్కన్న శ్రీనాథు నెట్టి
పార్యుఁ బమ్మెరపోతన నభినుతింతు.

* * * *

వ. అని యిష్టదేవతా నమస్కారంబును, శిష్టకవి పురస్కారంబును, దుష్టకవి తిరస్కారంబునుం గావించి యే నొక్క ప్రబంధంబు నిర్మింప నుద్యోగించి తత్కృతి నాయకుని మనంబునందరయుచు నొక్క-

శుభదినంబు రాత్రి సుఖనిద్రం జెంది యున్నయెడఁ దత్ప్రభాత సమయంబున.

సీ. * * * *
అందమగు చిత్ర ఫలకంబునందుఁ జెంది
రంజిలుచునట్టి పట్టాభి రామచంద్ర
మోహనాకృతి జలధరస్ఫూర్తి విభవ
మలరఁ గాఁగంటి దురితము ల్దొలఁగఁ గంటి.

చ. కనిమును కన్న చిత్రఫలకంబుగ దాయని చూడఁ జూడ నం
తన దయతోడ నందొనరు దైవ శిఖామణి వారిదధ్వనిన్
ననుఁ దిలకింపుచున్ బిలువ నాదగు భాగ్య మదెంతొ నేను స
ద్వినయభయాద్భుతంబు లెద దీకొనఁ జేరినుతుల్ ఘటించినన్.

క. కారుణ్యంబునఁ గన్గొని
గారవమునఁ బల్కె నీవు ఘటియించుటకున్
బ్రారంభించినకృతి మా
పేరను సంకితము సేయు ప్రియమున వత్సా.

తే. ఉన్నవియె శబ్ద చిత్రము ల్మిన్నగాఁగ
ఘనత నీవలె శృంగారకవితఁ జెప్ప
నేర్తురయ్య మదన మోహినీ విలాస
కథరచించిన జాణవు కావె నీవు.

క. రంగుగఁ గృష్ణుండు రవితన
యం గైకొను కథరచింపు మది విస్తరిలన్
సంగతి నిపుణత గని బా
లిం గవిజను లెల్ల మెచ్చ లింగనసుకవీ.

క. అనియానతిచ్చి వేంచే
సిన వెఱగందుచును లేచి చేతోమోదం
బున నాదు ప్రబంధంబున
కనువగు నాయకుఁడు గల్గె నని ధన్యుఁడనై.

క. సారమతి వేంకటేశ్వర
కారుణ్యావర్తైకలబ్ధ కవితాపటిమన్
నే రచియింపఁ దొడంగితి
ధీరమతిం గృతిని నాదు తెఱఁ గెల్లనినన్.

సీ. కొమరొంది యార్వేలకులపావనుండు నా
  సుగుణుం డాపస్తంబసూత్రుండగుచు
హారీతసగోత్రంబు నభివృద్ధిగాం జేసె
  ధరణిం దకెళ్ళపాటి గురువనార్యుం
డాతనిపత్నియై యలరె సుశీలత
  పేరమ యనంగ నావెలందియందు
నతండు గాంచెను వేంకటాద్రి చిట్టయనాంగం
  దనయుల నిరువుర ధన్యుండగుచు
వారిలోపల హరి పాదవనజబంభ
రాయమానమానసుండు సుధీయుతుండు
ధీరుం డాశ్రితబంధు మందారుం డనంగం
జిట్టయామాత్య మౌళి ప్రసిద్ధిగాంచె.

ఉ. అంగజసన్నిభాంగుం డతం డంగర వంశసుధాబ్ధిలక్ష్మియా
లింగమధర్మపత్ని గనులీల వరించె నుతించమించు న
య్యంగన పాటివత్తురె దయాపతిభక్తి గుణంబులందు నె
న్నంగమలాస్యలెందు ఉలనామణి యాయనసూయకే తగున్.

క. ఆవనితయందుం గాంచెన్
  బావనుండగుచిట్టమంత్రి పాథోనిధి యా
  జైవాతృకునిం గన్న
  ట్లా వేంకటపతిని సుకృతి నతులిత సుమతిన్.

సీ. సకలవిద్యారూఢ చతురవచస్సభా
  పాండిత్యమున బృహస్పతి యనంగ
సతతాన్నదానాది వితరణంబుల నర్థి
  జనబంధుకల్ప భూజం బనంగం
బరతంత్ర భేదనోపాయసంగర శౌర్య
  విధికార్యఖడ్గ ప్రవీణుం డనంగం
గమనీయరూప రేఖావిలాసంబుల
  గణుతింప నూతనాంగజుం డనంగం
బ్రబలె వెల్గోటి కొండలరాయనృపతి
మన్ననం జెలంగి యమితసంపన్నుం డగుచు
మహితసత్కీర్తి చిట్టయామాత్యసుతుండు
ఘనుండు తకెళ్ళపాటి వేంకటవిభుండు.

తే. అంతనా వేంకటపతి యత్యంత విభవ
కలితుఁడై ధన్య కొండనాగప్రధానుఁ
డవని లక్ష్మీసమాన లక్ష్మాంబయందుఁ
గాంచిన శుభాంగి వరకన్యకాలలామఁ
బ్రేమ సూరమయను సాధ్విఁ బెండ్లియాడె.

* * * *

ఉ. ఆకమలాస్యయందు రసికాగ్రణి వేంకటమంత్రివర్యుఁ డ
స్తోకచరిత్రుఁ డూర్జితయశోజిత పూర్ణశశాంకుఁడై ధరన్
జోకఁ జెలంగుచు న్గనియె సూనుల మాన్యులఁ గృష్ణపార్యునిన్
బ్రాకటలీల లింగఘను భవ్యమతిన్ బెరుమాళ్ల మువ్వురన్.

క. ధీరుఁడను లింగనాఖ్యుఁడ
వారలలోపలను వంశవర్ధిష్ణుఁడనై
శ్రీరామపదాంబుజ సే
వారతి కవితారమావివర్ధితమతినై.

క. విహితముగఁ గవితఁ జెప్పను
మహినుత మృదుశబ్దచిత్ర మాధుర్యంబుల్
రహిఁ గనుపడ రసికాగ్రణు
లహరహమును సన్నుతింప నతి హర్షమునన్.

చ. మలయుచుఁ దేనియ ల్గులుకు మాటల నింపుల పెంపులౌ వైఖరిన్
జెలిమిని నంటి పం డొలిచి చేతికి నిచ్చినరీతినుండినన్
జెలఁగుఁగవిత్వ మెన్న మును జేసిన వారికృతు ల్దలంప ని
చ్చలు నవి చాలవే కఠిన సంస్కృతశబ్దపదార్థము ల్గనన్.

క. నా నేర్చినటుల పెద్దల
యానతి గైకొని ప్రబంధ మలవడుచుటకున్
బూనితి నిట మత్కృతిపతి
యైన రఘుప్రవరుచర్య లని యెట్లనినన్.

* * * *

క. శ్రీవిష్ణుకథారచనా
ప్రావీణ్యు శుకద్విజేంద్రుఁ బరమాదరతన్
భావించి యలపరిక్షి
ద్భూవరుఁ డిట్లనియె హృదయపూరిత భక్తిన్.

మ. వనజాక్షుం డలశిష్ట సంతతులఁ బ్రోవ న్వాసుదేవాఖ్యచేఁ
దనర న్వృష్ణికులంబునం దుదితుఁడై తచ్ఛత్రుసంఘంబుఁ బే
ర్చిని మాయింపుచు భామినీమణుల రుక్మిణ్యాదులం బెండ్లియా
డిన వృత్తాంతము లెల్ల వేడ్కన్ వినఁగంటి న్మీరు చెప్ప న్దయన్.

క. వారలలోపల రవితన
యారత్నంబును వివాహమైనట్టివిధం
బేరీతియొ వినవలతున్
సారమతి న్విస్తరింపు సంయమివర్యా.

**Colophon :**

గద్య. ఇది శ్రీమద్వేంకటేశ్వర వరప్రసాదలబ్ధశృంగారకవితావిలాస తఱికెళ్లపాటి వంశోత్తంస వేంకటపతిమంత్రితనూజ లింగరాజ ప్రణీతంబైన సూర్యతనయాపరిణయంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

**End :**

ఉ. జంకెనఁ జూడ సిగ్గుపడు సందుకొన న్స్మరుఁ డెచ్చరింపఁగాఁ
బంకరుహాయతాక్షి యొకబంగరుకంబముచాటుఁ జేరి మీ
నాంకునితంత్రికత్రైదుట నలుఁగుచుఁ జెక్కుటఁ జేరినట్టితా
టంకరుచు ల్తళుక్కనఁ దటాలున నెమ్మొగ మోరఁ జేయఁగన్.

క. చేరఁగ వెంట నెపెకలిన
ధీరగుణప్రతతితోడ దృక్ప్రభ లటకున్
బేఱములువారెఁ గాసఖి
వారము గనికదియఁ చళ్లికి వారని . . . .

(వి-వి.)——

అసమగ్రము. ఆరంభమునుండి పంచమాశ్వాసమునఁ గొంత దాఁకఁ గలదు. వ్రాఁత తిన్ననిదే కాని తప్పు లెక్కువగాఁ గలవు. శైథిల్యము గలదు. గ్రంథపాతములు లేవు.

శ్రీకృష్ణమూర్తి కాళిందిని వివాహమాడు కథ యీ ప్రబంధమున వర్ణితమయినది. ఈ గ్రంథ మెన్ని యాశ్వాసములు గలదో యెఱుఁగరాదు. తఱికెళ్లపాటి లింగరాజకవి యేతద్గ్రంథకర్త. ఆతఁ డార్వేలనియోగి. ఆపస్తంబసూత్రుఁడు - మదనమోహినీ విలాసము, ఉత్తరహరిశ్చంద్రకథ, యీతని కృత్యంతరములు - విశేషముల కుదాహృత పద్యములఁ గాంచునది.

ఈ పుస్తకమున 1b, వీరభద్రవిజయము, 229a, భల్లాణచరిత్ర (ద్విపద) 264b సారంగధర చరిత్ర (ద్విపద) టీకయుఁగలవు.

---

## No 911. సూర్యతనయాపరిణయము.

## SŪRYATANAYĀPARINAYAMU

Substance, paper. Size, 12 × 9½ inches. Pages, 198. Lines, 19 on a page. Character, Telugu. Condition, good. Appearance, new. Mode of writing, bad Full of mistakes.

Breaks off in the fifth Āśvāsa

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము ఆదినుండి పంచమాశ్వాసమునఁ గొంతవఱకుఁ గలదు. వ్రాఁత మంచిదిగాదు తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

పూర్వమువలె. దీనికిఁ బూర్వము వర్ణితమయిన పుస్తకము మాతృకయగును.

---

## No 912. హంసవింశతి.

## HAṀSAVIṀŚATI.

Substance, paper. Size, 11⅝ × 7½ inches. Pages, 838 Lines, 20 on a page. Character, Telugu. Condition, slightly injured. Appearance, old Mode of writing, good but not free from mistakes. Written on only one side of the paper. Variations in the readings are interlined. Correct readings are written on the otherside of the paper.

Complete in two volumes.

Similar to the work described under R No 362 of the Triennial Catalogue of Telugu Mss., Volume III, Part III ; by Ayyalarāju Nārāyanakavi born in a family of poets, some of whom were Tippana, Parvatarāju Rāmabhadrayya, Bhāskara, etc. The author belonged to Puttēṭi family and Kauṇḍinya gōtra Jānakīnāyakaśatakamu, Sakala-kathāsārasaṅgrahamu, Rāmābhyudayamu and Sasyānandamu were written by the ancestors of this poet.

The following note by C P. Brown is found at the beginning of the work in the first volume.

"The Hamsa Vimśati or the Telugu Phœnix-The Swans tales being twenty amorous stories written by అయ్యలరాజు నారాయణప్ప to exemplify the Telugu language in topics of common life in every class of men.

The author has taken this mode to induce readers to learn the language who would have rejected the usual routine of study. Many of the verses (for instance II 47, 84, 85, IV 7, 8 on hills 9—22 on trees and so forth) are in reality mere vocabularies of similar words in no respect differing from the dictionaries of the language, which were in old times written in verse like the Śukasaptati and Kādambari

One would suppose the book was composed (like the chaha Darwesh in Persian * * * * * the Bagh-o-Bahar in Hindustani) to help those who study the language or like the Italian comedies of Buonaroti expressy written to furnish authorities for a dictionary. It precisely agrees in its topics and arrangement with the Decamerone of Boccacio and the Persian Totinama The learned Bramins with whom I read this book own their ignorance of hundreds of terms used by the poet, who they declare must have compiled his lists from the mouths of these tradesmen, etc., whose art he describes. I have used similar assistants in reading it and have had the trades explained to me by the Sudras who live by them"

* * * *

Those various readings which are in red ink were obtained since the edition of 1830 was framed and therefore are unnoticed in the index of words then prepared.

"C P BROWN 1845."

"Read this chapter in December 1827"

The following note by C. P. Brown is found on the first page of volume II :—

"Hamsavimśati" a series of love tales written by Puttēti Ayyalaraz Nārāyanapa, son of Rāmabhadraya, author of the Rāmābhyudaya.

*N.B*—That దుస్సంధి, అఖండయతి and అన్యదేశ పదములు perpetually occur in this book, the author having in such cases sacrificed elegance to utility.

* * * *

"In some of the lists we find the same word two or three times, and that in verse, not in prose, where such over-sights in the author are more easily rectified."

**Beginning :**

శా. శ్రీరామాంశజమైన జానకి నురస్సీమాంత మత్యంత వి
స్తారప్రోజ్జ్వలహారనాయక మణిసంద ర్శ్యమానస్వకా
కారం బారసి యన్యకాంతయని శంకల్ం జెందుచు న్సదా
తా రమ్యంబగునంకపీఠి కడు సీతాభర్త గన్ బ్రోవుతన్.

* * * *

ఉ. నన్నయభట్టు భీమకవినాథుని దిక్కన సోమయాజిం బె
ద్దన్నను ముక్కుతిమ్మసచివాగ్రణి బమ్మెరపోతరాజు గా
రన్నను రంగనాథుని మహామహులం బిల్లల మఱ్ఱి వీరభ
ద్రు న్నుతియింతు నంధ్రకవిరుద్రుల సత్కరుణా సముద్రులన్.

ఉ అయ్యలరాజు తిప్పసచివాగ్రణి బక్కతరాజు రామభ
ద్రయ్యను భాస్కరాగ్రణిం బ్రధానవరుండగు కొండధీమణిన్
జయ్యనం దిమ్మయప్రభుని సత్కవితారచ నాఢ్యులైన మా
యయ్యలరాజు వంశజుల నాది కవీంద్రుల సన్నుతించెదన్.

* * * *

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును . . . . . గావించి
తదనంతరంబు.

సీ. . . . . . . . . . . . . . .
మంత్రిమాత్రుండె యతండు దుర్మంత్రి మంత్ర
తంత్ర సంత్రాసకరణ స్వతంత్రుం డయలు
రాజవంశసుధా వార్ధిరాజసూర
యార్య నారాయణామాత్యవర్యుం డలరు.

వ. వెండియు . . . . కౌండిన్య గోత్ర పవిత్రుండును,
కొండమాంబా గర్భవారాశిచంద్రుండును నగు నయ్యలురాజు నారాయ
ణామాత్య దేవేంద్రుండు కొండొక శుభ వాసరంబున నత్యంత సంతో
షితాంతః కరణుండై.

* * * *

క. భామాయుత కామాయిత
కోమలసుందర శరీర గురుధామునకున్
భీమరిపుస్తోమవపుస్
క్షేమతమస్సోమునకును శ్రీరామునకున్.

వ. అంకితంబుగా నా యొనర్చంబూనిన హంసవింశతియను మహా ప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

**End:**

ఉ. మున్నలరావణాదులు సముద్ధతి సాధ్వులఁ గోరి యేమి సౌ
ఖ్యోన్నతిఁ జెంది రట్లగుట నుర్వి జనావళు లన్యకాంతలన్
బన్నుగఁ గోరరాదు కడు పాతక మంచుఁ దలంచి యుంతి పై
నున్నమనీష పీడొఱని యథోచిత పద్ధతినుండె భూవరా.

క. అనుచుఁ బురోహితుఁ డెఱిఁగిం
చిన నలరాజన్యమౌళి చిత్తాంభోజం
బున నద్భుత ప్రమోదం
బెనయఁగ మెచ్చుకొని రాజ్యమేలుచు నుండెన్.

* * * *

మాలిని. సురుచిరతర కీర్తి సుందరోదార మూర్తీ
సరసిజనిభవదనా సంతతోత్సాహసదనా ?
గురుతరవసుచేలా కుంభితోక్తానుకూలా
పరమభవవినాశా పార్వతీహృన్నివేశా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమత్కౌండిన్యస గోత్రపవిత్ర అయ్యలు రాజాన్వయ సుధావార్ధి సంపూర్ణ పూర్ణిమాచంద్ర నిస్సహాయకవిత్వ నిర్మాణచాతుర్య నిస్తంద్ర శ్రీరామనామ పారాయణ నారాయణామాత్య ప్రణీతంబైన హంస వింశతియను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. రెండు సంపుటములలోఁ గలదు. పుట కొక ప్రక్కనే వ్రాఁతగలదు. ఎదిరి ప్రక్కలఁ బాఠభేదములు వ్రాయఁబడినవి. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

హంసవింశతియని పేరుగల యైదాశ్వాసముల యీ రసవత్ప్రబంధమున శృంగార నీతి పూరితములగు కథ లిర్వది గలవు. ఇది శుకసప్తతిని బోలిన ప్రబంధము. గ్రంథకర్త అయ్యలురాజు నారా

యుణకవి. ఈతని వంశమున తిప్పన, పర్వత రాజు, రామభద్రయ్య, భాస్కరుడు, కొండయ్య, తిమ్మయ్య యనువారు కవులైనట్లు ఈతఁడు చెప్పుకొన్నాఁడు. పుత్తేటివారనియు కీర్తి ఇంటిపేరు వీరు కౌండిన్య గోత్రులు జానకీనాయకశతకము సకల కథాసారసంగ్రహము, రామాభ్యుదయము, సన్యాసనందము, అను గ్రంథములు మీఁదఁ బేరొకొనఁబడిన వారు వీరి పూర్వులు రచించినవగును.

---

## No 913. హంసవింశతి.

## HAṀSAVIṀŚATI.

Substance, paper Size, 8½ × 7 inches. Pages, 25. Lines, 18 on a page. Character, Telugu. Condition, injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes

Breaks off in the course of the second Āśvāsa

Same work as the above.

(వి.-వి.)—

అసమగ్రము. ద్వితీయాశ్వాసమునఁ గొంతపట్టు మాత్రము గలదు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు

పూర్వము వలె.

---

## No 914. హంసవింశతి.

## HAṀSAVIṀŚATI.

Substance, paper. Size, 12 × 8¼ inches. Pages, 298. Lines, 28 on a page. Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, goo but not free from mistakes The variations in the reading are noted on the left side of th margin

Complete

Same work as the above.

This seems to be a fair copy made at the instance of Mr. C. P. Brown in the year 1830.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు లేవు. వ్రాఁత పత్రమున కొక ప్రకరణే కలదు.

ఎదిరి ప్రకరణను పాఠభేదములు వ్రాయఁబడినవి. అందు శుద్ధ పాఠ ములు ప్రధానముగాఁ గైకొనఁబడినవి.

పూర్వము వోలె.

ఇది 1830 వ సంవత్సరమున బ్రౌను దొరగారు వ్రాయించిన శుద్ధ ప్రతి గాఁదగును.

---

## No. 915. హంసవింశతి.

## HAMŚAVIMŚATI.

Substance, paper. Size, 7¾ × 6⅜ inches. Pages, 509. Lines, 16 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete

Same work as the above The following note is found in the Ms "C. P. Brown, Cuddapa, December, 1826 "

(వి.-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి శైథిల్యము, గ్రంథపాతములు లేవు దీనిని బ్రౌను దొరగారు కడపలో 1826 వ సం॥ డిసెంబరు నెలలో వ్రాయించి నట్లున్నది.

పూర్వము వోలె.

---

## No 916. హరిశ్చంద్రనలోపాఖ్యానము.

## HARIŚCANDRANALOPĀKHYĀNAMU.

Substance, paper. Size, 11⅝ × 7¼ inches. Pages, 124 Lines, 21 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but contains mistakes. Written on only one side of the paper.

Complete.

Same text as that described under R. No 181 of the Triennial Catalogue of Telugu Mss, Vol II. For other particulars see the extracts given below.

**Beginning :**

ఉ. శ్రీవైదేహసుతన్ భృగూద్వహజయశ్రీ సజ్జభృచ్చాపవీ
లావాప్తి న్వరియించి సత్కరశలతత్త్వామాల్యమాంగల్యదీ

భూవాలంబగునాపరిగ్రహాయుగం బన్యోన్యహార్దంబునన్
సేవింపదగురామచంద్రుఁడు శుభశ్రీ లిచ్చు మా కెప్పుడున్.

*    *    *    *

వ. అని . . . యేను పురాతనపుణ్యశ్లోక చక్రవర్తి చంద్ర హరిశ్చంద్ర నలకథాయుగ యుగపదనుసంధానబంధుర రసానుబంధంబగు చిత్రప్రబంధంబు నిర్మింపఁబూనియున్న సమయంబున నొకనాఁడు మదీయస్వప్నంబున.

సీ. . . . . . . . .

ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత
పాబలంబునఁ గడుఁబీరువోనిగాంచి
వాఁడ ననుచు నిజానుభావంబుఁ దెలిపి
పలికె వాత్సల్యమున వటుప్రవరుఁ డొకఁడు

*    *    *    *

సీ. సుతులఁ జెకరుంద్ర శాశ్వతరామనామధ
న్యులఁ జేసి పిలుచు భాగ్యోదయంబు
రచితాగ్రహారంబు రామ చంద్రపురాంక
పూతం బొనర్చిన పుణ్యరేఖ
నవదివ్యభవనంబు సవరించి శ్రీరామ
విభుఁ బ్రతిష్ఠించిన విపులమహిమ
రామసరోనామ రమణీయముగఁ దటా
కము వినిర్మించిన ఘనయశమ్ము

సఫలత వహింప నీహరిశ్చంద్రనలక
థాయుగనిబంధ చిత్రబంధప్రబంధ
మంకిత మొనర్పు రఘు భర్త కఖిలకర్త
కురుతరాభీప్సితము లెల్ల నొదవు నీకు.

మ. అని యంతర్హితుఁడైన . . . .

సీ. . . . . . . . . .

ప్రతినవబ్రహ్మచర్యాప్తి భవ్యతరత
పాబలంబునఁ గడు బీరువోనిగాంచి
వాఁడు నలయంజనా నందవర్ధనుండె
కాక యొరులకు నిట్టి వైఖరులుగలవె.

తే. తాదృశకవిత్వనిధిలాభధన్యుఁ జేసి
నన్నుఁ బ్రోచినయంజనానందనునకుఁ
దగవ కాదె తదర్హముద్రాహితోప
దేశభారంబని నుతించెఁ గౌశలమున.

చ. తమదితపద్ధతిం గృతికి దాశరథింబతిఁ జేసి తత్త్రయీ
విదితచరిత్రవైభవము విశ్రుతసన్మునిపావనాననా
భ్యుదితసరస్వతీవినుతియోగ్య మనోహితశక్తియైన త
త్పదయుగభక్తియొకరయఖుతం బచరించి నుతింతు నెంతయున్.

సీ. . . . . . . . .

పతికృతాఖిలశాప మూర్ఛితమునిప్రి
యాపునర్జీవన మొనర్చు నమృతమూర్తి
శ్రీరఘూత్తముఁ డతని చారిత్ర మెటిది
పుట్టుపుట్టువులకుఁగాక పొగడఁదరమె.

* * * *

క. ఏతాదృశశుభమహిత
ఖ్యాతాసమసమరవిధికిఁ గరుణాంబుధికిన్
శీతాగమ జాతాగమ
ధీతాగమసదృశ నిరవధియశోనిధికిన్.

* * * *

సీ. వననిధిలంఘనకృపావర్ధితోభయకవి
తాకళారత్న రత్నాకరుఁడు
సకలకర్ణాట రక్షాధురంధరరామ
విభుదత్తశుభచిహ్న విభవయుతుఁడు
వసుచరిత్రాది కావ్య ప్రీతబహునృప
ప్రాపితాయత్న రత్నాస్నపుండు
శాశ్వతశ్రీవేంకటేశ్వరానుగ్రహా
నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁడు
శ్రీకరమహాప్రబంధాంకసింగరాజ
తిమ్మరాజప్రియసుత నూజవీటిసూర
పౌత్త్రుఁడు రామనృప భూషణాఖ్యసుకవి
సంకిత మొనర్చె నీకావ్య మనఘభక్తి.

• వ. ఇవ్విధంబున . . . చేయంబూనిన హారిశ్చంద్రనలోపాఖ్యానంబను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన.

* * * *

తే. అలరు మణివప్రవిజిత హేమాద్రి నిషధ
నగరమవనింసమఖిల భూనగరములకు
లలితజయసంపదలు వొల్చునిలనయోధ్య
లఘుగభీరాంబుపరిఖా కలాప మగుచు.

**End:**

క. అనియిట్లు పాండుసుతునకు
జనసుతుండు మృకండుసుతుండు చతురత నెఱిఁగిం
చిన యాకృతివినుచుండెడి
ఘనులకు సిరులొసఁగు మహిమకరవంశభవా.

* * * *

పం. అయాశ్రయాధరాధరామృతామృతా హృతాన్వతా
జయావ్యయాపరాపరాయ సాధ్వసాసుసాహసా
న యాలయానిరాకరా సనావ్రత(?)నాజనావనా
దయామయాచిరాహరా సదాప్రదాచిదాస్పదా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమద్రామచంద్రచరణారవిందవందనపవననందనప్రసాదసమాసాదిత సంస్కృతాంధ్ర భాషా సామ్రాజ్య సర్వంకషచతుర్విధ కవితానిర్వాహక సాహిత్యరసపోషణ రామరాజభూషణ ప్రణీతంబైన హారిశ్చంద్ర నలోపాఖ్యానం బను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత చక్కఁగా నున్నది. తప్పు లున్నవి. వ్రాఁత పత్రమున కొక్కప్రక్కనే కలదు. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు.

ఇది హారిశ్చంద్రుని కథయు, నలునికథయు జతగా రెండర్థములలో వచ్చునట్లు రచియింపఁబడిన యైదాశ్వాసముల ద్వ్యర్థిప్రబంధము. గ్రంథకర్త రామరాజ భూషణకవి. ఉదాహృత పద్యములఁబట్టి కవి విషయ మెఱుఁగునది.

ఇది ఆర్ 181 రున వర్ణితమే.

No. 917. హరిశ్చంద్రనలోపాఖ్యానము.

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU

Substance, palm-leaf. Size, 18¼ × 1½ inches. Pages, 72. Lines, 8 on a page. Character, Telugu. Condition, much injured Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Breaks off in many places.

Complete

Same work as the above

(ఐ-ఐ.)—

సమగ్రము. వ్రాంత చక్కనిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగాఁ గలవు.

పూర్వము వ్రాఁతె.

---

No. 918. హరిశ్చంద్రనలోపాఖ్యానము.

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU

Substance, palm-leaf Size, 17⅝ × 1¼ inches. Pages, 89 Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes. Breaks off in some places.

Imperfect and incomplete.

Same work as the above

(ఐ-ఐ.)—

అసమగ్రము. పంచమాశ్వాసము కొంతదాఁకఁ గలదు, వ్రాంత చక్కనిది తప్పు లున్నవి. కొన్ని పత్రములు పోయినవి. శైథిల్యము, గ్రంథపాతములుగలవు.

పూర్వముు వ్రాఁతె.

---

No 919. హరిశ్చంద్రనలోపాఖ్యానము.

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, 11¾ × 8¾ inches Pages, 96. Lines, 19 on a page. Character, Telugu. Condition, much injured Appearance, very old. Mode of writing, fair but not free from mistakes

Complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము, వ్రాఁత తిన్ననిదే తప్పులు గలవు. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువారిదె.

---

No. **920.** హరిశ్చంద్రనలోపాఖ్యానము.

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 14½ × 1½ inches Pages, 132 Lines, 6 on a page Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Incomplete

Same work as the above

(వి-వి.)—

అసమగ్రము. తొలి రెండు పత్రములు పోయినవి. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు గలవు.

పూర్వమువారిదె.

---

No **921**. హరిశ్చంద్రనలోపాఖ్యానము.

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf. Size, 17⅛ × 1⅜ inches. Pages, 92 Lines, 6 on a page Character, Telugu Condition, much injured Appearance, old Mode of writing, good but not free from mistakes.

Complete, but wants a small portion at the end of the first Āśvāsa.

Same work as the above

(వి-వి.)—

సమగ్రము. కాని, ప్రథమాశ్వాసాంతమున నాలుగు పుటల గ్రంథము కొఱఁతగా నున్నది. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యముగలదు. గ్రంథపాతములు లేవు.

పూర్వమువారిదె.

---

No **922** హరిశ్చంద్రనలోపాఖ్యానము (సవ్యాఖ్యానము).

HARIŚCANDRANALŌPĀKHYĀNAMU

(WITH COMMENTARY).

Substance, paper Size, 12½ × 7⅛ inches. Pages, 231 Lines, 24 on a page Character, Telugu. Condition, fair. Appearance, very old. Mode of writing, good but contains mistakes and breaks off in many places

Wants the introductory portion of the commentary; otherwise complete.

Same work as that described under R. No. 181 of the Triennial Catalogue of Telugu Mss., Vol. II

The following note by Mr C. P Brown appears on the fly-leaf of the Ms :—

" There are two commentaries on this poem : of these the oldest is given in this volume. It is brief and far from sufficient. The larger commentary is modern and was composed at Masulipatam."

(వి-వి.)—

సమగ్రము, కాని వ్యాఖ్యాత రచించిన యవతరణిక కొఱఁతగా నున్నది. వ్రాఁత మంచిదే కాని తప్పులుగలవు. పెక్కు పట్టులందు చిన్నచిన్న గ్రంథపాతములుగలవు.

ఇది R. No. 181 లోఁ వర్ణితమైనదే.

---

## No. 923 హారిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU

Substance, paper. Size, 12¾ × 8 inches. Pages, 230 Lines, 19 on a page Character, Telugu. Condition, slightly injured. Appearance, old Mode of writing, good but full of mistakes. The variations in the readings are interlined.

Complete but imperfect.

Same work as that described under R No. 520 (*b*) of the Triennial Catalogue of Telugu Mss , Vol. III. The author Śankarakavi, son of Dēcana of Kaundinyagōtra, has dedicated this work to Nīdūri Ellanāmātya who lived in the village Kōrkāla, and who was the son of Pedalingamamba and Bācanāmātya. The work under notice is based on the Dvipada Hariścandracaritra written by Vīraśarabhakavi. For other particulars see the extracts given below

**Beginning:**

శా. శ్రీవాణీ వరవాసవాదివిబుధ శ్రేణీశిరోరత్నశో
భావిభ్రాజితపాదపంకజుఁ డుమాభామామనోభర్త కా
శీ విశ్వేశ్వరుఁ డెల్లకాలమును రక్షించు న్మహోదారవి
ద్యావర్ధిష్ణుని బాచయప్రభుని యెల్లామాత్యచూడామణిన్.

* * * *

• వ. అని యిష్టదేవతా ప్రార్థనాపూర్వకంబుగాఁ గృతీశ్వరున కాశీర్వచనంబు లొసంగి.

* * * *

క. విమలకవిత్రయనిర్మిత
సముధికరసవత్ప్రబంధ సాహిత్యకళా
సుమనస్తటినీకల్లో
లములం గ్రీడింతు నిఖిలశంకప్రతిభన్.

* * * *

వ. అని సకలసుకవిజన నమస్కారంబునుం గుకవిజన తిరస్కారంబునుం గావించి యే నొక్క ప్రబంధం బల్లన ననుసంధింపం బూను సమయంబున.

సీ. . . . . . . . .

కాఁగ వెలసినచంద్ర శేఖరపదార
విందసేవాకళాలబ్ధ విభవశాలి
మాన్యుఁ డీదూరి యెల్లనామాత్యమౌళి
యుల్ల మానందమునఁ బొంది యొక్కనాఁడు.

* * * *

మ. ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలతు
ల్యనిరాఘాటవచోధురంధరుని దేచామాత్యుసత్పుత్త్రుఁ బా
వనచారిత్రు శశాంకమౌళిపద సేవాలబ్ధసాహిత్యధీ
ధనుసిన్ బంధువిధేయు శంకరకవిన్ దాక్షిణ్యపుణ్యాధికున్.

తే. మమత రావించి యుచ్చాసనమున నుంచి
తత్పరత మీఱ గంధాక్షతంబు లాది
గాఁగఁ గర్పూరతాంబూల కనకభూష
ణాంబరంబులు దనియ నందందయొసఁగి.

తే. సప్త సంతానములలో యశస్కరంబు
కృతియె గావున నీ వొనరించునట్టి
నిరుపమాన హరిశ్చంద్ర నృపచరిత్ర
మంకితముసేయు నాపేర ననఘచరిత.

వ. అనుటయు నట్లకాక యని యంగీకరించి . . . శాండిల్యగోత్ర ప్రవర్ధన క్రియాధుర్యుఁ డును నగు నీదూరి యెల్లనామాత్యు వంశావతారం బభివర్ణించెద.

* * * *

తే. ఆమునీశ్వర వంశదుగ్ధాంబునిధికిఁ
బూర్ణనీహారకిరణుఁడై వర్ణనీయ
మహిమ విలసిల్లె గంగనామాత్యవర్యుఁ
డనఘమతి పల్లికుర్వ పురాంకుఁ డగుచు.

* * * *

ఉ. యాచకలోకరక్షణ సమంచిత భూరిదయాగుణక్రియా
ఖేచరువంశపావను మృగీనయనాజన పంచబాణు వి
ద్యాచతురాస్యు నీశ్వరపదాంబురుహాశ్రయ చంచరీకమున్
బాచయ మంత్రిపుంగవునిఁ బ్రస్తుతిసేయుదు రార్యు లెప్పుడున్.

క. ప్రెగడన మంత్రియశోరుచి
నగుఁ దుహినాచలముఁ బక్షినాయకుగళమున్
నగభిద్దంతావళమును
గగనధునీజలముఁ జంద్రకాంతోపలమున్.

చ. మకరగుఁడాకృతిన్ హిమసముద్యుతి నిర్మలకాంతి విష్ణుసా
యకుఁడు విభూతిఁ బాండుతనయాగ్రణి ధర్మగుణప్రశస్తి హా
టకగిరి ధైర్యవృత్తిఁ గపటప్రతిరక్షిత మోటు (ది) నేందు బ
ల్లికురువ (వృ)ద్ధమంత్రిసుతు లీనుతిం బెదనప్పనార్యునిన్.

వ. అనఘుఁడు ఎల్లెపూడి కొమరాధిపకూరిమిపుత్రి నద్రినం
దనయనగొప్ప పద్మనయనం బెదలింగమఁ బెండెకంటిశా
సనుఁడగు పర్వతయ్యసుతఁ జంద్రముఖిం జినలింగమాంబనిం
పెన్న(య)ఁగఁ బెండ్లియాడె విభవేంద్రుఁడు బాచయమంత్రి
యున్నతిన్.

* * * *

సీ. అనఘవర్తనుఁడు బాచనమంత్రివర్యుండు
హరిణాక్షి పెద లింగమాంబవలన
నిద్ధతేజోనిధి నెల్లనామాత్యుని
హేమాద్రి సమధీరు హేమఘనుని
చిన లింగమాంబికావనరుహానయనందు
రసికశేఖరుఁ బెద రామవిభుని
పినరామధీమణిఁ బ్రియవచోవైఖరీ
ప్రతిభాసమగ్రునిఁ బర్వతయ్యఁ

గనియొవారలు వంశమాకందపాళి
కావసంతులు హరిదంతకరటిదంత
కాంతినివహానుకారి నితాంతకీర్తి
రుచివిభూషణు లర్థార్థి ఖచరపతులు.

ఉ. రామభుజాబలాఢ్యునిఁ బురందరవైభవధుర్యు బాంధవా
రామవసంతమూర్తి నమరద్రుమ పుష్పమరందభూరిధా
రామధురోక్తివైభవ ధురంధరు నెన్నెద వీరమంత్రి శ్రీ
రామనదండనాయకుని రాజసభాభవనాంతరంబునన్.

*  *  *  *

సీ. . . . . . . . .
అతఁడు కరహాట లాట కర్ణాట యవన
కుంతలావంతి నృపసభాభ్యంతరాళ
సుకవిగాయక లోకసంస్తుత్యకీర్తి
నిత్యుఁ డీడూరి యెల్లనామాత్యవరుఁడు.

మ. పెది రామయ్యను బాచమంత్రిసుతుఁ గాంభీర్యాంబుధిం గామినీ
మదనుం బేరొనవచ్చు రాజసభల న్మందాకినీచందన
త్రిదశక్ష్మారుహతారహారనిభ కీర్తిస్ఫూర్తి సంపూర్ణ (స)
ర్వదిశాభాగుని మేరుశైలధృతి గీర్వాణాధిపప్రాభవున్.

క. వనరాశి సమగభీరుని
బినవీరనమంత్రివర్యుఁ బేరొనఁగఁ దగున్
దనరారు వేడ్క యాచక
జనరాధాతనయు బాచసచివాత్మజునిన్.

క. పర్వత మంత్రిం(ద్రు)ని హిమ
పర్వత ఘన ధైర్యధుర్యు భామాజన దృ
క్పర్వతనూసౌందర్యు సు
పర్వతరుత్యాగశీలుఁ బ్రణుతి యొనర్తున్.

క. అం దగ్రజుండు లోకా
నందకరుం డొప్పు నింద్రనందన ధనరా
ణ్ణందన లక్ష్మీనందన
సౌందర్యస్ఫూర్తి నెల్ల సచివుండు ధాత్రిన్.

*  *  *  *

సీ. . . . . . . . . .
విందు వీడూరి యెల్లప్పక్ష్మాకళత్ర
దండనాథుయశః కాంతి మండలములు
దిక్సరోజాతలోచనా దీర్ణకర్ణ
కుసుమ ముక్తాఫలభ్రాజికు తలములు.

శా. వేదార్థప్రతిపాదనప్రకట విద్యాధురీణుండు నా
ద్యా(దర్థేం)దుకళావతంసుఁడు సమగ్రప్రాభవాఢ్యుండు నై
కేదారేశ గురుండు సత్కృపఁ గటాక్షింపంగ వర్ధిల్లు ని
త్యోదారప్రతిభాగుణాభరణు నీడూరెల్లనామాత్యుఁగన్.

* * * *

తే. సరససారసదినరాజు సత్తిరాజు
లింగయామాత్య పుత్త్రి నాళీకనేత్రి
రూపకులశీలనుత భవానీపురంధ్రి
చెలిమి వరియించె నీడూరి యెల్లమంత్రి

\- * * *

ఉ. భావజరూపవిభ్రమ విభాసితుఁ డెల్లనమంత్రికిన్ భవా
నీవరవర్ణినీమణికి నిర్మలకీర్తులు గల్గి రాత్మజుల్
కోవిదవర్ణనీయు లతికోమలమూర్తులు బంధులోకసం
భావనదక్షులై తనయ బాచనయున్ గఱకంఠమంత్రియున్.

* * * *

క. నిరుపమ సత్కార్య ధురం
ధరునకు శాండిల్యగోత్రునకు బాచమహీ
వరమంత్రి తనూభవునకు
నరనుతుఁ డీడూరి యెల్లనామాత్యునకున్.

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన హరిశ్చంద్ర చరిత్రంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన

**End:**

వ. ఇవ్విధంబునఁ బౌరజననికాయస్తూయమానుండై హరిశ్చంద్రుండు మహానందంబునం బొంది నిజమందిరంబు ప్రవేశించి సముచిత వర్తనంబుల బ్రవర్తింపుచు నయ మార్గంబునఁ బ్రజాపాలనశీలుండై పూజ్యంబగు రాజ్యంబు సేయుచుండె నని.

క. మునిపతి మార్కండేయుం
డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్
వినిపించె హరిశ్చంద్రా
వనినాథుకథాక్రమం బపార్యప్రౌఢిన్.

*     *     *     *

క. అలఘుప్రతాపకుతుపన
మలకేంద్ర కృపాసమగ్ర మహిమాన్వితకో
రోఁగలని గ్రామనికేతన
జలసీమాంతస్థ నేక చాతుర్యనిధీ.

ఉత్సాహ. రాట్సభాంతరాళధీధురంధర ప్రశస్తప్రా
వృట్సమాగమాంబుభృన్నిపీనదానగర్విత
ద్విట్సమాజదంతి సింహధీరతామరాచలా
పట్సహస్రవాశరుద్ధ సాగరస్తుపాధిపా.

**Colophon :**

గద్య. ఇది శ్రీమదాపస్తంబ సూత్ర పవిత్ర కౌండిన్యముని చక్రవర్తి గోత్ర సకల సుకవిజనానీకమిత్ర దేచనామాత్యపుత్ర వినయ వివేక విద్యాలంకార శంకరకవి నామధేయ ప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత తిన్ననిదేకాని తప్పులు పెక్కులు. పాఠభేదములు పంక్తులనడుమ నిఱికింపఁబడినవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు గలవు. ఈ ప్రతి 1841 వ సం॥ జూలై నెల 27 వ తేదికి లిఖింపఁబడినది.

ఐదాశ్వాసముల యీ ప్రబంధమున సత్యవ్రతుఁడగు హరిశ్చంద్ర చక్రవర్తి చరిత్రము వర్ణింపఁబడినది. గ్రంథకర్త శంకరకవి. దేచన కుమారుఁడు. కౌండిన్యగోత్రుఁడు కోరోఁగలను గ్రామవాస్తవ్యుఁడగు నీడూరి యెల్లనామాత్యునకీ కృతి యంకితము చేయఁబడినది. పెదలింగమాంబయు వాచనామాత్యుఁడు నీతని తలిదండ్రులు. ఇతఁడు దండనాథుఁడనియు, కుతుపనమలేంద్ర కృపాసమగ్రమహిమాన్వితుఁడనియు వర్ణింపఁబడెను. గౌరనామాత్యుని ద్విపద హరిశ్చంద్ర చరిత్రము ననుసరించి యీతఁడీ పద్యకృతిని రచియించెను. వీరశరభకవికృతిగూడ నిట్టిదే. విశేషముల కుదాహృత పద్యములఁ జూచునది.

## No 924. హారిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, palm-leaf Size, 13⅜ × 1⅜ inches. Pages, 278. Lines, 6 on a page. Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good but full of mistakes

Wants the first Āśvāsa ; otherwise complete.

Same work as that described under No 923 *ante.*

Date of transcription —Thursday the second day of the bright fortnight of the lunar month Caitra in the year Sarvajit. Name of the scribe ; Parangi Bābayya.

The following stanza appears at the end of the MS.

అసమగ్రము. ప్రథమాశ్వాసము మాత్రమే గ్రంథ సంపూర్తికిం గొఱంతగా నున్నది. వ్రాంత చకఁగానున్నదిగాని తప్పు లెకుఁవ.

ఇది నె 923 రున వర్ణించిన గ్రంథమే.

గ్రంథాంతమందీ వ్రాంత గలదు:—

శా. చారుస్ఫూర్తిని దొంటికంటెను హరిశ్చంద్రక్షమాభర్తకున్
శ్రీరమ్యంబుగ రాజ్యవైభవ బహుశ్రీ లిచ్చి రక్షించిన
ట్లారూఢ్యాంధ్ర శంకరుండు శివుఁ డుద్యత్ప్రీతిమైఁ బ్రోచుధ
ర్మాక భాఘ్యనిబాచమంత్రి వరు నెల్లామాత్యచూడామణిన్.

"సర్వజిత్తునామ సంవ్వత్సర చైత్ర శు ౨ గురువారం రోజుఁ శ్రీభద్రకాళీసమేతా ఉప్మాంగ్గల రామలింగ్గార్పణంగ్గా పరంగ్గిబాబయ్య హాశ్చంద్రోపాఖ్యానం అయిదు ఆశ్వాసములుంన్ను సంపూర్ణంగ్గా వ్రాశిసమర్పించ్చెనూ."

---

## No 925. హారిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper Size, 12⅝ × 8 inches Pages, 245. Lines, 21 on a page Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

This seems to be the original of the Ms. described under No. 923 *ante.*

Same work as that described under No. 923 *ante.*

Date of transcription.—3rd April 1842.

(వి-వి.)—

అవతారిక తకఁ దకిఁన గ్రంథమెల్లఁ గలదు. వ్రాంత బాగుగా నున్న, దిగాని నిరుపముగాదు. ఇది తీరిన ప్రతియగు. నె 923 రున

వర్ణించిన ప్రతికి మాతృకవలెనున్నది. ఈ ప్రతి 1842 వ సం॥ ఏప్రిల్ నెల 3 వ తేదిని లిఖింపఁబడినదట.

ఇది నె 923 రున వర్ణితమగు గ్రంథమే.

---

## No 926 హరిశ్చంద్రోపాఖ్యానము.
## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper Size, $12\frac{5}{8} \times 7\frac{7}{8}$ inches Pages, 229. Lines, 18 on a page Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but full of mistakes

The different readings are interlined.

Complete but imperfect.

Same work as that described under No 923 from which the Ms. under notice was copied.

The Ms. is dated "28th September 1841."

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే. తప్పులు హెచ్చుగా నున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు హెచ్చుగాఁగలవు. కొన్ని పాఠభేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. ఈ ప్రతి 1841 వ సం॥ సెప్టెంబరు నెల 28 వ తేదికి వ్రాయఁబడినదట

ఇది నె 923 రున వర్ణితమైన ప్రతికి పుత్రికగావచ్చును.

---

## No 927. హరిశ్చంద్రోపాఖ్యానము.
## HARIŚCANDRŌPĀKHYĀNAMU

Substance, paper. Size, $9\frac{7}{8} \times 6\frac{1}{8}$ inches Pages, 369. Lines, 15 on a page. Character, Telugu Condition, much injured. Appearance, very old. Mode of writing, good but contains some mistakes

This Ms. greatly differs from the other copies of this work

Complete but wants the dedicatory stanzas.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రము. కాని కృత్యవతరణిక లేదు. వ్రాఁత మంచిది. తప్పులున్నవి. ఇతర ప్రతులకును దీనికిని అనేక పాఠములందు భేదము గలదు.

పూర్వము వోలె.

గ్రంథారంభమున నొక పత్రముపై నిట్లు గలదు :—“ . . ఇతడు బాగా చెప్పినాడు గాని కవి వీరశరభయ్య యీ కావ్యము నేపట్టి పునః పద్యకావ్యమును రచియించినాడు. ఇతని కావ్యమే ఉత్తమమయినది.”

---

## No 928. హరిశ్చంద్రోపాఖ్యానము.
## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, 12⅝ × 8 inches. Pages, 689. Lines, 22 on a page. Character, Telugu. Condition, injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Corrections are interlined throughout the Ms. The Ms is dated “16th June 1847.”

Wants the introductory portion, otherwise complete.

Same work as the above.

(వి-వి.)—

సమగ్రమేకాని గ్రంథావతరణిక లేదు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. సంస్కారములు పెక్కులు బంతులనడుమఁ జేర్పఁబడినవి. ఇది 1847 వ సం॥ జూను నెల 16 వ తేదికి వ్రాయఁబడినదట.

పూర్వము వలె.

---

## No 929. హరిశ్చంద్రోపాఖ్యానము (సవ్యాఖ్యానము).
## HARIŚCANDRŌPĀKHYĀNAMU (WITH COMMENTARY).

Substance, paper. Size, 12½ × 8 inches. Pages, 596. Lines, 22 on a page Character, Telugu Condition, injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

The variations in reading are interlined throughout the Ms.

Wants the introductory portion ; otherwise complete.

Same work as that described under No. 936 *ante* This is a transcript of the Ms. described under No 936.

Date of transcription —27th June 1846 A.D.

(వి-వి )—

సమగ్రమేకాని కృత్యవతరణిక లేదు. వ్రాఁత చక్కనిది. తప్పు లున్నవి. సంస్కారము లనేకములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. ఇది 1846 వ సం॥ జూను నెల 27 వ తేదికి వ్రాయఁబడినదట.

ఇది నె 936 దున ప్రతికి మాతృక, ఇది చిత్తుప్రతి, అది తీర్చిన ప్రతి.

---

No **930**. హరిశ్చంద్రోపాఖ్యానము, సవ్యాఖ్యానము.

HARIŚCANDRŌPĀKHYĀNAMU WITH COMMENTARY.

Substance, paper. Size, 12⅝ × 8 inches. Pages, 637 Lines, 22 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, old. Mode of writing, good and free from mistakes. The variations in reading are interlined throughout the MS

Wants the introductory portion; otherwise complete.

Same work as the above the name of the commentator is not given but it is presumed that this commentary was written at the instance of Mr. C. P. Brown.

The following note in the handwriting of Mr. C. P. Brown is found in the beginning of the work· —

"This volume has been carefully revised and corrected by Vencatsubbaya Sastri."

**Beginning :**

Text—

ఉ. శ్రీకరవైభవాఢ్యుఁడు హరిత్పతి ముఖ్యుఁడు సర్వదేవతా
నీకశిరఃకిరీటమణి నిర్మలపాద సరోజుఁ డర్జునా
నేకపవాహనుండు పవినిర్దళితాద్రి శచీకళత్రుఁ డా
నాకమునందు వేడ్క నొకనాఁడు మహామహిమాభిరాముఁడై.

Commentary—

టీ. శ్రీకర। సంపత్కరమైనటువంటి। వైభవ। ప్రాభవములకు। ఆఢ్యుడు। నాథుడైనటువంటిన్ని। హరిత్పతి। దిక్పాలులలోను। ముఖ్యుడు। శ్రేష్ఠుడైనటువంటిన్ని। సర్వదేవతా। సమస్తమైన వేల్పులయొక్క। అనీక। సేనయొక్క। శిరః। తలలయందలి। కిరీట। కోటీరములయందున్నటువంటి। మణి। రత్నములచేతను। నిర్మల। పరిశుద్ధమైనటువంటి। పాదసరోజుడు। పద్మములవంటి చరణములుగల వాడైనటువంటిన్ని। అర్జున। తెల్లనైనటువంటి। అనేకప। గజమును। వాహనుండు। యానముగాగల వాడైనటువంటిన్ని। పవి। వజ్రాయుధముచేతను। నిర్దళిత।

భేదించబడ్డటువంటి। అద్రి। పర్వతములుగల వాడైనటువంటి। శచీకళత్రుడు। శచీదేవి భార్యగాగల దేవేంద్రుడు। అనాకమునందు। ఆస్వర్గమందు। వేడ్కన్। కౌతూహలముచేతను ఒకనాడు। ఒకదినమందు। మహామహిమ। అతి మాహాత్మ్యముచేతను। అభిరాముడై! ఒప్పుచున్నవాడై॥

**End:**

Text—

క. మునిపతి మార్కండేయుం
డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్
వినిపించె హరిశ్చంద్రా
వనినాథు కథాక్రమం బవార్యప్రౌఢిన్

Commentary—

టీక. మునిపతి। ఋషిశ్రేష్ఠుడైన। మార్కండేయుండు॥ యుధిష్ఠిరునకును। ధర్మరాజుకు। అనురాగమునన్। ప్రేమతోను। హరిశ్చంద్రావనినాథుకథాక్రమంబు। హరిశ్చంద్ర మహారాజుయొక్క కథాక్రమము। అవార్యప్రౌఢిన్। మిక్కలి దిట్టతగాను। వినుపించెను। వినికిజేసెను॥

* * * *

Text—

ఉత్సాహ. రాట్సుఖాంతరాళ ధీధురంధరప్రశస్త ప్రా
పృట్సమాగమాంబుభృన్నపీనదాన గర్విత
ద్విట్సమాజదంతి సింహధీరతామరాచలా
పట్సహస్రనకంశ దుగ్ధసాగరక్షుపాధిపా.

**Colophon of the Text:**

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్రకౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకల సుకవిజనమిత్ర రేచనామాత్యపుత్ర వినయవివేక విద్యాలంకార శంకరకవినామధేయ ప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రమేకాని కృత్యవతరణిక లేదు. వ్రాంత చక్కనిది. తప్పులంతగా లేవు. బంతులనడుమ సంస్కారములు చేర్పఁబడినవి. శైథిల్యము, గ్రంథపాతములు లేవు.

ఇది పూర్వవర్ణితమగు గ్రంథమే కాని యిందు ప్రతి పద్యమునకు వ్యాఖ్యానముగలదు. వ్యాఖ్యాత పే రిందుఁ గానరాదు. వెంకటసుబ్బయ శాస్త్రియను వా రిందు మూలవ్యాఖ్యానములను సంస్కరించిరని బ్రౌను దొరగారు వ్రాసిరి. ఈ వ్యాఖ్య బ్రౌనుదొరగారి యానతిచే వ్రాయఁబడినది గావచ్చును.

---

## No **931**. హరిశ్చంద్రోపాఖ్యానము, సటీకము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU WITH COMMENTARY.

Substance, paper. Size, $12\frac{1}{2} \times 8$ inches. Pages, 70 Lines, **17 to 26** on a page Character, Telugu Condition, much injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes

Contains 106 stanzas (excluding the introductory stanzas) in the first Āśvāsa.

Same work as that described under No 932 ante., but this MS. contains the commentary.

(వి-వి.)—

అసమగ్రము. అవతారిక లేదు. ప్రథమాశ్వాసమందలి పద్యములు 106 మాత్రము సవ్యాఖ్యానముగాఁ గలవు. వ్రాఁత మంచిదే కాని తప్పులు గలవు.

ఇది నెం 932 రు (1) వర్ణ్యము గానున్న గ్రంథమే కాని యిందు వ్యాఖ్యానముగూడఁగలదు.

---

## No. **932**. హరిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper Size, $13 \times 8\frac{1}{4}$ inches. Pages, 227. Lines, 23 on a page. Character, Telugu Condition, slightly injured Appearance, very old. Mode of writing, fair but not free from mistakes.

Complete

Similar to the work described above. The author Vīraśarabhakavi was the son of Guruvamāmba and Śōbhanādri and was a Śaivite belonging to Kāśyapagōtra and Āpastambasūtra. This work is dedicated to god Mallikārjuna.

The following note appears on the fly-leaf of the MS :—

"This is the Hariścandra Catha written by Vīraśarabhaya of Canchi and therefore is often called the Canchi Cavyam.

The present is a new edition corrected throughout and carefully edited by Narasimhachari under my directions.

C. P. Brown,
Madras, March 1844."

**Beginning :**

శా. శ్రీలావణ్యసుధాబ్ధి పద్మజసునాసీరామరానీకది
క్పాలోద్యద్గణ ఖేచరప్రముఖశుంభ ద్దివ్యకోటీర ర
త్నాలంకార విరాజమానమృదుపా (దద్వంద్వుఁడైనట్టి గో
పాలస్వా?)మి యొసంగుమత్కృతికి శశ్వద్భోగ భాగ్యోన్నతుల్.

* * * *

ఉ. అత్యనుమోదభావ విదితాంధ్ర కవిత్వమహత్త్వతత్త్వ సా
హిత్యకళాధురీణు లని యెన్నెడు నన్నయభట్టుఁ దిక్కనా
మాత్యుని నెఱ్ఱనార్య బుధమాన్యుల భాస్కరు సోము భీము నా
చిత్యగతి న్నుతింతుఁ గవిశేఖరులౌట దలంచి మాటికిన్.

క. నానావిధ విద్యానిధి
శ్రీనాథకవీంద్రు మున్ను సేవింపుచు స
న్మానంబున ధరఁ గల్గు న
వీనకవిశ్రేణిఁ గొల్చి వేడ్క వహింపన్.

తే. పరమశైవప్రభావ సంపన్ను లగుచు
ధరణిఁ జెలువొందు మహుల గురువరేణ్యు
లనఘు లివటూరి పర్వతారాధ్యముఖ్య
జనుల సేవింతు సద్భక్తి ననుదినంబు

సీ. . . . . . . .
అమర శ్రీపతి పండితారాధ్యవంశ
మణిగణశ్రేష్ఠుఁ డనవద్యగుణగరిష్ఠ
ధన్యమూర్తి మదీయ మాతామహుండు
వీరనారాధ్యుఁ బ్రణుతింతు వివిధగతిని.

* * * *

చ. చదువుల కేమి లేక మతిచాలని చిల్కలఁ బంజరంబులన్
గదియఁగఁ జేసి మేలములఁ గైకొని దిద్దిన మాటలాడవే

విదితవివేకహీనులగు వేదురుల న్గణియింప నేల యా
పదలణఁగింప శంభుపదభక్తియె నిర్జరులంతవారికిన్.

*　　　*　　　*　　　*

క. అతులితమృదుమధురవచ
స్స్థితిచేఁ గృతిచేయునపుడు చెలువై నెలవై
మతిఁ దెలిసి సుజను లౌనన
ధృతిషెఱ మదన్వయంబు దెలియఁగ వలదే.

చ. వనజభవోపమాన పటువైభవదివ్యతపఃప్రభావస
ద్గుణనిధియై సమస్తముని కుంజరుఁడై కరుణాసమగ్రుఁడై
ఘనబలుఁడై జగజ్జనన కారణుఁడై తగు కశ్యపాఖ్యస
న్మునిపతి గోత్రకర్త యన మోదముఁ జెందు శుభాన్వయంబునన్.

క. వెలయఁ దదీయక్రమమున
సలలితగతిఁ జెంది వంశ సన్మణి యనఁగాఁ
గలిగె జగద్విదితంబై
కలితాపస్తంబసూత్ర కల్పక మనఁగన్.

ఉ. సత్యసమానశీలుఁ డతిసాధుసుహృద్గణ బంధుమిత్రసాం
గత్యవిహారచారుతర కౌతుకభూరిదయావిశాలుఁ డౌ
చిత్యకథావినోదపరిశీలుఁ డనం జెలువొందు తిమ్మయా
మాత్యవరేణ్యుఁ డార్య జనమాన్యుఁ డగణ్యవదాన్యవైఖరిన్.

క. సతతోత్సవమానసుఁ డ
ప్రతిమానవిశేషుఁ డతని పారంపర్య
స్థితివలనఁ గలిగె బుధనుత
మతి మత్ప్రపితామహుఁడు మహిమాన్వితుఁడై.

చ. సతతకళాధురంధరుఁడు శంభుపదద్వయ భక్తివైభవో
న్నతహితమానసుం డఘటనాఘటనాంచిత కార్యదక్షుఁ డ
ద్భుతకరుణావిధేయుఁ డతిపుణ్యుఁడు నీతిరహస్యధర్మవా
క్చతురుఁ డనంగఁ బెంపెసఁగు శంకరుఁ డార్యవశంకరస్థితిన్.

తే. మానఘనుఁడైనశంకరామాత్యమణికిఁ
దనయుఁ డనవద్యసుగుణసంతానమూర్తి
వినుతసత్కీర్తియుతుఁడైన వీరభద్ర
నామధేయుండు సంతతానందకరుఁడు.

మ. ఘనతేజోనిధివీరభద్రునకు సౌఖ్యప్రేమవాటిల్ల మ
జ్జనకుం డుద్భవమయ్యె భూరితర వాక్ప్రౌతుర్యగాంభీర్యస
ద్వినుతాచారమతిప్రసిద్ధుఁ డను రీతిన్ శోభనాద్రీశుఁ డ
త్యనుమోదాంచితశైవశాస్త్రముఖ విద్యాభ్యాసధౌరేయుఁడై.

తే. అరసి శ్రీపతిపండితారాధ్యవంశ
రత్న మగునట్టివీరనారాధ్యపుత్రి
భవ్యగుణపేటి గురువమాంబావధూటి
నతిముదంబున నుద్వాహ మయ్యె నతఁడు.

క. అనఘులు తజ్జాయాపతు
లని బుధహితబాంధవాదు లనుమోదింపన్
జనియించితి మదినలువురు
తనయుల మతివినయవిహిత ధర్మక్రియలన్.

చ. అనుపమసర్వశాస్త్రసముదంచితనీతియుగంధరుండు స
ద్గుణవినయాభిమాన పరితోషసముద్రుఁడు వీరభద్రుఁ డ
య్యనుజులు సూర్యనామఘనుఁ డయ్యనమంత్రివరేణ్యుఁ డంద్రు న
న్ననవరతంబు వీరశరభాహ్వయవైఖరిఁ దాల్చి రెంతయున్.

క. దీనావనహితమతికిని
ధీనుతమహనీయధృతికి దివ్యాకృతికిన్
శ్రీనగవాసవిలాసస
దానందస్థితికి మల్లికార్జునపతికిన్.

వ. అనవరతశోభనపరంపరాభివృద్ధి యగునట్లుగా నా రచియింపం
బూనిన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునకుఁ గథా సంవి
ధానం బెట్టిదనిన.

**End:**

మ. ఘనవిద్యాపరిపూర్ణసత్వనిధి మార్కండేయమౌనీంద్రుఁ డ
త్యనుకంపామతితోడ ధర్మజున కాద్యంతంబు వాక్ప్రౌఢిచే
జననాథోత్తమరత్నమై తగు హరిశ్చంద్రావనీనాథస
ద్గుణసంఘాతచరిత్ర చెప్పె బుధ సంతోషంబు వర్ణింపఁగన్.

* * * *

మాలిని. సలలితశుభపాదా సామగానప్రమోదా
కలుషభయవిఘాలా ఖండితారీంద్రజాలా

జలజరిపుకిరీటా జాహ్నవీతోయజాటా
చలితకరకురంగా సర్వభూతాంతరంగా.

**Colophon:**

గద్య. ఇది శ్రీమత్సదాశివ కరుణాకటాక్షలబ్ధ కవితావిధేయ వీర శరభ శుభనామధేయప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును బంచమాశ్వాసము.

(వి. వి.) —

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. చిన్నచిన్న గ్రంథపాతములున్నవి. శైథిల్యము లేదు. ఇది చెన్నపట్టణమున నరసింహాచార్యులచేత బ్రౌనుదొరగారి నిదేశమున సంస్కరించి వ్రాయఁబడినదట. దీనివ్రాఁత 1844 వ సం॥ మార్చి 28 వ తేదిని ముగిసినదట.

అయిదాశ్వాసముల యీ యపూర్వ ప్రబంధంబునందు హరిశ్చంద్ర చక్రవర్తి కథ వర్ణితము. శంకరకవి కృతికిని దీనికిని బోలికలుగలవు. దీని కర్త వీరశరభ కవి. ఆపస్తంబసూత్రుఁడు. కాశ్యపగోత్రుఁడు. శ్రీపతి పండితారాధ్యవంశ్యుఁడయిన వీరనారాధ్యున కీతఁడు, దౌహిత్రుఁడు. ఆ వీరనారాధ్యుఁడు, భద్రాయుశ్చరిత్ర, ధర్మగుప్తాభ్యుదయాది ప్రబంధకర్తగావచ్చును. ఈ కృతి మల్లికార్జునస్వామి కర్పింపఁబడినది.

---

## No. 933. హరిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, $12\frac{1}{4} \times 7\frac{5}{8}$ inches. Pages, 166. Lines, 4 on a page. Character, Telugu Condition, fair. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Same work as that described under No 923.

(వి-వి.)—

అవతారిక కొంతగాఁ దక్కిన గ్రంథమెల్లఁ గలదు. వ్రాఁత తిన్ననిదే. తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు.

ఇది నె 923 రున వర్ణితమయిన గ్రంథమే.

## No. 934. హరిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper Size, $12\frac{1}{8} \times 7\frac{5}{8}$ inches. Pages, 222 Lines, 20 on a page Character, Telugu. Condition, injured Appearance, old. Mode of writing, good but contains some mistakes.

Same work as that described under No 932 This MS. is appended with a supplement of 11 pages which forms a portion of the fourth Āsvāsa of the MS described under No 935.

It is stated that this MS was transcribed at Madras and dated 1–6–1.

(వి-వి.) —

సమగ్రము. వ్రాఁత తిన్ననిదే కాని తప్పు లున్నవి. శైథిల్యము గ్రంథ పాతములు నల్పముగాఁ గలవు.

ఇది నె 932 టున వర్ణితమైన గ్రంథమే కాని, 112 పత్రమున నుండి, 11 పుటలు, చతుర్థాశ్వాసమున నధిక పాఠము గలదు. అది నె 935 టున వర్ణింపఁబడినదే.

---

## No 935 హరిశ్చంద్రోపాఖ్యానము.

## HARIŚCANDRŌPĀKHYĀNAMU.

Substance, paper. Size, $12 \times 8\frac{1}{2}$ inches. Pages, 225. Lines, 21 on a page Character, Telugu Condition, slightly injured. Appearance, old. Mode of writing, good but contains mistakes.

Complete but not perfect.

Same work as that described under No 932 but is appended with a supplement of 10 pages which begins on fol. 114 (*a*) where a note by Mr. C. P. Brown runs as follows :—

"The following supplementary pages appertain not to this poem by Kanchi Virasarabhia but to the other by Nelluri Sancara Cavi"

Another note on the fly leaf of the MS is as follows :—

"The Tale of Harischandra by Virasarabhaya is exceedingly popular It is composed in a beautiful classical easy style ; it is an original Telugu poem and is full of amusing incidents."

(వి-వి.) —

అవతారిక తక్కఁదక్కిన గ్రంథ మెల్లఁ గలదు. అక్కడక్కడఁ జిన్నచిన్న గ్రంథపాతములు గలవు. వ్రాఁత యొకమాదిరిగా నున్నది గాని నిర్దుష్టముగాదు.

ఇది 932 వర్ణితమగు గ్రంథమే. ఈ సంపుటమున 114 నుండి పదిపుటలదాఁకఁ జతుర్థాశ్వాసమునఁ గొంత యధిక గ్రంథభాగము గలదు. అది శంకరకవి కృతిలోనిదని బ్రౌను దొరగారు వ్రాసిరి.

---

No **936.** హరిశ్చంద్రోపాఖ్యానము, సవ్యాఖ్యానము.

HARIŚCANDRŌPĀKHYĀNAMU WITH COMMENTARY

Substance, paper. Size, $12\frac{1}{2} \times 7\frac{5}{8}$ inches. Pages, 730. Lines, 20 on a page. Character, Telugu Condition, almost injured. Appearance, old. Mode of writing, good but not free from mistakes.

Wants the introductory portion ; otherwise complete.

Same work as the above, but this MS is followed by a commentary.

Date of transcription—2nd July 1847

**Beginning:**

Text—

వ. అనవరత శోభన పరంపరాభివృద్ధియగునట్టుగా నా రచియింపంబూనిన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహా ప్రబంధంబునకుఁ గథాసంవిధానం బెట్టిదనిన.

Commentary—

టీ. అనవరత । ఎల్లప్పుడున్ను । శోభన । శుభములయొక్క । పరంపరా । వరుసకు । అభివృద్ధి యగునట్టుగా । పెంపయ్యేటట్టుగాను । నారచియింపంబూనిన । నేను చేయనారంభించిన । హరిశ్చంద్రోపాఖ్యానంబను । హరిశ్చంద్రోపాఖ్యానము అని చెప్పఁబడుచున్న । మహాత్ । గొప్పదియైన । ప్రబంధంబునకున్ । కల్పనా కథకు । కథా । కతయొక్క । సంవిధానంబు । ప్రకారము । ఎట్టిదనినన్ । ఏప్రకారమనగా.

**End:**

Text—

మాలిని. సలలితశుభవాదా సామగానప్రమోదా
కలుషభయదశీలా ఖండితారింద్రజాలా
జలజరిపుకిరీటా జాహ్నవీతోయజూటా
చలితకరకురంగా సర్వభూతాంతరంగా

**Colophon of the Text :**

గద్య. ఇది శ్రీమత్సదాశివకరుణా కటాక్ష లబ్ధకవితా విశేయ వీర శరభ శుభనామధేయ ప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహా ప్రబంధంబునందు సర్వంబును పంచమాశ్వాసము.

(వి-వి.)—

సమగ్రమే కాని కృత్యవతరణిక కొఱఁత. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము గ్రంథపాతములు లేవు. సంస్కారములు బంతులనడుమఁ జేర్పఁబడినవి. ఈ ప్రతి 1847 వ సం॥ జూలై 2 వ తేది వ్రాయఁబడినదట !

ఇది 932 వర్ణిత గ్రంథమే కాని యిందు వ్యాఖ్యానముగలదు. వ్యాఖ్యాత పేరు గానరాదు.

---

## No. 937. సాంబచరిత్రము.

## SĀMBACARITRAMU.

Substance, palm-leaf. Size, $11\frac{1}{8} \times 1$ inches Pages, 146 Lines, 5 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Breaks off in some places.

Incomplete.

A Prabandha describing the story of the marriage of Sāmba, son of Lord Krsna, with Laksanā, daughter of Duryōdhana: by Rāmaya Kavi who belonged to Nandavarīka sect of Brahmans and son of Alugādri of Mukundapuri.

**Beginning :**

ఉ. శ్రీజనకాత్మజావదన శీతకరాగతిఁ బొంగెనంగు ము
ద్రాజితవార్ధిరీవిదనరన్ దొలిరూపము దెల్పుయాగభు
గ్రాజమణీసుధాము దినరాజకులాంబుధి సోముఁ గీర్తిమ
ద్రాజలలాము రాముని పదంబు లుదంచితభక్తిఁ గొల్చెదన్.

* * * *

గీ. వ్యాస వల్మీకభవ కాళిదాస బాణ
దండి భవభూతి మాఘసత్కవులఁ బొగడి
ఆంధ్రకవి నన్నయాఖ్యుఁ దిమ్మన్న మఱియుఁ
దగినసత్కవివరులఁ బోతన్న నెంచి.

* * * *

చ. ధరఁ బొగడొందునందవర ధారుణదేవతలందుఁ గీర్తులన్
గురుతరలీలఁ జెందిన ముకుందపురీ వరధామ వెంగయా
ఖ్యరహిఁ జెలంగు సద్బుధసుధాంబుధికిన్ విధుబింబభాతిమై
గరిమ జనించి మించె నళుఘాద్రియు ధైర్యహిమాద్రియై ధరన్.

క. ఋగ్వేదపఠన విలస
ద్వాగ్వరు మౌద్గల్యగోత్ర వంతుం డూర్జి
. . . సేవా
యుఁగ్వ్రేశు తనయుఁడనంగ నొప్పు నతనికిన్.

చ. పరగినపుణ్యభామ పతిభక్తిగుణంబుల సీమ బంధులం
దిరముగఁ బ్రోచులేమ జగతీ సురపూజన కామ నవ్యభా
సురశుభదామ సంతతవిశుద్ధ చరిత్రలలామ చింతితాం
బురుహదళాక్షనామ యనఁ బొల్పగు నాగమ నామ పుత్త్రియై.

క. మీ రిరువురు జనియించితి
రారూఢిన్ రామవేంకటాఖ్యల ధరణిన్
భూరితర కీర్తు లందితి
రాగయ నందగ్రజుండ పతిమతియుతుఁడవు(న్).

**Colophon :**

ఇది శ్రీమద్రామభద్రకరుణాకటాక్షలబ్ధ కవితా సుధారసానంద నందవరాన్వయ ప్రసిద్ధ మౌద్గల్య గోత్రపవిత్రముకుందపురి అళుగాద్ర్యార్యపుత్త్రి సరసకవిరామయాఖ్య ప్రణీతంబైన సాంబచరిత్రంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

**End :**

క. ఆరీతిగ నయ్యిరువురు
చారుసుఖావాప్తి నలరి స
. . . .
భూరిమహాభాగ్యలీలఁ బొదలిరి వేడ్కన్.

సీ. ఎంతగాలంబుదినేంద్ర పన్నగకిటి

(వి-వి.) —

సమగ్రము - మూఁడవయాశ్వాసము తుదియాకు తునిఁగిపోయినది. ప్రాఁత తిన్నది. తప్పు లున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు, గలవు.

శ్రీ కృష్ణుని కుమారుఁడగు సాంబుఁడు దుర్యోధనుని పుత్త్రికయగు లక్షణను వివాహమాడు కథ యిందు వర్ణింపఁబడినది. గ్రంథకర్త రామకవి - నందవరీకుఁడు - ముకుందపురి తిళుగాద్రి కుమారుఁడు.

---

## No 938. సాంబవిలాసము.

## SĀMBAVILĀSAMU

Substance, palm-leaf  Size, $17\frac{1}{8} \times 1\frac{1}{2}$ inches  Pages, 103  Lines, 6 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, fair but full of mistakes. The last fol. gives the different readings of this work

Complete

A Prabandha in three Āśvāsas narrating the story of the marriage of Sāmba, son of Lord Kisna, with Laksanā, daughter of Duryōdhana The author Citrakaviramanakavi has also written Trilōkasañjīvini, Abhimanyuvilāsamu, Sakalavarnanāpūrnarāmāyanamu and Kumāraguruvilāsamu The works of the author's father, Anantakavi are Hariścandranalōpākhyānamu, Harihararaslēsōdāharana, Sakalajīvasañjīvanaprabandha and Vamśāvali. Peddana, grandfather of the author, wrote Laksanasārasangraha and belonged to Prathamaśākhā sect of Brahmans.

**Beginning:**

ఉ. శ్రీకనకాంగి వక్షమునఁ జేర్చి సౌఖ్యమునందు దేవున
స్తోకదయా కటాక్షమునఁ జూచి నిజాశ్రితరాజికిన్ సిరుల్
జోకనొసంగు దానగుణ శూరు సుమావిభుసత్యచర్యు ద
ర్వీకరరాజగోత్రమున వేడుకనుండెడు స్వామిఁ గొల్చెదన్.

*    *    *    *

సీ. . . . . . . . .

ఉ. ఓరమణాఖ్య సత్కవికులోత్తమ మామకమంజులాహ్వయ
శ్రీరమణీయ నీ విపుడు చేయఁగఁబూనిన సాంబలక్షణా
సారసదృగ్వివాహ కథ సన్మతి మా కిపు డంకితంబుగాఁ
గూరుపు నీకుఁ గల్గు జయగుర్వచలాయు గభీష్టవస్తువుల్.

మ. అని గంభీరవచోగతింబలికి భర్గాంభోజ భూముఖ్యది
వ్యనికాయస్తుతచర్యుఁ డాఘనుఁడు దా నంతర్హితుండైన మే

ల్కని సంధ్యాదికకార్యముల్ సలిపి చాఁ నిద్వద్వదార్యాళితో
డను దత్స్వప్నవిధంబు నేను గడువేడ్కం జెప్ప వారెంతయున్.

సీ. * * * *

శంఖచక్రగదా సిరాట్యార్ఙ్గిరాజ
సంభరణధుర్యభుజ చతుష్కంబువాఁడు
సదయుఁడ తండు వేంకటేశ్వరుఁడె సిద్ధ
మితరులకు నిట్టి శుభగతు లెన్నఁగలవె.

సీ. సరసలక్షణసారసంగ్రహం బొనరించి
తనరె మీతాత పెద్దనకవీంద్రుఁ
డల హరిశ్చంద్ర నలాధీశ సత్కథా
శ్లేష సత్కృతికిఁ బ్రసిద్ధిగాఁగఁ
గవిహితుఁడౌచు వ్యాఖ్యానంబు నొనరించి
మఱియు నిందుమతీపరిణయంబు
మొదలైన సత్కావ్యములు చేసి రహిగాంచె
నచల మీతండ్రి యనంతసుకవి
చిత్రకవిమంజు లాన్వయక్షీరవార్ధి
చంద్రమూర్తివి సద్బుద్ధిశాలి వీవు
రమణసత్కవి నీ వొనర్పంగఁ బూను
కృతివతంసంబు నతని కంకితమొనర్పు.

వ. అని విజ్ఞాపించిరి విజ్ఞాపించిన నేనును నానందకందళతరంగితాంతరంగుండనై . . . . .

* * * *

క. అనఘునకును జనఘునార్జిత
ధనునకు మనువంశ జలనిధానేందునకున్
సనకసనందనముఖకృత
వినుతికిఁ గృతియై వహించు వేంకటపతికిన్.

వ. అంకితంబుగా నామొనర్పంబూనిన సాంబవిలాసంబను మహా ప్రబంధంబునకుఁ గథాసంవిధానం బెట్టిదనిన.

**End:**

క. అని సూతజుఁ డాద్యంతం
బును మునులకు సాంబభూపముఖ్య వివాహం

బును దచ్చర్యయు నెఱిఁగిం
చిన వారలు మోదమున్ భజించిరి మిగుల౯

* * * *

తోటకము. శరణాగత సజ్జన సంభరణా
శరదాతి వినీలలసత్కరణా
స్థిరతామరసవ్రజజిచ్చరణా
యురురాక్షస బాహుబలోద్ధరణా.

**Colophon :**

గద్య. ఇది శ్రీ హనుమద్వరప్రసాదలబ్ధ సారసారస్వతపాత్ర భారద్వాజ గోత్రపవిత్ర ప్రథమ శాఖావంశసంభవ సముజ్జ్వలత్కాత్యాయన సూత్రలక్షణసారసంగ్రహ రచనావిశారద చిత్రకవి పెద్దనార్య పౌత్ర హరిశ్చంద్ర నలోపాఖ్యానవ్యాఖ్యాన హరిహరశ్లేషోదాహరణ సకలజీవ సంజీవనప్రబంధబంధురవంశావళీ సృజనాధురంధరానంతసత్కవీంద్ర పుత్ర దయాదాక్షిణ్యాదిక సమస్తసద్గుణకదంబాంబాసమానాబళాంబికాగర్భశుక్తిక వారాశికుముదబాంధవ చరిత్ర శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరాంజనేయాంకన మంజులత్రిలోకసంజీవి న్యభిమన్యువిలాస సకల వర్ణనాపూర్ణ రామాయణ కుమారగురు విలాసాదిక దివ్యకావ్యకరణాతిధురీణ శేముషీవిశేషపారీణ రాఘవపాండవీయ విష్ణుచిత్తీయ వసుచరిత్రముఖ కఠిన కావ్యార్థబోధన సమర్థ హృదయకమల విద్వత్కవీంద్రవిధేయ వేంకటరమణ నామధేయకవీశ్వర విరచితంబైన సాంబవిలాసంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి.)——

సమగ్రము. వ్రాఁత మంచిది. తప్పు లున్నవి. శైథిల్యమెక్కువగాఁగలదు. గ్రంథపాతములును గలవు.

మూఁడాశ్వాసముల యీ ప్రశస్తప్రబంధమున కృష్ణకుమారుఁడగు సాంబుఁడు దుర్యోధన పుత్త్రియగు లక్షణను బెండ్లియాడు కథ వర్ణితమైనది. గ్రంథకర్త చిత్రకవి రమణకవి. ప్రథమశాఖవాఁడు. ఈతఁడు త్రిలోకసంజీవని, అభిమన్యు విలాసము, సకల వర్ణనాపూర్ణ రామాయణము, కుమారగురు విలాసము అను ప్రబంధముల రచియించెను. ఈతనితండ్రి యనంతకవి హరిశ్చంద్ర నలోపాఖ్యాన వ్యాఖ్యానము, హరిహరశ్లేషోదాహరణము, సకలజీవసంజీవన ప్రబంధము, వంశావళి, యను కృతులను రచించినవాఁడు. ఈతనితాత పెద్దనకవి లక్షణసారసంగ్రహమును రచియించెను.

## No 939. సీతాకల్యాణము (నిరోష్ఠ్యము).

## SĪTĀKALYĀṆAMU (NIRŌṢṬHYAMU)

Substance, palm-leaf. Size, 16 × 1⅛ inches Pages, 64. Lines, 5 on a page. Character, Telugu. Condition, very much injured. Appearance, old. Mode of writing, good but contains mistakes Breaks off in some places

Contains the Āśvāsas 1—4 only.

A Prabandha describing the story of the marriage of Sītā with Śrī-Rāma. The author Basavappa, son of Piduparti Basavanāmātya, has composed this work without using the labial letters (ఉ, ఊ, ప, ఫ, బ, భ and మ).

**Beginning:**

సీ. శ్రీకరకటకంఠి శ్రీకేళికాధర
 రత్నకీలితలసద్రాజసదన
హారినీలసాలనిరంతరచ్ఛాయాంధ
 కారసంఛాదితగగనరత్న
కృతకాద్రికందర క్రీడారతాంగనా
 జనకృతక్షేచరీసాహచర్య
అనిలచలతేరళి . . ఘణ
 తారరసంత్రాసిత తరణిరథ్య
అఖిలకళ్యాణకలనానిరంతరాళ
సంర్షసన్నద్ధసకలగృహస్థ యనఁగ
నగణితశ్రీల నిర్జరనగరికంటె
నాతతఖ్యాతిఁ గాంచె సాకేతనగరి.

**End:**

భుజంగప్రయాతము.

ధనాధీశరాధేయధారాధరాంఖో
ధినాథావనీభృద్ద్విషద్ధేనులీలా
సనాథప్రదాన ప్రశంసాసుధీరం
జనానన్యసామాన్యసౌజన్యధన్యా!

**Colophon:**

ఇది శ్రీ దక్షిణామూర్తిప్రసాదసమాసాదితసాహిత్యసౌహిత్యానువర్తన పిడుపర్తి బసవనార్యసత్పుత్త్రి బసవప్ప ప్రణీతంబైన సీతాకళ్యాణచరిత్రంబున నిరోష్ఠ్యకథాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

(వి-వి.)—

అసమగ్రము. ఆరంభమునసుండి నాల్గాశ్వాసములు మాత్రము గలవు. వ్రాఁత చక్కనిది. తప్పులున్నవి. శైథిల్యము, గ్రంథపాతములు గలవు.

సీతాకల్యాణమని పేరుగల యీ నిరోష్ఠ్య ప్రబంధమున సీతావివాహకథ వర్ణితమయినది. పవర్గము, ఉ, ఊ, ఒ, ఓ, ఔ లు లేకుండ గ్రంథమెల్ల రచింపఁబడినది. గ్రంథకర్త పిడుపర్తి బసవప్ప కవి. బసవన కొడుకు. దీక్షాబోధము, పద్య బసవపురాణము మొదలగు కృతుల రచియించిన పిడుపర్తి కవులతో నేతత్కృతికర్తకు సంబంధముగలదో లేదో యెఱుఁగరాదు.

---

## No. 940. హంసవింశతి.

## HAMSAVIMŚATI

Substance, palm-leaf Size, $16\frac{7}{8} \times 1\frac{1}{7}$ inches Pages, 308. Lines, 7 on a page. Character, Telugu. Condition, much injured. Appearance, very old. Mode of writing, good but not free from mistakes. Breaks off in some places

Wants the introductory portion : otherwise complete.

Same work as that described under No. 912 ante.

(వి-వి.)—

సమగ్రము. వ్రాఁత మంచిదే కాని తప్పులు గలవు. శైథిల్యము హెచ్చుగా గలదు. గ్రంథపాతములు లేవు

డి. నె 912 రున వర్ణితమైనదే.

---

## No. 941. హరిశ్చంద్రనలోపాఖ్యానప్రకాశిక.

## HARIŚCANDRANALŌPĀKHYĀNAPRAKĀŚIKA.

Substance, paper. Size, $12\frac{1}{4} \times 8\frac{7}{8}$ inches. Pages, 167. Lines, 25 on a page. Character, Telugu Condition, injured. Appearance, very old. Mode of writing, good but contains mistakes.

Complete without the introductory portion

Same work as that described under No. 936 ante.

(వి-వి.)—

సమగ్రమే కాని యవతారిక లేదు. వ్రాఁత మంచిదే కాని తప్పు లు గలవు. శైథిల్యము గ్రంథపాతములు హెచ్చుగా గలవు.

డి. నె 936 రు న వర్ణితమైనదే.

# GENERAL INDEX.

[సూ. రా.—అడుగున గీతగీయఁబడిన పేళ్లుగల గ్రంథము లీ క్యాటలాగున వర్ణింపఁబడినవి.]